

సంపుటము 18
సంచిక 8

# భారతి

వృష శ్రావణము
1941 ఆగస్టు

# తీయని త్రోవ

శ్రీ విశ్వనాథ
సత్యనారాయణ

తీయని కోకిలామదవతీకలకూజితపుష్పవాటికా
చ్ఛాయలయందు ప్రేమరససంభరితాంచలచంచలాక్షినై
ప్రేయసి తేనియల్ తొణుకు వెచ్చని యౌవనపారిజాతముల్
దోయిలి పట్టి నాయెదుట తోఁచె సుహాయనరమ్యమూర్తియై.

ఓయని పిల్చినన్ పలికె నోయన మా తలపైనికొమ్మలో
కోయని కూజిత మ్మొలికె కోయిలకన్యక ప్రేమగీతికా
పేయరసమ్ము కానుకలు పెట్టినవోలిక కుక్షిలోపలన్
చేయిడి అన్నము న్గొనెడు స్నేహితుమాదిరి వెల్లడించుచున్.

వేలుపుపూలదొంతరల వెట్టినకోయిలిమీఁద తెక్కలన్
వ్రాలకయుండ ప్రేమరసభావ మెఱింగినయట్లు షట్పదీ
జాలము చేతియంగుళుల చాయల నూయెలత్రాళ్లవోలికన్
మాలికగా ప్రదక్షిణసమర్చన సల్పెను జోలపాడుచున్.

మాఁగుననంటిపండ్ల రసమాధురిచొక్కిన చిల్కదంపతుల్
మూఁగిన కామపుంబరువు మోయఁగఁజాలక సొక్కినట్టినై
తీఁగల వంచి మాప్రణయతీర్థపు పున్నెపుసేవ సేయునో
నాఁగను పల్కె మాకెలన నాటిన చక్కెరకండమొల్కగాన్.

వ్రాలిన కొమ్మకొమ్మకును బంగరుపిట్టలు జంటజంటలై
జాలులు జాలులై కిచకిచల్ కుడిఱెక్కలు సాఁచి సాఁచుటల్
తూలిన తూలుటల్ కొదమతూఁగులు దక్షిణపాదనాట్యముల్
వ్రేలిన పచ్చవింటిదొరపెండిలితోరణముల్ రచించెడున్.

బంగరుతీవవిల్ చెఱకు వంచి రసార్ద్రమనోజభావనా
సంగతులైన మా ప్రణయజంపతు లుండిన పూవుటీరపున్
చుంగుల నుత్తరీయమును సోకుగఁ గప్పినరీతి వేణికా
భంగముతీర్చి నొక్క సెల పాయలుపాయలుగాఁగ దీర్చుచున్.





# సంస్కృతాంధ్ర వ్యాకరణములు

= శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి =

ప్రపంచము పరమేశ్వరునిచే సృజింపఁబడిన నామరూపాత్మకము. అందు రూపవ్యవహారముకొఱకు నామ మావశ్యకమని యుద్ధానితోడనే నామము సృజియింపఁబడినట్లు "నామరూపే వ్యాకరవాణి" "సర్వాణి రూపాణి విచిత్య ధీరః, నామాని కృత్వా అభివదన్ యదాస్తే" యను శ్రుతిసమన్వయమువలనఁ దెలియుచున్నది. ఇట్టి నామము ధ్వనిరూపమై సకల వ్యవహారములను నిర్వహింపఁదగియున్నది. ఇత్యదియే భాష యనంబడు.

ఇట్లు వ్యవహార నిర్వాహక మగు భాష కొలఁది నేకరూపమై ప్రవర్తించుచు లోకము నేకరూపముగాఁ బ్రవర్తింపఁజేయుచు నానాయి భాషావిభాగాము హేతువులంబట్టి వివిధము గాఁజొచ్చినది. అకతమునఁ గొంతకాలమునకు జను లర్థగ్రహణమునఁ గృతప్రయత్నులు గావలసివచ్చినది. భాషాపరిజ్ఞానము లేని వారిమాటలనుగాని, మండలాంతరములందలి మాటలనుగాని, దెలిసికొనుటకుఁ గష్టపరిస్థితు లేర్పడినవి. భాష యెందులకు సృజియింపఁబడెనో యా ప్రయోజనము సర్వవ్యాపి గాకుండఁబోయెను. కావున నవ్వాని నేకముఖముగా నొనర్చి యుద్దిష్టమగు ప్రయోజనమును ఘటింపఁ జేయుట యత్యావశ్యక మాయెను. ఎయ్యది యైన నొకే విధమగు పద్ధతి లేక నానారీతులుగ వ్యవహరించు నవసరము గల్గినచో నద్దాని నేకరూపముగా నొనర్చి యుండఁబచే వ్యవహరింపఁజేయుటకుఁ జట్టము లేర్పడినవి. అట్లుగానిచో లోకవ్యవహారము క్రమముగాఁ గుంఠిత మగును. కనుకనే మనకు ననాదిగా భగవన్ముఖమున నిఃసృతమగు వేదము తదనుసారియగు స్మృతి బయల్వెడలెను. భాషకుఁగూడ నట్లే మనవారు దేశాంతరములు తమముఖమున దా మెఱుంగక మున్నే కొన్ని నియమముల నేర్పఱుపఁ దలఁచిరి. అందుఁ గృతార్థులై యొకానొక పద్ధతి ననుసరించిరి. అయ్యది యే వ్యాకరణము. అది క్రమముగా భాషాశాసనము వలన శాస్త్రమైనది.

ఈతీరున బయల్వెడలిన భాషాశాస్త్రమునకు శాస్త్రకర్తల విజ్ఞానాతిశయముచేఁ బెక్కులు ప్రయోజనములు సంఘటించెను. ఈ శాస్త్రము స్వల్పవర్ణోచ్చారణ భేదముచేఁ గల్గు నర్థములను స్పష్టపఱచి వాని సాంకర్యమును దూరీకరించుచుఁ, బదప్రయోగములలోని మూలభూతమగు నర్థము (పదప్రవృత్తినిమిత్తము) వ్యుత్పత్త్యాది ప్రదర్శనముచే వెల్లడించుచు, భాషాస్వరూపము నచిరకాలములోనే సుముఖముగ బుద్ధిగోచరమగునట్లు చేయుచు మిగుల ప్రయోజనమును గనుచున్నదని పతంజలిమహాశయుఁడు తన మహాభాష్యమునఁ గొలఁది "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజన" మ్మని నుడివెను. అందు 'న చాన్తరేణ వ్యాకరణం లఘునోపాయేన శబ్దాః శక్యా విజ్ఞాతు' మ్మనియు, "అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణ" మ్మనియుఁ జెప్పుచు వ్యాకరణాధ్యయనమువలనఁ గల్గు బాధలను "తే సురా హేలయో హేలయ ఇతి కుర్వన్తః పరాబభూవుః, తస్మాద్బ్రాహ్మణేన న

మ్లేచ్ఛిత వై, నాపభాషితవై, మ్లేచ్ఛోహవా ఏష యదపశబ్దః, మ్లేచ్ఛా మాభూమే త్యధ్యేయం వ్యాకరణ" మ్మనియు, "దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధా" త్తనియు మిగుల విచిత్రముగఁ బ్రదర్శించియున్నాఁడు.

అందుఁ గొన్ని కేవలము సంస్కృతమునకే వర్తించినను భాషాశాస్త్రసామాన్యమునకుఁ గూడఁ జాల వర్తించును. ఇంతియ గాదు. "శశః-షషః, శకృత్-సకృ" త్తను మొదలగు రూపములు వర్ణమాత్ర భేదముచే నర్థభేదము గనుచున్నవి. భాషాతత్త్వవిమర్శనమునకుఁ గడఁగినచో, 'విప్ర, విఖ్య' శబ్దములు ముక్కుడి వాచకము లనియు, 'నర్త'శబ్దము బహుశ్రీహిని నకారాంతమగు ననియు, 'హిత' శబ్దము 'ధా' ధాతూత్పన్నమనియు, 'ప్రజ్ఞ, సంజ్ఞ' శబ్దములు ప్రగత సంగత జానమద్వాచకము లనియు నెవ్వ రెఱుంగుదురు? కావున నిట్టి ప్రయోజనము లసంఖ్యేయములు వ్యాకరణమువలన నొనగూడుచున్నవి.

ఇట్టి యమేయ ప్రయోజన సంభరితమగు వ్యాకరణమును రచియించు పద్ధతులను విచారింపఁగా నాల్గు విధములుగఁ గన్పట్టుచున్నవి—

౧. పదముల ప్రవృత్తి నిమిత్తముల వ్యక్తపఱచుచుఁ బ్రకృతిప్రత్యయముల విమర్శించుచుఁ గాలక్రమమున సహజముగ భాష పొందెడి విశేషభేదములను భాషాపరిణామదృష్టిచే విమర్శించుచు వ్యాకృతి నొనరించుట.

౨. కేవల ప్రాచీన వ్యాకరణముల ననుసరించి ప్రకృతి ప్రత్యయవిభాగమును మాత్రము సూచించు వ్యాకృతి నొనరించుట.

౩. వ్యుత్పత్తి మాత్ర మొనరించి పదపదార్థములను జెప్పు వ్యాకృతి నొనరించుట.

౪. భాషాశాస్త్ర మాత్రము ననుసరించి ప్రకృతి ప్రత్యయ రూపములను దెల్పు వ్యాకరణమును రచియించుట.

ఇందుఁ దొలుత నిరూపింపఁబడిన వ్యాకృతి ప్రకృష్టతమము. అయ్యది భాషకుఁ గల్గు సహజములగు పరిణామములను వ్యక్తపఱచుచుఁ గ్రమంబుగ భాషను సుగమముగ బోధించును. రెండవదానియందు భాషాధ్యయనమాత్రమే ప్రయోజనము గాని వేఱొండు లేదు. మూఁడవది పదవ్యుత్పత్తి మాత్ర ప్రదర్శకం బగుటచే నయ్యది భాషా సంగ్రహణమునకు భాషా విపరిణామ జ్ఞానమునకు నిరుపయుక్త మగుచున్నది. నాల్గవది యన్నచో కేవలము భాషావిపరిణామమునే దెల్పుచు భాషాధ్యయనమునందు వ్యుత్పత్త్యర్థ గ్రహణమునందుఁ గుంఠితప్రయోజన మగుచున్నది. వీనియందుఁ బాణినీయము ప్రథమకక్ష్యకుఁ జెందియున్నది. అయ్యది భాషాపరిణామపద్ధతిని వాచ్యముగఁ జెప్పకపోయినను మునిత్రయమునందలి మతభేదవిమర్శనముచేతను ప్రాచీనార్యమత నిరూపణముచేతను వ్యంగ్యమర్యాదచేఁ దెలియఁజేయుచున్నది. పాణినీయమునందలి స్థాన ప్రయత్నప్రకరణము సంధిమాత్రప్రకరణము సంప్రసారణాది విధాయక శాస్త్రమును నర్వాచీనభాషా తత్త్వవిమర్శనాపద్ధతికి నిదాన మగుచున్నది.

రెండవ కక్ష్యకు ముగ్ధబోధాది వ్యాకరణములు చేరినవి. వీనియందుఁ జెప్పఁదగిన విశేషములు గానఁబడవు.

మూఁడవకక్ష్యను నిరుక్తాది ప్రాచీన వ్యాకృతు లనుసరించినవి.

నాల్గవకక్ష్యకుఁ బ్రకృతమున నితరభాషా సహాయమున భాషాతత్త్వ విమర్శనకుఁ గడఁగిన విమర్శకుల వాఙ్మయచరితములు చేరును.

ఇట్టి వ్యాకృతి ప్రసంగమున నాద్యయగు సంస్కృతంబునకు బయల్వెడలిన వ్యాకరణముల యుత్పత్త్యాదికమును గూర్చి యొకింత విచారింతము.

వేదములలోఁ బ్రధానమగు ఋగ్వేదము నందలి గొన్ని భాగములందు వ్యాకరణ ప్రశంసచేయఁబడుటచే నాఁటికే సంస్కృతభాషా రక్షకులగు మంత్రద్రష్టలగు ఋషులద్దానిని (వ్యాకరణము)గూడఁ బ్రకాశింపఁ జేసిరేమో యను నాశయము వొడముచున్నది. పతంజలి వ్రాసినటుల "చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాన్ ఆవివేశ"

యను మంత్రమునకు నా శబ్దశాస్త్ర పరమగు నర్థమే వేదపురుషునిచే సంకల్పితమగుచో నాఁటికే వ్యాకరణములు సిద్ధములని చెప్పనొప్పును. వేదస్వర రక్షార్థమై ప్రాతిశాఖ్యలెన్నియో నాఁటికి ఋషిదృష్టములగుట సత్యము. "చత్వారి పదజాతాని నామాఖ్యాతోపసర్గ నిపాత భేదా"త్తను నిరుక్త వాక్యములఁ బట్టిగూడ వ్యాకరణము లత్యంత ప్రాచీనములని తెలియకపోదు.

ఇది యిట్లుండ నిఁక లౌకిక సంస్కృత భాషా సాధకములను శబ్దశాస్త్రములు పాణినికిఁ బూర్వమే బయల్వెడలిన వనుటకుఁ బాణినీయము నందు "శాకల్య, శాకటాయన, ఆచార్య, ఆపిశలి, చాక్రవర్మ, గార్గ్య, కాశకృత్స్న, భారద్వాజ, స్ఫోటాయన ప్రభృతుల నామములను బాణిని గ్రహియించుటే సాక్షి. ఇందలి వ్యాకృతికర్తల గ్రహణ మిట్లుండఁగా శబ్దశాసకుల యభిధానములను దెల్పు నొక పద్యము సంస్కృత వాఙ్మయమున —

"ఇంద్ర శ్చంద్రః కాశకృత్స్నాపిశలీ శాకటాయనః
పాణి న్యమర జైనేంద్రా జయ న్త్యష్టాది శాబ్దికాః.

యని వెలయుచున్నది. ఇదియే గ్రంథపరముగాఁ గొంచెము మార్పుతో —

"ఐంద్రం చాంద్రం కాశకృత్స్నం కౌమారం శాకటాయనమ్, సారస్వతం చాపిశలం శాకలం పాణినీయ"మ్మని వ్యవహరింపఁబడుచున్నది. వీరేగాక పౌష్కరస దుర్గ వ్యాఘ్రభూత్యాదులు శాస్త్రములఁ దెలియవచ్చుచున్నారు. పై కారికలయందుఁ జేర్కొనఁబడిన వ్యాకర్తలలోఁ గొందఱు పాణినిచే స్మరింపఁబడినను దత్కర్తృకములనలె నేఁ డుపలభ్యమానములగు శబ్దశాస్త్రములు యథార్థముగా వారిచే రచింపఁబడినవి యెంతమాత్రము కావు. రచనావిధానమునుగాని, విషయమునుగాని పరిశీలించినచో నయ్యవి పాణినీయమునకంటె నర్వాచీనములే యని చెప్పుటకుఁ జెక్కు ప్రమాణములు గానవచ్చుచున్నవి. కావున నిపుడు గల వ్యాకరణము లన్నింటఁ బాణినీయమే ప్రాచీనతమ మని నిర్వచింప నొప్పును. అంత ప్రాచీనముగా బయల్వెడలిన పాణినీయమునకు వాఙ్మయమున నింత ప్రాధాన్య మెట్లు వచ్చినదో విమర్శింతము—

సంస్కృతవ్యాకరణము వెలసిన కాలములో నొకవైపు ఋషులు వేదకర్మలను బ్రవర్తింపఁజేయుచు వేదములను బూజ్యతమములుగాఁ జూచుచుండిరి. సకల రసోద్దీపకమై సర్వభావాభివ్యంజకమై దేశమునం దంతట వ్యాపించియున్న సంస్కృతభాష నొకవైపు వ్యవహరించుచుండిరి. ఆనాఁడు సంస్కృతభాష నానా చిత్రగతులఁ బ్రవర్తించుచు నిర్విఘ్నముగఁ బ్రవర్తించుచుండెనని నిర్వచించుటకు నెంతమాత్రము వీలుగాకుండెను. శబ్దార్థముల రెంటింటను మనోహరంబులగు ప్రయోగములఁ గనుచుండెడివి. సర్వ వ్యవహారములును బూర్ణముగ సంస్కృతభాషయందే జరుగుటచే నాభాష మహోత్కృష్టంబగు దశ నొందుచుండెను. దేశాంతరవాఙ్మయప్రాశస్త్యమును గాని, ప్రాచీనతనుగాని, దేశాంతర నాగరకతనుగాని, యసూయాగ్రస్తతచే లేశమాత్రమైనను సహింపని దేశాంతర విమర్శకమ్మన్యులుగాని తద్దేశవాసులగు భారతీయులుగాని సంస్కృతము వ్యవహారజుష్టము కాదని పలికిన మాత్రాన సత్యము మఱుఁగువడకుండునగదా!

ఇట్లు విజయమాకిడిన లౌకికభాష సర్వతోముఖ వ్యాప్తమగుచు విజృంభించుచుండ నిది యిఁక నిబద్ధంబు కానేరదేమో యని ఋషులు భయంపడి యద్దాని పెచ్చుపెరుగుటను సహింపనివారలై కృతప్రయత్నులయ్యుఁ దొలుతనే కార్యసిద్ధి వడయరైరి. అట్టి సమయాన నీపాణిని దైవసహాయముచే నీ మహోగంభీరంబగు వ్యాకరణము వ్రాయఁ దొడఁగి కృతకృత్యుఁ డాయెను. ఈ పదశాస్త్రమునే 'యష్టాధ్యాయి' యందురు. దీనియందు ౩౯౯౬ సూత్రములు గలవు. ఇయ్యది పవిత్రతమముగా నెన్నఁబడు వైదికభాష నొక హస్తమున సంస్కరించుచు వేఱొక కరంబున లౌకికభాషను సంస్కరించినది. ఇందుఁ గేవల వైదికమాత్రోపయోగులగు సూత్రము లాఱు వందలకుఁ గొన్ని చిల్లరగా నెక్కువ యుండును. ఈమహాశాస్త్రమున కంతకును మాహేశ్వర సూత్రములను దొలి పదునాల్గు సూత్రములు మూలభూతము లగుచున్నవి. యథార్థముగాఁ జెప్పవలయునన్నఁ బాణినీయమంతయు నీపదునాల్గు సూత్రములలోనే యిమిడి యున్నదని వక్కాణింపవచ్చును. 'హలంకమ భాషా

స్వరూపవ మీ మాహేశ్వర సూత్రములయందుఁ బ్రతిఫలింపనిచో నీ శాస్త్రమును వ్రాయుట దుశ్శకము. ఈ చతుర్దశ సూత్రియందు శాస్త్రోపయోగిగా లోకమున వ్యవహరింపఁబడని యక్షర విన్యాసము గన్పట్టుచున్నది.

ఇట్టికృతిచే 'పాణిని తననాఁటి భాషను సంపూర్ణముగ సాధింప నెంచి కృతకృత్యుఁడాయెను. కాని యానాఁడది జీవద్భాష యగుటంజేసి పాణిని యనంతరము భాష మఱలఁ బెరుగఁజొచ్చెను.' భాష యందుఁ బెక్కు మార్పులు గల్గినవి. ఆసమయముననే కాత్యాయనుఁడు తన నాఁటి భాషను శోధించి శుద్ధముగ సంస్కరించెను. ఆసంస్కరణములు నాఁటికిఁ జెల్లినను గ్రమముగఁ గాలము గడచిన వెనుక భాష యభివృద్ధి నందుటచే నీ భాషాసంస్కరణములన్నియుఁ మూలఁబడినవి. అపభ్రంశ భాషలయొక్క పదములు గొన్ని దేవభాషఁ బ్రవేశింపఁ జొచ్చినవి. కావున నీ సాంకర్యము నంగీకరింపని వారై మఱల సంస్కరింప ఋషులు తలపెట్ట నపుడు పతంజలి మహాశయుఁడు భాషను జాగ్రత్తతోఁ బరిశీలించి పర్యాప్తంబగు సంస్కృతికొఱకు భాష్యంబును వ్రాసెను. ఇయ్యదియే సంస్కృతభాషకుఁ దుదిసంస్కరణము. పాణిని కాత్యాయన పతంజలుల యుత్తరోత్తర ప్రామాణ్యంబున కియ్యదియే హేతువు. కాలక్రమమున భాష వ్యవహారమునుండి తొలఁగినది, అపభ్రంశములు గొన్ని దాని స్థానము నాక్రమించినవి.

ఇట్లు భాషావ్యవహారదశయందుత్పన్నమైన పాణినీయము నాఁటిభాషను బూర్తిగ సంస్కరించుచున్నను నిప్పటి తెలుఁగు వ్యావహారిక ప్రయోగములవంటి ప్రయోగముల నయ్యది సాధింపలేదు. సాధింపఁ బూనినట్లును గన్పట్టదు. ఏలయనఁగా నితిహాసములు పురాణములు మున్నగునవి ముఖ్యముగ స్త్రీ శూద్రులకొఱకే యని నాఁటి జనుల యాశయము. కావున వారికి సుబోధములగు వ్యావహారిక పద్యగథనములతో నవ్వానిని రచియించిరి. కావున వానిసాధనముతో వారికిఁ బ్రసక్తి లేకుండెను. రామాయణ భారతాదులయం దపాణినీయంబులగు ప్రయోగంబు లందువలననే గన్పట్టుచున్నవి.

భాషాప్రయోగసరణి ననుసరించి పుట్టిన యీ భాషాశాస్త్రము క్రమముగాఁ దాను భాషయధీనము నుండి దప్పి భాషనే తన యధీనము చేసికొనెను. అట్లగుటకు సంస్కృతము వ్యవహారమున నున్న సమయమునఁ బాణినీయ మట్టి భాషను సమగ్రముగ సాధించుటయే కారణము. నాఁడు పాణినీయమున కభూతపూర్వమగు శాసకతాబలము చేకూరినది. భాష యేనాఁడు వ్యవహారమునుండి తొలఁగెనో యానాఁడు వ్యాకరణమునకు మఱింత బలము హెచ్చినది. ఇఁక మీఁద భాష నభ్యసించువారలు సనాతనవాఙ్మయమునే యాధారముగాఁ గైకొనవలసివచ్చినది. ఆ వాఙ్మయమన్నదో శాస్త్రమున కధీనమై యున్నది. కావున సంస్కృతభాషకు వ్యాకరణమే సర్వాధిపతి యాయెను. ఆపరిస్థితులు వేఱొక వ్యావహారికభాష కెట్లు వచ్చును?

ఏవంవిధ సంబంధములతోఁ బరిణతి నొందిన భాషాశాస్త్రముల రెంటిటి విషయమై క్రమక్రమముగ జనులకు వ్యాకరణమునుండియే భాష జనించెనేయను భావము గలుగుస్థితి యేర్పడినది. ఈస్థితి పాణినీయమునకు సామ్రాజ్యాధిపత్యము గల్గినవెనుకఁ బతంజలి కాలముననే యంకురించె నేమోయను నూహకు నీదిగువ మహాభాష్యగ్రంథము తావొసంగుచున్నది—"లోకతః" యను వార్తికవ్యాఖ్యావసరమున —

"ఘటేన కార్యం కరిష్యన్ కుంభకారకులం గత్వాహ, కురు ఘటాన్ కార్యమనేన కరిష్యామీతి, న తద్వచ్ఛబ్దాన్ ప్రయుయుక్షమాణో వైయాకరణకులం గత్వాహ కురు శబ్దాన్ ప్రయోక్ష్య ఇతి"

యని చెప్పంబడియెను. పై భ్రాంతులను నివారించుటకే "ప్రయోగమూలం వ్యాకరణం" "ప్రయోగశరణా వైయాకరణా" యను మున్నగు నుడువులు బయల్వెడలినవి. ఈవచనము లాంధ్రవిషయమున ముందు విమర్శింపఁబడును.

ఇట్టి యుత్పత్తి స్థితి పరిసమాప్తులతోఁ గూడిన పాణినీయము తరువాతి కవుల ప్రయోగములను సాధింపలేదని యాగ్రహింపడుట శోచనీయము. పాణినీయ సంస్కర్తృత్వ మొకచో నాఁగినపుడు తరువాతికవులు నూతనముగాఁ బ్రయోగించిన ప్రయోగములను పాణినీ

యము సాధింపలేదని మనుపుట యెంత న్యాయము? అప్పటికిని న్యూనత గల్గునేమోయని ప్రకృతకావ్యములం దుపలభ్యమానములగు 'అక్షౌహిణి, లలితాంగి, సుగాత్రి' మున్నగు పెక్కురూపముల నెట్లో పండితులు సాధింప యత్నించుచున్నారు. కాని వారును "తం పాతయాం ప్రథమమాస", "ప్రభ్రంశయాం యో నహుషం చకార" "త్రియంబకం సంయమినందదర్శ" మున్నగు ప్రయోగములందు హతయత్నులగుచున్నారు. కాని కొన్నింటినిమాత్రము పాణినీయముకంటె నర్వాచీనములగు వ్యాకృతులనిపాతములవలె నెట్లో త్రెంక్కబసి తీర్చుకొనుటకు మాత్రము శ్రమపడి సాధింప యత్నించుచున్నవి. అంతమాత్రమునఁ భాష కేమిలాభము గల్గునో!

పైవిధముగ భాషాసంస్కారణమునకు బయల్వెడలిన పాణినీయము పదపదార్థసంబంధంబులఁ జర్చించుచుఁ గ్రమముగ భాషాసంస్కారమునం దభిరుచి త్యజించి తచ్చర్చావిషయమున శాస్త్రాంతరములతోడి సంబంధమును గలుగఁజేసికొనెను. కావున వార్తికగ్రంథములు గొన్ని బయల్వెడలినవి. వీనికిఁ బ్రక్రియతోడను బూర్ణముగ నష్టాధ్యాయితోడను సంబంధము వ్యగ్రము. పెచ్చుపెరిగిన యీగ్రంథముల జ్ఞానమునకు శాస్త్రాంతరముల పరిచితి యావశ్యకము కాఁజొచ్చెను. కావున వైయాకరణులు గౌతమ కాణాదపూర్వమీమాంసోత్తరమీమాంసల నభ్యసింపక పోయిన వ్యాకరణమునఁ బరిజ్ఞానము గల్గదని విశ్వాసము పండితులకు ముదిరెను. శాస్త్రమనిన నేదియో యొక యాధ్యాత్మిక సిద్ధాంత ముండకతీర దనువాదము లోకమునఁ బ్రబలఁగా వైయాకరణులుగూడఁ దాము స్ఫోటబ్రహ్మవాదులు కాఁజొచ్చిరి. కావుననే—

"శాస్త్రేషు ప్రక్రియాభేదై రవిద్యైవోపవర్ణ్యతే,
సమారంభస్తు భావానా మనాదిబ్రహ్మ శాశ్వతమ్.
ఇత్థం నిష్కృష్యమాణం యచ్ఛబ్దశాస్త్రం నిరంజనమ్,
బ్రహ్మైవేత్యక్షరం ప్రాహు స్తస్మై పూర్ణాత్మనే నమః"

యను మొదలగు సిద్ధాంతములు బయల్వెడలినవి.

ఇట్లు సిద్ధాంతతత్త్వముగా నంగీకరింపఁబడిన స్ఫోటబ్రహ్మవాదము పాణినీయమగు నష్టాధ్యాయి యందుఁగాని వార్తికకార వచనములందుఁగాని గన్పట్టదు. పతంజలివాక్యములోమాత్రము సూచితమని వైయాకరణులు సాధింతురు. క్రమముగా నిట్లు స్ఫోటబ్రహ్మవాదులైన వైయాకరణులు పాణినీయమునే వేదాంగముగా నంగీకరించి సూత్రపారాయణముచేఁగూడ "సకల వేదపారాయణజం పుణ్యం లభతే" యని సిద్ధాంతీకరించిరి

ఇదియిట్లుండఁ బ్రధానముగా నుద్దిష్టమగు ప్రక్రియావిషయము మరింత ఘోరమైనది. వ్యాఖ్యానములపై వ్యాఖ్యానముల రచియించుచు మూలార్థమును దురవగాహ మొనరించుచుండిరి. ఒకరివాదముల నొకరు ఖండించుచు ననేకయుక్తులను న్యాయములను బ్రదర్శించుచు శాస్త్రమును వృద్ధిసేయఁ దొడఁగిరి. ఇయ్యది బుద్ధివికాసార్థమైనను బ్రకృతమున శాస్త్రమున కుద్దిష్టమగు ప్రయోజనముమాత్రము మఱుగుపడఁ జొచ్చినదని మాత్రము చెప్పకతప్పదు. సభలలో వాదములవఱకు వ్యాకరణము వ్యాపించినది. నేటికాలము వారన్ననో ప్రాచీన శక్త్యవకాశహీను లగుటంజేసి వాదోపయోగులగు వ్యాఖ్యానములనుమాత్రమే చదువుటంజేసి మూలము లీనముకాఁజొచ్చినది. ఇట్లు పరిణతి నొందిన భాషాశాస్త్రవిచారము భాషాసంస్కారమునకు నెట్లుపయోగపడునో తన్నిష్ణాతులే యూహించుకొనునది.

ఇఁక మనయాంధ్రభాషను దద్వ్యాకృతులను నొకించుక పరిశీలింతము. "అంధా నామ గావః అత్ర చరంతి" యను వ్యుత్పత్తిగల్గి యీ'యంధ్ర' శబ్దమస్మద్దేశమును బోధించుచున్నది. ఈయంధ్రమే 'యాంధ్ర' మైనది కావుననే వాఙ్మయమున 'నంధ్రభాష, యాంధ్రభాష' యను ద్వివిధ వ్యవహారము గానంబడియెడి. ఈదేశము దాక్షారామ, శ్రీశైలఁ కాళేశ్వర నామక శివలింగత్రయ మధ్యగత మగుటంజేసి త్రిలింగదేశమని వ్యవహరింపఁబడుచున్నదని విన్నకోట పెద్దయ చెప్పినాఁడు.

"ధరశ్రీపర్వత, కాళే
శ్వర, దాక్షారామసంజ్ఞ కలలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగదేశ మనఁజను కృతులన్."

ఈపదము క్రమముగా వికృతమై 'తెలుఁగు' తెనుఁగని వ్యవహరింపఁబడఁదొడఁగెను. అధునాతన విమర్శకుల త్రిలింగవిమర్శన మెట్లున్నను ప్రాచీనుల నైతీరున నడిచిరనుటలో సందియము లేదుగదా!

తెలుఁగుభాష యభివ్యక్తమయిన కాలము మనకు సరిగాఁ దెలియదుగాని యియ్యది వేదభాగము లందుఁ గీర్తింపఁబడుటచేఁ బ్రాచీన మైనదనిమాత్రము చెప్పితీరవలయును. తొలుత నీభాష యెట్లు వ్యవహరింపఁబడియెనో గాని యిప్పటికి నిలిచియున్న భాషను గమనించినచోఁ గేవలదేశ్యపదములతోఁ గూడిన యాంధ్రభాష యెంతవరకు వ్యవహారక్షమ మయ్యెనో యని సంశయము గలుగక మానదు. అంత సంకుచిత రూపములతోఁ నేఁడు గానవచ్చెడి మన యాంధ్రభాష యానాఁడు సర్వతోముఖవ్యాప్తమగు సంస్కృతభాషతోడను, నచ్చటచ్చటఁ గొంతవఱకు వ్యవహారస్థితిని సంపాదించిన ప్రాకృతభాషలతోడను జెలికారము వాటించి తనయునికిని స్థిరపఱచుకొనియెను. అందుచే నంధ్రభాషయందు సంస్కృతప్రాకృత పదము లధికముగాఁ బ్రవేశించినవి. ఆప్రవేశము కాలక్రమమున నుచ్చారణకృతమగు వర్ణలోపాగమాత్మక మగుచును, విభక్తివిరహిత ప్రకృతిపదములకు దేశభాషాప్రత్యయ సంయోగరూపమగుచును ద్వివిధముగ బయల్వెడలి యంధ్రభాషకు 'వికృతి' యను నభిధేయమును సంపాదించినది. ఇట్లు భాషాంతర సంబంధముల నొందిన తెలుఁగుభాష తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య, భేదముచే నాలుగువిధము లగుచున్నది. గ్రామ్యము ద్వివిధముగా నెన్నఁబడుచున్నను గపోలజఘనాద్యర్థములందుఁ బ్రయోగింపఁబడిన గల్లకటి ప్రభృతి శబ్దములవంటి గ్రామ్యభేదము లీవ్యాకరణములయందలి గ్రామ్యపదముచేఁ జెప్పఁబడవు. అథర్వణుఁడు "పామరాది ప్రయుక్తం యత్తద్గ్రామ్య మభిధీయతే" యని చెప్పినను నయ్యది 'ఒచ్చేదు, తెచ్చేదు' ప్రభృతి రూపవిషయకమే యని గ్రహింపవలయును. కావున నిందు గ్రామ్యమన లక్షణవిరుద్ధంబగు భాషయని యర్థము.

ఇట్లు వ్యవహరింపఁబడు భాష తత్తద్భాషా సన్నిహిత సంబంధముచేతను, వ్యవహార భేదముచేతను దినదినప్రవర్ధమాన మగుచుండెను. గడచినకొలఁది యిందుఁ గూడఁ జిన్నచిన్నపాటలు పద్యములు బయల్వెడలినవి. గొప్పవాఙ్మయము నన్నయకుఁ బూర్వము మన కుపలభ్యమానము కానప్పటికి యుద్ధమల్లుని శాసనముబట్టి కొంత వాఙ్మయ మున్నదని మాత్రము చెప్పుటకు నవకాశము గలదని విమర్శకులు స్థిరీకరించిరి. క్రొత్తగా భారతమువంటి గ్రంథ మప్పటికప్పుడే నన్నయచే రచింపఁబడెననెడి వాదము శోధకసహము కాదని వారి యాశయము.

ఇట్లు యుద్ధమల్లుని నాఁటికే యభివృద్ధి నందిన యీ తెలుఁగుభాషకు సంస్కార మావశ్యక మాయెను. అక్కారణమునఁ గొందఱు పండితులు కొంతకొంత భాషను సంస్కరించుటకు బయలువెడలినట్లు "హేమచంద్రాది మునిభిః కథితం చాంధ్రలక్షణ" మ్మను మొదలగు వాక్యములవలనఁ దెలియుచున్నది. ఇంతేగాదు. చింతామణికూడ "కేచిత్, శాస్తారః, కవిభిల్లమైః" మొదలగు శబ్దములచే నీ యాశయమునే సూచించినది. అదియుంగాక యానాఁడు భాషను సంస్కరించుటకుఁ గొన్ని పరిషత్తులు నేఁటికాలమునకుంబలె నున్నట్లు నన్నయభారతమునందలి సభాశబ్ద పునఃపునః ప్రయోగముచే వ్యక్తమగుచున్నది. కావుననే నన్నయయిటు భారతమును రచియించి యటు చింతామణి యను భాషానుశాసనమును వ్రాసియుండెనో యని కొందఱు విమర్శకు లూహించుచున్నారు.

ఈ చింతామణి యెట్టిభాష ననుశాసించుచున్నదని తొలుత విచారింపవలయును. దీని కనువగు కొన్ని విషయము లందే చెప్పఁబడినవి. చింతామణి యేనుబది తొమ్మిది యార్యావృత్తములతో భాషను సాధించినది. ఇంత గొప్ప వ్యవహారము గనుచున్న భాష నింత సులభముగా నీచింతామణి యెట్లు సాధింపఁ గల్గిన దని సందేహింపవలదు. చింతామణి సంస్కృతవ్యాకరణము వలె భాషనంతను సమగ్రముగ సంస్కరింపఁ దలపెట్ట లేదు. అయ్యది కేవల కావ్యభాషను మాత్రము, అనఁగా రసాభివ్యంజక శబ్దసమూహమును సాధింప యత్నించినది. కావుననే తొలుత "విశ్వశ్రేయః కావ్య"మ్మని కావ్యప్రయోజన నిరూపణమునకుఁ గడఁగి "తదదోషా పరిక్లృప్తా చ వాగర్థా, సాపాగ్యా

రసవృత్తిః సాధ్వీ హి రసో యథాతథం కవిభిః" యని రసవద్వాక్యనిరూపణావశ్యకతను బ్రతిపాదించెను. "వళిరాద్య మవంతరాక్షరం ప్రాస" యను పద్యలక్షణముగూడ నిందే సహియింపబడుచున్నది. యథార్థమాలోచించినచో నీచింతామణి కావ్యభాషకు వ్యాకరణమైనను నందుఁగూడఁ దాఁ గార్యార్థము నందలేకపోయెను.

ఇదియిట్లుండఁ దఱువాత మఱికొన్ని "యాంధ్రభాషాభూషణము" మొదలగు వ్యాకృతులు బయలుదేరినవి. ఈవ్యాకరణము లిట్లున్నను నష్టాధ్యాయికిఁ గాత్యాయన వచనములవలె నసంపూర్ణమగు చింతామణికిఁ గొన్ని కారికల నథర్వణుఁడు రచియించి యందలి లోపములను దీర్చుటకుఁ బ్రయత్నించెను.

అథర్వణుఁడు గొప్ప యభిమాని. కావుననే

"శ్రుతేఽపశబ్దే స్వోక్తౌ చ ప్రమాదాత్పాణినిం స్మరేత్,
అథవా ఫణినా మీశం చిన్తయే ద్వ్యహ్నికో బుధః
ధ్యాయే ద్విత్రిరు మామేవ స్మరే త్పండితసత్తమ"

అని చెప్పుకొనినాఁడు. ఇంతగర్వపడినను శిష్టప్రయోగసాధనమే ప్రధానలక్ష్యము గాఁగలవాఁ డగుటచేఁ జింతామణియందలి "సిద్ధిర్లోకా ద్ద్విశాఖా" యను మూలసూత్రమును బ్రమాణముగాఁ గొని "ప్రయోగః శరణం కవేః, కవిసమ్మతేః, నిదానం తత్ర సద్వచః, తద్వివేకః ప్రయోగైకశరణం స్యా" త్తను మొదలగు పదములచే దాని యభిప్రాయమును విశదపఱిచెను. కావున నీతఁడు కవిప్రయోగములందు మిక్కుటమగు గౌరవము గలవాఁడనియు నవ్వాని నెల్లను సాధింపఁ దలఁచినవాఁ డనియు స్పష్టమగుచున్నది. గ్రామ్యపద ప్రయోగనిషేధముచే మ్లేచ్ఛాది భాషణములకుఁ గాఁకంబాది పదములకు దూష్యత్వము ప్రాపించునను భయంబున నీతఁడు "గ్రామ్యం తత్తద్విధా సాధుకలకంఠముఖాహితా" యని యవ్వానిని సాధించి వానికి గతికల్పించినాఁడు. ఇంతియకాదు. "నది సురుసుత కర్ణ శల్య నాగపురీశుల్" మొదలగు ప్రయోగములలోని నద్యాది హ్రస్వప్రయోగము లసాధువు లగునేమోయని "హ్రస్వో దీర్ఘసమాసేఽపి క్వచిత్ జీవః ప్రయోగతః" యని యవ్వానిని గూడ సాధింపఁ దలఁచెను. ఈమొదలగు వానిని బట్టి యథర్వణుని యాశయము స్పష్టముగఁ దెలియుచున్నది గదా! ఇఁక నా కాలములోఁగూడ వ్యవహారదశయందున్న "చేయడము, పోవడము, రాణింపు, ముగింపు" మున్నగు ప్రయోగములను శిష్టవ్యవహారము నగానకపోవుటచేఁ గాఁబోలు

"ప్రతిక్రియ మదాస్తత్వం ప్రతీతం నతు గీయతే,
క్వచి దింప్యన్తతాం కేచి దూచిరే నహి మే రుచి"

యని తనకు సమ్మతము గానట్లు తనయాశయమును వెల్లడిచేసెను. కాని తరువాతి కవులు "దానిచక్కఁదనంబును దానిమెఱుఁగు దానికట్టడపుంబని" "మొదలఁ గాశిపురంబున ముట్టడముగ" (కాశి) "నేమరయుచుఁ దండ్రి వ్రాయడము చూచి" (జైమిని) "పెలుచఁదనంబులు ప్రేలడములు—వట్టిపసలు కేరడంబులు" (పాండు) "మృష్టాన్నముల నారగింపు విడక (పరమ)" యని యనేకవిధములుగఁ బ్రయోగించిరి. బహుళముగా నిట్టిప్రయోగము లీతనికాలమునఁ బామరవ్యవహృతములై క్రమముగా వాఙ్మయమునఁ బ్రవేశించినవి. ప్రయోగములపై నట్టి యాదరము నీతఁడు చూపినను శాస్త్రమునందుఁగూడ నీతనికి గాఢమగు ప్రామాణ్యము గలదు. కావుననే—

"శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే,
అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం కృతం"

అని చెప్పెను.

ఇఁక నాంధ్రభాషాభూషణము కావ్యాలంకారచూడామణి మున్నగు ననుశాసనములు ప్రకృతకాలమునకు వింతలగు కొన్ని మార్పులను దెల్పిరి. అందుఁ దొలుత చిన్నకోట పెద్దయఁ కావ్యాలంకారచూడామణి భాషావిభాగము చేయుటలో వైదురీతులఁ దెల్పుచు దేశ్యమును సహజాంధ్రదేశ్య భవమనియు, దేశ్యభవమనియు ద్వివిధముగాఁ జెప్పెను, ఇపుడు వ్యవహారమున గనుచున్న "గంతెలు గుండలు, దోసాలు, వేసాలు వేదాలు" మున్నగు రూపములను గ్రామ్యములకు నుదాహరించినాఁడు. ఇంకను గర్తృ లక్షణము చెప్పుచు "ను, ని, వర్ణంబులు దుదినొందిన కర్మపుఁ బదము ద్వితీయ యనంగాఁజను"నని చెప్పెను. ఇది కేవల మాంగ్ల భాషా సంప్రదాయమై "రామునిచే రావ

ణుఁడు చంపఁబడెను" మున్నగు కర్మప్రయోగము లందు నవ్యాప్త్యతివ్యాప్తి దోషప్రతిపాదక మగుచు న్నదిగదా! క్రియాప్రకరణములోఁ "ప్రథమపురుషంబు నకు వర్తమానార్థంబునందు నేకవచన బహువచనంబు లందు నెడినెదరులును, మధ్యమపురుషంబున నెదవెదరు లును, నుత్తమ పురుషంబున నెద నెదములును గ్రమం బున నాదేశంబులగు నని యుదాహరించె. అట్లే భవిష్యదర్థమునఁ "ప్రథమపురుషంబునకు భవిష్యదర్థం బునందు నేకవచన బహువచనంబులకు 'నుదురు'లును మధ్యమపురుషంబున 'వుదువురు' లును నుత్తమపురు షంబునకు 'దునుదుము'లును వరుసనాదేశంబులగు"నని యుదాహరించెను. దీనినిబట్టి యర్వాచీనవ్యాకృతి కర్త లచే వర్తమాన భవిష్యదర్థకములుగా జెప్పఁబడిన 'యున్నకల' నుబంధములు ప్రత్యేక శబ్దములు గానే యానాఁడు పరిగణింపఁబడెడి వనియు నిపుడు తద ర్థాద్యర్థకములకుఁ బ్రత్యేకరూపము లున్నట్లానాఁడు లేవనియుఁ గ్రమముగా నర్వాచీన వ్యాకర్తలె దాదు లను దద్ధర్మాద్యర్థములందునఁ నున్న కలశబ్దములను భవ ద్భవిష్యదర్థ కానుబంధములుగా వ్యవస్థ చేసినట్లును స్పష్టమగుచున్నది "చేయుచున్న" మున్నగుచోటులందలి యున్నానుబంధకమునఁ బ్రసక్తమగు స్వరయతిగూడ నిద్దానినే దృఢపఱచుచున్నది. ఇట్లే యర్వాచీన వ్యాకర్తలు "తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిఙ్గాట్టుల ప్రథమా బహువచనంబున నేకవచనంబగును, చిలుకలుపలికెను. పలికెడు" నని యనుశాసింప నీలేఁడు—

"మహితస్థావరతిర్యఙ్మహిళాదిక్రియల వర్తమా నార్థమునన్, విహితమగు నెడు డుకారము సహజం బుగ నేకవచన సంజ్ఞం బొందున్" పశులు వండెడు నని తిర్యగ్జడంబులతో పశులనుగూడఁ గలిపెను. ఇట్టి విశేషంబులు చాలవఱకుఁ గలవుగాని విస్తరభీతిచే నుదాహరింపలేదు. ఈ వ్యాకరణములందు నింతకం టెనుగూడఁ బరస్పర వ్యాఘాతత్వ మెక్కుడుగఁ గన్పట్టుచున్నది. చూడుఁడు. తొలుత నథర్వ ణుఁడు "క్వచి త్సంస్కృతీయోఽపి ప్రాణోఽ ప్యత్ర చ్యుతో భవే" త్తని సాంస్కృతికస్వర మునకు సంధిచెప్పుదు "వాత" యను చింతామణి సూత్రమునకు వివరణము వ్రాసి "గంగను కాసె" "శ్రీరంగభర్తంచు" మొదలగు రూపముల నుదాహరించి యుండఁగా మన చిన్నయసూరిగారు "సంస్కృతీ యంబునకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిఁ బూర్వకావ్యంబులందుఁ బ్రయో గంబు మృగ్యం" బని చెప్పిరే! పైప్రయోగము పూర్వ కావ్యములోనిది కాదు కాఁబోలు! సూరిగారి బుద్ధిలోఁ బూర్వకావ్యత్వ మొక్క భారతమునకుఁ దక్క వే ఱొకదానికి లేదు. కాని యీ పద్ధతి నవలంబించి నచోఁ దమ యనుశాసనమునందును వ్యభిచారములు గానవచ్చును. ఇట్లే గసడవాదేశ విషయంబునఁ బ్రథమమీఁదనే గసడదవాదేశంబులను విధించి 'తెలుఁ గులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావని సూరిగారు నిషేధించిరి గాని ప్రాచీనుఁడగు నథర్వణుడు మాత్రము —

"పరుషా వా స్వరూపేణ ప్రథమాంతోపరి స్థితాః,
కాకా సంబోధనే చాపి హ్యవ్యయే కర్మధారయే"

యని మతాంతరమును బ్రదర్శించి గసడదవాదేశంబు లకు వ్యాపకత్వంబును సంపాదించి సాంస్కృతికంబు లకుఁ గూడ గసడదవాదేశంబులను నిరూపించినాఁడు. చిన్నకోట పెద్దయగూడ "వీరుండు పరురుండు, చొ క్కులాఁడు దత్తవిదుఁ" డని సాంస్కృతికంబులకు గసడదవాదేశంబులను విధించెను.

ఇట్లొకరిమాట నింకొకరు గణన సేయక యాంధ్ర వ్యాకృతికర్తలు పరస్పరాభినివేశంబులతో నొప్పుచుండిరే గాని ప్రాచీనులవలె నైకకంఠ్యమును గనరైరి. క్రమంబున వీరందఱు శాస్త్రాభిమానతత్పరులై పాణినీయంబును డెలిసికొనియు నద్దానికి నిదానంబును విచారింపనివారై పాణినీయమే భాషకు మూలమను నొక దురభిప్రాయమును బొంది యయ్యది గీర్వాణ భాషను శాసించినట్లు దామును వ్యాకరణద్వారా యంధ్రభాషను శాసింపఁ దలఁచి ప్రాచీనవ్యాకృతు లను బరిశీలింపక స్వేచ్ఛగా భాషపై దండువిడిసిరే గాని ప్రయోగసాధనము ముఖ్య కర్తవ్యముగాఁ దలఁచియుండ లేదు. అయ్యది యహోబలునితోఁ బ్రారంభమైనట్లు

చెప్పఁదగును. అహోబలుఁడు తిక్కనాదుల ప్రయోగములనుగూడ "మతులఁ గనియెడుకొలఁకు" "నీవు ఘటియించుకంటె" ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాదికవివచనానాం కిం మూల మితి న విద్మః" "రామాయణము రచించెఁ బ్రాచేతసుఁడున్" ఇత్యాది భాస్కరోక్తి రసంగతైవ" "మఱఁది రమ్మని పిల్చెఁ బనిగొంట నీకుఁ బ్రాభవముగాద" ఇత్యాది వచనస్య ప్రామాదికత్వ మే వేత్యవధేయ" మ్మని మిగుల కఠినముగ దూషించినాఁడు శాస్త్రాభినివేశముతో నర్వాచీన పండితులకుంబలె నన్నయ ప్రయోగములనుగూడ "తత్కృతితులితంబునకంటె" ఇత్యత్ర బువర్ణానంతరం నకారః శ్రూయతే, తత్ర కాగతి రితిచేత్, "తత్కృతితులితంబునకన్న మతుండు మేలు" ఇత్యేవ పాఠః సాధు" వని సంస్కరింప సాహసించెను.

ఇఁక నప్పకవి సాహసమునకు మేరయే లేదు. నేఁడు మహోదశ ననుభవించుచున్న బాలవ్యాకరణము గూడ నిట్టి మతమునే స్వీకరించెనని తద్జ్ఞులకు వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. ఇదియంతయు సంస్కృత వ్యాకరణతౌల్యము నాంధ్ర వ్యాకరణమునకు నొనర్పఁ బూనుటచేఁ గల్గిన యవస్థ. అర్వాచీనాంధ్రులు తమ వ్యక్తిత్వమును విడిచి యనుకరణప్రియు లై రనుట కిది వాఙ్మయవిషయక మగు నొక దృష్టాంతము. ప్రజాప్రచురవ్యవహారము నొకప్పుడు గల్గియున్నను దమనాఁటికి నట్టి వ్యవహారమునుండి తొలఁగి యద్యతనాభివృద్ధిఁ గాంచని భాషయొక్క వ్యాకృతుల శాసకత్వముఁ గని యట్టి శాసకత్వమునే దినదినాభివృద్ధిఁ గాంచుచు జనవ్యవహారమునఁ బడి చూర్ణ మగుచున్న భాషల వ్యాకృతు లనుసరించినచో నిట్టి దోషములే సంభవించును.

కావున సుధీమణులందఱు సర్వవిధములఁ బ్రాధాన్యము నందఁబోవు నాంధ్రభాషకు వాఙ్మయము నంతను నవలోకన సేసి సర్వవ్యాపకమును, శిష్టసమ్మతము నగు నొక వ్యాకృతి వ్రాయఁదొడఁగు సుసమయ మెన్నటికి వచ్చునో యని యాంధ్రలోక మెదురు చూచుచున్నది.

---



# పిచ్చివాఁడు

శ్రీ కృత్తివెంటి వెంకటసుబ్బారావు

భగ్నాశుండవో, ప్రేమవాక్శ్రవణసంప్రాప్త్యంతరాయవ్యథో
ద్విగ్నాత్ముండవో, నష్టగర్భవనార్ద్రీభూతవాత్సల్యభా
రాగ్నిక్లేశభరార్తితప్తుఁడవో, మిత్రాకారశత్రుప్రజా
భుగ్నద్రోహవిషాన్నదగ్ధుఁడవోకో, పో, మా కనూహ్యంబెటుల్ !

నీలో నీవె గొణుంగుచుందువను కానీ లోక, మేకొద్దియే
నాలోకించునె, త్వన్మనోగతసతీవ్యామోహమో, గర్భవా
సాలంబీకృతభావచర్వణమొ, యేయన్యాయమో, నిల్చి నీ
గోలం జూచునే? జాలిసైచునె? యహో! క్రుద్ధుండవే? మాయెడన్.

ధనమున్ వోట్లకు పాడుసేయుకతనన్ దారిద్ర్యమో, మిత్రులన్
పెనుభూతమ్ముల యెగ్గుసేతలకు నావేశించితో, వెన్కపై
పున కొండెమ్ములఁ జెప్పి నీ బ్రదుకు తెర్వుం బర్వుచేడ్పాటు చే
సినవో, యేటికొ క్రుంగి చిక్కెద విటుల్ చింతార్తితో ధీమణీ.

ధనమన నద్దుకో చనని ధార్మికతాత్త్వికమూర్తి వీవ, యీ
జనములు నమ్మకమ్మునకుఁ జాలనివారని తెల్పినట్టి నీ
మనమున నింతనాటి, మహిమం జెఱుపంగల దెద్ది? నీవ యో
చన మొనరింపుమీ బలము సంతత ముత్సహానంబు దేహికిన్.

లోఁగవు దూషణభూషణా, లం గన వాసించి యొరుల లాలనము, నినున్
వెంగలి వందుము, మము గని, వెంగలులని బదులుతలఁతువే? నిజమేదో?

ఆటవెలఁదిపోల్కి నాడుచు వాడింతు, వప్రమత్తుఁడవె? యథార్థమునకు—
మత్తుఁడనుచు వికలచిత్తుఁ డున్మత్తుఁ డం, చాడిపోయు నేటియాగడమ్ము!

అల్పబుద్ధు లెవ్వరైననీ చెయి చూచి, పిఱికిమందుఁ దెచ్చి పెట్టినారె?
జ్ఞాననిధి, వివేకశాలి, యీబడుగులఁ, దడవనేల? అంత జడియులేల?

త్రాగినవాఁడు, ఉద్ధతులదాపున కీడ్వడువాఁడు, లేమికిన్
లోఁగినవాఁడు, పొత్తివలలోఁబడి యీఁగినవాఁడు, భీతిచేఁ
గ్రాగినవాడు, తెల్వివెనుకంబడి సూటిగ నున్నదున్నటుల్
వాగినవాడు, జాగ్రదుపవాసమువాడు సమాను లందురే?

వెక్కిరించు నొకండు పిసం బెఱుంగఁడు, నీలోతుగుండెలో నిశ్చలతను,
నీలాపనింద లెన్నేవైచు నొక్కండు, నీమంచిచెడ్డల నియతియేల?
కసరికొట్టఁగఁజాలు కఠినాత్ముఁ డొక్కండు, నేరదీయునె నీదు సిలుగు లరసి
అపహరింతురు కొందర వకాశముకొలంది, దారిచూపర యంధకార మెడపి,

మేకతోల్కప్పు మువ్వన్నె మెక మొకండు, ఇంటఁదినియింటివాసమ్ము లెత్తునొకఁడు,
మెత్తతడిగుడ్డలను గొంతు లొత్తునొకఁడు, పిచ్చివాఁడను బిఱుదు పైపెచ్చు నీకు!

కానక నమ్మవేకద యొకానొకకామిని భామినిన్, రహః
స్థానము లొప్పఁజెప్పుగదా చెలికాండ్రను దొంగజాతికిన్—
కానము, భార్య రూపవతి కాదుకదా, యనుమానహేతువే
దే నగుపట్టనే, యెఱుఁగ నేటికి మా కది—తీర్చువారమా?

ఎవ్వనిపిచ్చి వానికొక యింపగు—నన్యులుమూఢులంచు దా
నవ్వు, దృఢమ్ముగా నటుల నమ్మనుఁగూడ—నిజమ్ము—చూడ మే
నవ్వులు పువ్వులో నవియె నాటఁగ ఱివ్వన ఱువ్వలోను,-పో-
గవ్వకు కారు వారొకని కర్మకు—వేయివిధాలు వెఱ్ఱికిన్.

చాణక్యుం డొకపిచ్చివాఁడ యగు రాజ్యస్థాపనార్థమ్ముగా
రాణింపండె యుగంధరుండు ప్రభుసామ్రాజ్యప్రతిష్ఠాపనన్
వాణీశాద్యతిలోకబుద్ధు లొకచో వ్యత్యస్తు లయ్యున్ శిరో
మాణిక్యంబులు వారి బుద్ధిబలముల్ మంతవ్యముల్ గావొకో.

యోగమొ, రోగమో మఱి గ్రహోచ్చలో నీచలో కాక పూర్వజ
న్మాగతపుణ్యపాపములో ? ఆగమకర్మమొ, లేమినెంజ లిఁ
సేగులో, లోననే కుమిలి చిక్కఁద వారిచి తీర్పనెవ్వరీ
జోగులు—వీరుకూడ నొకసూడునకే, యిఁక నీకనీవచూ.

అప్రాచ్యార్థికసాంఘికోక్తిపరనాహంకారపూర్ణుల్ నినుఁ
నీ ప్రారబ్ధముగుర్తెఱుంగక వ్యథానిందింతు రాలోచనా
వప్రస్థుల్ మిముబోంట్లు గాయకకవిప్రాజ్ఞుల్ కళోపాసకుల్
శ్రీప్రస్ఫూర్తులు మీదుధోరణి గవేషింపంగ సౌలభ్యమే ?

తనదు ప్రేమైకనిధానసృష్టి నొకండు, తనప్రాణగోడ్డంపుఁబనుల కొకఁడు
తనపవిత్రప్రవర్తన నమ్మిక కొకండు, తనజీవగజ్జియా తరుణి కొకఁడు
తనరాజ్యతంత్రతత్పరతచే నొక్కఁడు, పదుగురాడినమాట పాటికొకఁడు
కులజాతిభేదకత్తుల తూలి యొక్కఁడు, విశ్వాసహీనులౌ ప్రియుల కొకఁడు

ఇంటిపో రొండు దారిద్ర్యహేతు వొండు, మనసునాటిన ఘోరావమాన మొండు
మానము ధనమ్ము రాజ్యమ్ము ప్రాణమైన, నట్టి త్యాగ మొనర్ప నాయత్తపఱచు.

రామునట్టిఁ డవస్థ లారాటమువడె, నలహరిశ్చంద్రధర్మజాదులు, ధృతిగను—
'దుర్దినము లేగు' తొగకన్న దొరవెలుంగు, శుక్రదీప్తి మెఱయు, గురుశోభ దనరు.



# ప్రభావతీ ప్రద్యుమ్నము



= శ్రీ డా. చిలుకూరి నారాయణరావు =

పుత్తికొక బుద్ధి, నాలుకకొక రుచి.

పింగళి సూరన గొప్పకవి కాడని ఎవరనగలరు? కళాపూర్ణోదయములో అతని ప్రతిభ నిండుకొని తొలకి పోతున్నది. ఆ రచనలో ఉక్తివిశేషత ఉన్నది. కథాకల్పనాప్రతిమానశక్తి ఉన్నది. ఆంధ్ర కవిత్వ చరిత్రలో ఈ రెండో యుగము అతనితో ఆరంభించినది; అతని కళాపూర్ణోదయములో పరాకాష్ఠను చెందినది. ఆ గ్రంథముతోనే నిలిచిపోయినది.

ప్రభావతీప్రద్యుమ్నము కళాపూర్ణోదయము తరువాతనే రచింపబడినదయినా, కల్పనలో దానికి చాలా వెనుకబడిపోయినది. కళాపూర్ణోదయరచనకు తనకున్న సరకంతా ఉపయోగించివేసినాడు కవి. ప్రభావతీప్రద్యుమ్నకథ క్రొత్తది కాదు. ఉషానిరుద్ధులు ప్రభావతీప్రద్యుమ్నులలోనుంచి తొంగిచూస్తున్నారు. భాగవత హరివంశములలో ఆకథ పాఠకులకు పూర్వపరిచిత మైనదే. కాని, ఆగ్రంథాలలో అనిరుద్ధుడు అదృష్టవంతు డయితే, దీనిలో వాని అబ్బ అయినాడు. అక్కడ అదృష్టవతి ఉష. అయితే ఇక్కడ దాని అక్కపోలిక గలది ప్రభావతి మరిఒకతె అయినది. ఉషః ప్రభ కంటె కేవలప్రభ ఎక్కువ కదా. ఆమె తన్ను చూడనైనా చూడని ప్రద్యుమ్నునికి 'ప్రప్రభాభావతి' కూడా అయినది. ఉష బాణుని కూతు రయితే, ప్రభావతి వజ్రనాభుని కూతురు. ఇద్దరి తండ్రులున్ను రాక్షస ప్రభువులే. వారికూతుళ్లు గంజాయివనములోని తులసి మొక్కలు, కృష్ణభక్తుల మయిన మన దృష్టిలో. బాణుడు శివభక్తుడై వరములు పొందుతే, వజ్రనాభుడు బ్రహ్మవరము సంపాదించినాడు. బాణునికి వరమిచ్చినా శివుడు వెంటనే అతని నాశనమునుకూడా సూచించినాడు. వజ్రనాభుని అనుజ్ఞ లేనిదే అతని పురములోని కెవ్వరున్ను చొరశక్యము కానట్లు బ్రహ్మ వజ్రనాభునికి వరమిచ్చినా, తానై అతని నాశనమును సూచించలేదు. అట్టినాశనమునుగురించి వజ్రనాభునికి తెలియనే తెలియదు. కలలో కనిపించి ప్రద్యుమ్నుని చిత్రమును వ్రాసి యిచ్చిన హిమగిరిరాజకన్యమూలముగా ప్రభావతికి తెలుసును; ఆమెనుంచి రాగవల్లరికిన్ని, శుచిముఖికిన్ని తెలుసు. శుచిముఖి మూలముగా ఇంద్రునికిన్ని కృష్ణునికిన్ని తెలుసు. భాగవతములో అనిరుద్ధుని ఉషవద్దకు తీసికొని వచ్చినది ఆమె చెలి

కత్తె చిత్రరేఖ. ఆమె చాలా సాహసురాలు. నిద్రపోతూఉన్న అనిరుద్ధుని మంచముతోకూడా ఆకాశము మీదుగా ఎత్తుకొని వచ్చినది. ప్రభావతిచెలికత్తె రాగవల్లరి కంతటి శక్తిసామర్థ్యములు లేవు. ప్రద్యుమ్నుని ప్రభావతివద్దకు చేర్చే కార్యము శుచిముఖి అనే హంస పన్నాగము మూలముగా అయినది. గదసాంబులకున్నూ వజ్రనాభుని సోదరుడైన సునాభుని కూతుళ్లు చంద్రవతీ గుణవతులకున్నూ చిలుకమూలముగా జరిగిన సంధాన మొకటి యీ కావ్యములో క్రొత్తచేర్పు.

ప్రభావతీప్రద్యుమ్నకథ 'అఘహరణ హరివంశ కథాశ్రయ'మని సూరన్న చెప్పినా, మూలములో ఉన్న ఆశ్రయము ఉషానిరుద్ధుల కథ తప్ప మరొక్కటి కావరాదు. పాత్రముల పేళ్లను మార్చి, కొంత తనది చేర్చి కవి యీ కథ నేర్పరిచినాడు. ఈ మార్పులకు విమర్శకు లెంతో మెచ్చుకొంటున్నారు. కాని నా కది యేమిన్నీ నచ్చలేదు. కళాపూర్ణోదయములో కనబడే కల్పనాప్రతిభ యిందులో ఎంతమాత్రమున్నూ లేదు. ప్రభావతీప్రద్యుమ్నము ఇతరకావ్యములనుంచిన్ని, సందర్భములనుంచిన్నీ యాదృచ్ఛికముగా, అనాలోచితముగా కవి ఏర్చికూర్చిన అతుకుల బొంతగా నాకు కనబడుతున్నది.

హంస వృత్తాంతమునకు నలదమయంతులకు దౌత్యము చేసిన హంసవృత్తాంతము మూల మనడానికి సందేహము లేదు. హంస దౌత్యము చేసినప్పుడు చిలుక యెందుకు చేయగూడదు? ప్రద్యుమ్నునికి ప్రభావతీ సాంగత్యపు అదృష్టము పట్టినప్పుడు, గదసాంబు లేమి పాపము చేసుకొన్నారు? అందుచేత ప్రద్యుమ్నునికి సహాయముగా గదసాంబులను పంపవలెను ప్రద్యుమ్నునికి ప్రభావతి నేర్పాటుచేసినవాడు గదసాంబులకు కూడా ఎవరినైనా చూపవలెను గదా! అందుచేత వజ్రనాభుని కొక తమ్ముడు కావలసి వచ్చినది; గదసాంబు లిద్దరుగనుక ఆతమ్మునికి ఇద్దరు కూతుళ్లు కావలసి వచ్చినది.

“ఉష చెలికత్తె చిత్రరేఖకు ముల్లోకములలో ఉన్న అందగాళ్ల రూపాలన్నీ ఎట్లా తెలుసును? ఆమె వారి నెప్పుడు చూచినది? చూచినా, వారి రూపముల నంత సరిగా ఎట్లు చిత్రించగలిగినది?” అనే సందేహముల కవ మివ్వకుండా, ఏకముగా పార్వతిచేతనే ప్రద్యుమ్నుని చిత్ర మొక్కటే వ్రాయించివేసినాడు సూరన్న. అతని చిక్కు తీరిపోయినది. కాని కలలో పార్వతి వ్రాసిన ఆ చిత్రపటము మేల్కొన్న తరువాతకూడా మిగిలి ఉండడమే చిత్రము; ఉన్నదని సూరన్న చెప్పినాడు కాబట్టి మనము నమ్మక తీరదు.

భాగవతహరివంశములలో కనుకలివిరహమే గాని, వినుకలివిరహము లేదు—అంటే, ఉష కలలోని పురుషుని రూపమును అనిరుద్ధునిదిగా చిత్రపటములో చూచి పోల్చుకొన్నది; వెంటనే అతనిమీది విరాళి ఆమెకు భరింప శక్యము కానంత పెరిగిపోయినది. అనిరుద్ధునికో? అత డామెను కలలోనైనా చూడలేదు; ఆమెను గురించి అతనికి తెలియనే తెలియదు; విననైనా వినలేదు. చిత్రరేఖ అతనిని ఉషాంతఃపురములోనికి నిద్రలో తీసుకొనిపోయినది; మేల్కొనగానే ఉష కనబడినది. వారిద్దరున్నూ 'సరే' అంటే 'సరే' అనుకొన్నారు. ఒక్క కనుకలి విరహమే ఉంటే ఏమి బాగుంటుంది? వినుకలి విరహమునుగూడా కల్పిస్తే రక్తి కట్టుతుం దనుకొన్నాడు సూరన్న. ప్రద్యుమ్నునికి గదసాంబులకు, చంద్రవతీ గుణవతులకు కూడా అట్టి విరహమును కల్పించినాడు.

ఇదిగాక, అనిరుద్ధుడు ఉషాంతఃపురములోనికి పోగానే, వారిద్దరికీ మాటామంతీ అయినా లేకుండా లతాంతాయుధసంగర మేమిటి? వెంటనే గర్భ మేమిటి? వెంటనే బాణాసురునికి తెలియడ మేమిటి? యుద్ధములో నాయకుడు నాగపాశబద్ధుడు కావడ మేమిటి? శివకేశవులకు యుద్ధమేమిటి? శివు డోడిపోవడ మేమిటి? బాణాసురుని రక్షింపుమని అతడు కృష్ణుని వేడుకొనడ మేమిటి? ఇదంతా అస్వాభావికముగా కనబడినది సూరన్నకు—అందుచేత తన నాయకుడైన ప్రద్యుమ్నుని హంసమూలముగా వజ్రనాభుని అనుమతిమీద భద్రుడనే నటుని వేషముతో గదసాంబులతో అతని పురములోనికి రప్పించి, నర్తన విశేషములను చూపించి, నాయకుని నాయికకు చూపించి, అతనిచేత నర్మగర్భితవాక్యములను పలికించి

ప్రభావతికి ప్రద్యుమ్నుని మనస్సును, సంకేతమును తెలియజేయించినాడు.

ప్రద్యుమ్న గదసాంబుల కీ నటవేషములు వేయించవలె నన్న ఊహ సూరన్న కాలములో ప్రసిద్ధులుగా ఉన్న విప్రవినోదుల ఇంద్రజాల ప్రదర్శనముల మూలముగా కలిగి ఉంటుం దనడానికి సందేహము లేదు. పింగళి సూరన సదాశివరాయలకు సామంతుడుగా ఉండిన నంద్యాల కృష్ణరాజుకు తన కళాపూర్ణోదయము నంకితము చేయడముచేత అతడు సదాశివదేవరాయల కాలమువాడు కావడము స్పష్టము — మరియే రాజు కాలములోను కాక ఈ సదాశివదేవరాయల కాలములోనే విప్రవినోదులు ఇప్పటి అనంతపురము, బళ్లారి, కడప, కర్నూలు జిల్లాలలో ప్రబలి, తమ అద్భుత ఇంద్రజాలవిద్యను చూపిస్తూ ప్రసిద్ధికి వచ్చినారు. విప్రవినోదులు తాము తమ విద్యవల్ల సంపాదించిన ధనమును దేవునికో, బ్రాహ్మణులకో దానము చేసివేయవలెనేకాని తా ముంచుకోకూడదు—అట్లుంచుకొంటే వారివిద్య క్షీణించి పోతుందని శాప మున్నదని వారు నమ్ముతారు. ఆ రీతిగా సూరన్న కాలములో విప్రవినోదులు బ్రాహ్మణులకున్న, దేవాలయములకున్ను చేసిన దానముల శాసనములు పై నాలుగు జిల్లాలలోను అనేకములు కానవస్తున్నవి. వాటిలో కొన్నిటి నీ క్రింది ఉదాహరిస్తున్నాను:

౧. అనంతపురంజిల్లా, హిందూపురం తాలూకా, చౌళూరు గ్రామము: సదాశివరాయలకాలము, శక సం. ౧౪౬౭ రము, నళ — వివిధశాఖలకును సూత్రములకును చెందిన విప్రవినోదులు చౌళూరు మహాజనులకు చేసినదానము.

౨. అదేజిల్లా, అదేతాలూకా, మాగేసముద్రము, (మేణసముద్రం) సదాశివరాయలకాలము,-కాలము విస్పష్టముగాలేదు- సకల విప్రవినోదుల పుణ్యమునకుగాను పెనుగొండరాజ్యములోని రొద్దనాటిలోని, దేవరాయసముద్ర మనే నామాంతరముగల మన్నెయసముద్రములోని హనుమంతదేవునికి చేయబడిన దీపముల దానము.

౩. బళ్లారిజిల్లా, ఆలూరు తాలూకా, తిమ్మాపురం గ్రామము: సదాశివరాయలకాలము. శక ౧౪౬౬ ధాత సం.రము విప్రవినోదులు తిమ్మాపురములో తమకు రావలసిన ఆదాయమును వేంకటాద్రి, కేశవదేవుళ్లకు ఇచ్చిన దానము.

౪. కడపజిల్లా, కడపతాలూకా, భీమగుండం గ్రామం: సదాశివరాయల కాలము. శక ౧౪౬౬ రాక్షస సం.రము. విప్రవినోదులు అమృతరాయ పురమునుంచి తమకు రావలసిన ఆదాయము చెన్నకేశవస్వామికి చేసినదానము.

౫. అదేజిల్లా, అదేతాలూకా, భూతమాపురం గ్రామం: శక ౧౪౮౧ వికారిసం.రము. పెద్ద గోవిందయ్యయును మరిముగ్గురు విప్రవినోదులున్న ఆగ్రామమును చెన్నకేశవస్వామికి చేసిన దానము.

౬. అదే జిల్లా, జమ్మలమడుగు తాలూకా, చామలూరు గ్రామము: సదాశివరాయల కాలము, చామలూరులోని బ్రాహ్మణులు తమ కిస్తూవుండిన వార్షికములను చెన్నకేశవస్వామికి సమర్పించిన దానము.

౭. అదే జిల్లా, అదే తాలూకా, గుండ్లకుంట గ్రామము: సదాశివరాయలకాలము. శక ౧౪౬౩ పరితాపి (పరీధావి) సం.రము. విప్రవినోదులు తమ వార్షికములను చెన్నకేశవస్వామికి సమర్పించినదానము.

౮. అదేజిల్లా, అదేతాలూకా, పోరుమడి గ్రామము: విప్రవినోదులు విక్రల అగ్రహారమునుంచి తమకు రావలసిన ఆదాయమును చెన్నకేశవస్వామికి సంక్రాంతినాడు సమర్పించిన దానము.

౯. అదే జిల్లా, అదే తాలూకా, నల్లపల్లి గ్రామము: సదాశివరాయలకాలము; శక ౧౪౬౭ నళ సంవత్సరము. విప్రవినోదులకు ఆ గ్రామమునుంచి రావలసిన ఆదాయమును విప్రవినోది వీరముష్టి వీరప్ప విశ్వేశ్వరస్వామి కర్పించిన దానము.

౧౦. అదే జిల్లా, అదే తాలూకా, అదే గ్రామము: సదాశివరాయలకాలము, శక ౧౪౬౬ ఆనంద సం.రము. ఆ అగ్రహారపు బ్రాహ్మణులవల్ల రావల

సిన ఆదాయమును విప్రవినోది సిద్ధయ్య చెన్నకేశవ స్వామి ఉత్సవమునకుగాను సమర్పించిన దానము.

౧౧. అదేజిల్లా, అదేతాలూకా, వెంకాయ కాలువగ్రామము: సదాశివరాయలకాలము. శక ౧౪౬౭ పార్థివ సం రము. ఒక గ్రామమునుంచి తమకు వస్తూఉండిన ఆదాయమును విప్రవినోదులు ఆ ఊరి దేవత కర్పించిన దానము.

౧౨. అదేజిల్లా, కమలాపురం తాలూకా, కలమళ్ల గ్రామం: సదాశివరాయల కాలము. శక ౧౪౭౨ సాధారణ సం.రము. కలుమళ్ల గ్రామములోని చెన్నకేశవస్వామి ఆలయమునకు విప్రవినోదులు చేసిన దానము.

౧౩. అదేజిల్లా, ప్రొద్దుటూరుతాలూకా, వని పెంటగ్రామము: సదాశివరాయలకాలము, శక ౧౪౭౫ ప్రమాదీచ సం. రము విప్రవినోదులు తమకు రెండు గ్రామములనుంచి రావలసిన రాబడిని చెన్నరాయస్వామికి చేసినదానము.

౧౪. అదేజిల్లా, సిద్ధవటంతాలూకా, మల్లివాని పట్టణంగ్రామము: శక ౧౪౭౭ రాక్షస సం. రము, విప్రవినోదులున్ను దొమ్మరులున్ను ఆ గ్రామమునుంచి తమకు రావలసిన మామూళ్లను కుమారస్వామి కర్పించిన దానము.

౧౫. అదేజిల్లా, అదేతాలూకా, వీరూరు గ్రామం: శక ౧౪౬౯ సర్వజిత్తు. ఆ గ్రామములోని వీరేశ్వరునికి సరస్వతి మల్లదేవరాజున్ను, ఆ ఊరి తక్కిన విప్రవినోదులున్ను తమకు చేరవలసిన మామూళ్లను సమర్పించిన దానము.

౧౬. కర్నూలుజిల్లా, కోయిలకుంట్లతాలూకా, కోయిలకుంట్ల గ్రామము: సదాశివరాయలకాలము, శక ౧౪౭౬. సం. రము ఆనందలో, బొల్లనమంత్రి పార్వతయ్య విప్రవినోదులపక్షమున పాండురంగ విఠ్ఠలుని కాగ్రామము లిచ్చిన దానము.

౧౭. అదేజిల్లా, అదేతాలూకా, వల్లంపాడు గ్రామము: సదాశివరాయలకాలము. శక ౧౪౭౭ రాక్షస సంవత్సరము. వీరవరసింహపుర మనే నామాంతరముగల ఆ గ్రామములో రావలసిన మామూళ్లను విప్రవినోదులు బ్రాహ్మణుల కిచ్చిన దానము.

౧౮. అదేజిల్లా, అదేతాలూకా, యర్రగుడి గ్రామం: సదాశివరాయలకాలము. శక ౧౪౭౪ పరితాపి (పరీధావి) సం. రము. విప్రవినోదులు భోగేశ్వరుని కిచ్చిన దానము.

౧౯. అదేజిల్లా, నందికొట్కూరుతాలూకా, నామగట్లగ్రామము: సదాశివరాయలకాలము. శక ౧౪౭౬ ఆనంద సం. రము. బ్రాహ్మణులవల్ల తమకు రావలసిన మామూళ్లను చెన్నకేశవస్వామి కిచ్చినదానము.

౨౦. అదేజిల్లా, నంద్యాల తాలూకా, గోరకల్లు గ్రామము. శక ౧౫౦౯ సర్వజిత్తు సం. రము. మహాజనులు విప్రవినోదుల కేర్పాటుచేసిన మామూళ్లను వివరించే శాసనము.

౨౧. అదేజిల్లా, సిర్వేలుతాలూకా, జిళ్లేళ్ల గ్రామము: శక ౧౪౭౭ రాక్షస సం. రము. విప్రవినోదు లాగ్రామములో తమకు రావలసిన ఆదాయమును చెన్నకేశవస్వామికి చేసినదానము.

విప్రవినోదులే కాక వీరముష్టివారు, దొమ్మరులు, నట్టువులు, మొదలయిన వారు దేశమువెంట తిరుగుతూ ఇంద్రజాలికవిద్యను అద్భుతముగా ఆ కాలములో ప్రదర్శిస్తూ ఉండేవారు. వీరిశాసనము లన్నీ సాధారణముగా సదాశివరాయల కాలపువాటివి కావడము, క్రీ. శ. ౧౫౪౩–౧౫౬౫ సం. రముల మధ్యను మాత్రము కావరావడము అట్టివి ఈ నాలుగుజిల్లాలో మాత్ర ముండడముచూస్తే,నూరన్న వీరిప్రదర్శనములను బాల్యమునుంచి ముసలికాలమువరకున్ను చూచి ఆనందాద్భుతములను పొంది ఉంటాడని నిస్సంశయముగా చెప్పవచ్చును. వారివిద్యకు తానెంత మెచ్చుకొన్నా, వారిప్రవర్తనమాత్ర మాతనికి నచ్చలేదు. వారిని గురించి తన అభిప్రాయము:

" ఆటవాం డ్రని నమ్మి యనుమతింపగ నెట్టి
పురమైన నక్రమంబునను జొచ్చి,
పగలెల్ల నాటల భ్రమయించుచును సందు
గొందులెల్ల నెఱింగికొనుచు, రేలు

కన్నగాం బ్రహ్మచు నగళ్ల బ్రవేశించి
యందు నెంతటివార లడ్డమైనఁ
జక్కడఁచుచుఁ జేను గ్రుక్కినపాటిగా
నిష్టమైన యర్థ మెల్లఁ బడసి
బ్రతుకు చునికి మీ స్వభావ మంతయును ద
ప్పదు యథార్థము—
గ్రుచ్చుదవాల పుట్టిన యిండ్లు మీలోనెంట్లు."

అని బాలవటువులనోట వసుదేవుని యజ్ఞ సందర్భములో 'విప్రవినోది' అయిన భద్రుని గురించి పలికించినాడు.

విప్రవినోదులు సాధారణముగా విష్ణుభక్తులై ఉండేవారు. వీరముష్టివాళ్లు శైవులు, వీరశైవులేమో. విప్రవినోదులు బ్రాహ్మణులు; వీరముష్టివారు, దొమ్మరులు, నట్టువులు, శూద్రులై ఉంటారు వీరిపని ఎలుకలు, పందికొక్కులు, దొంగలు మొదలయిన వారివలె వ్యక్తులవద్ద ఒక్కచోట నిలువ అయిన ధనమును సంఘములో తిరిగి వ్యాపింపజేయడము.

ఈ విప్రవినోదులు తాము కోరిన వేషము వేసుకొని తమతమ కార్యములు నిర్వహించుకొంటూ ఉండేవారు. వీరిని రాజులు వేగులవాండ్రుగా నియోగిస్తూ ఉండేవారు వారిమూలముగా తమ కార్యములను సాధించుకొంటూ ఉండేవారు. వారు పోయిన ఊళ్లలో వారికి మామూళ్లు యేర్పాటుచేసి, వారివల్ల తమ కట్టి బాధయున్ను కలుగకుండా చేసుకొంటూ ఉండేవారు. వారున్ను తమకు కావలసినంత మాత్రముంచుకొని తక్కినది ఆయావూళ్ల ఆలయములకో, అక్కడి బ్రాహ్మణులకో ఇచ్చివేస్తూ ఉండేవారు. ఆ ధనము సకల సంఘక్షేమముకోసము వినియోగపడుతూ ఉండేది.

తన కాలపు విప్రవినోదుల చర్యలను కనిపెట్టి ఉన్నాడు కాబట్టి, వారి లక్షణములను ప్రద్యుమ్న గద సాంబుల కంటగట్టి, జనకంటకు లయిన వజ్రనాభ సునాభుల కూతుళ్లను వారికి కూర్పించి, ఆ రాక్షస రాజులను నాశనము చేయించినాడు సూరన్న. అట్లే హంసా, చిలుకా కూడా ఆనాటి వేగువిధానమును సూచిస్తున్నవి. ఈ ప్రభావతీ ప్రద్యుమ్నము మూలముగా సదాశివరాయలకున్ను తక్కిన మండలేశ్వరులకున్ను రాజనీతి నాతడు సూచించినాడని నా అభిప్రాయము. లేదా, ఆనాటి రాజకీయపరిస్థితుల నీ గ్రంథముమూలముగా నాతడు వెల్లడించినా డని అయినా చెప్పవచ్చును.

సదాశివరాయలు చేతకానివాడు; అట్లే ఈకావ్యములో కృష్ణుడున్ను అతని సహాయము కోరి వచ్చిన ఇంద్రుడున్ను చేతకానివారుగా నిరూపింపబడినారు. ప్రద్యుమ్న, గద, సాంబులకు అళియ రామరాయలు, తిరుమల దేవరాయలు, వేంకటాద్రి సరిపోతున్నారు. వజ్రనాభుడు సలకము తిమ్మయ్య అయి ఉంటాడా? అయితే సునాభు డెవడు? ప్రభావతీ, చంద్రవతీ, గుణవతు లెవరు? వారిని నిర్ణయించేపనిని చారిత్రక పరిశోధకులకు విడిచిపెట్టుదాము. కాని ప్రబంధములోని యీ చారిత్రకార్థసూచన అన్ని విషయాలలోను సరిగా సరిపో వక్కర లేదనిమాత్రము విన్నవించి ఈ ఊహనుంచి విరమింతాము.

ఈ ఊహ నిజమైతేనే ప్రభావతీ ప్రద్యుమ్నమునకు ప్రాముఖ్యము వస్తుంది. కాకపోతే, దానికి ప్రాశస్త్యమే లేదని చెప్పవలసివస్తుంది. కవిత్వములోను, కథాకల్పనలోను, తన్నిర్వహణములోనుకూడా అన్నివిధములా ఈ గ్రంథము కళాపూర్ణోదయమునకు తీసిపోతున్నది.

"సకల దిశలకు శాఖోపశాఖ లిడుచుఁ బొదవి ఫలియించుచుండెడుఁ బోలి i ౧౬; కంఠీరవమువ కందుగు గంఠీరవము జనించునట్టి నియమము i ౩౬; ఆ పోతర మేమి చెప్ప నముఁబూనికి గైకొనక i ౭౨; మెకీయులవంటి రక్కసులు i ౯౧; పులినోరి కండ విడిపడ్డగతిన్ i ౯౧; తలనిండగ వర్థము పోసితేని శేవను గటు బట్టగా వెఱతు i ౯౨.

ఓడలు బండ్ల వచ్చు, బండ్లోడల వచ్చు i ౯౪; సత్పురుష చిత్తము నొచ్చిన రిత్తపోవునె i ౯౫; పేను గ్రుక్కిన పాటిగా i ౧౦౨; 'విప్రవాక్యం జనార్దన' i ౧౦౯; కడుపు కక్కుతితి i ౧౧౭; రిపుప్రాంతముఁ జేరడువార లాప్తులే i ౧౧౭; ఒండొక పోతుటేఁగకున్ బోలయఁగరానిచోట i ౧౩౩;

చిచ్చు లేక చిడుముడు మచ్చరీఁడు i ౧౩౪; విశదపక్ష పాతుల ప్రవర్తనము లెట్లు నమ్మఁదగకయున్నె ii ౧౦; క్రొమ్మెఱుంగులతోడి కారొమ్మొగులు వోలె ii ౧౫; పిలిచికొండ లేని చిరుదు మగలు ii ౬౦; అనుభవ సంస్కారంబున కుదొఁబ్ధము ప్రసంగమున నసునుగదా ii ౧౦౦; వట్టిదొరతనంపు నీటు; పాపపు లజ్జ నన్నొరదిమె iii ౫; అప్రతిషిద్ధ మనుమతం భవతి iii ౧౪; ఒకటి కోర వేఱ యొకటి యగుట iii ౧౯; పాటిలద రజోమాలిన్య పల్లవత్వ చాపలంబుల కాధారమై పరగెడు వారికిని మేలొనర్చిన వారి కెన్నఁ: iii ౩౪; కర్తృకర్మసాధన వైగుణ్యము iii ౪౩; ఎన యఁగ నెవ్వ రెంత మనసిచ్చి కచించిరి తాను వారితోఁ బనువడ నంతమాత్ర ప్రతిభావణ మాడుట యుక్తమంద్రు iii ౬౩.

భేరి జోకొట్టుట iii ౭౨; మనసు చివుకుఁ్కరు మనఁగ iii ౯౨; విరహవారిధి నేఁ గడవల్లు టెప్పుడు iii ౧౨౪; సంతసము వాపఁజాలక చంక నైచుకొనుచు iii ౧౩౪; కల్లగుట్టు iii ౧౪౦; అచ్చున వడ్డినట్లమర నంటి; మలిచినగతిని దృఢత్వముఁ జెంది iii ౧౪౦; మిక్కిలిన్ పచ్చిగాఁగ వలపు లేటపటిచి వ్రాసివాఁడొ iii ౧౪౧; జొగాయిలు లెక్కసేయక iv ౨; నీళ్లు నమలుచు iv ౮; నవనిధానములను దవిలి యిచ్చినదైన, మెడలమీఁదఁగత్తి యిడినదైనఁ జాల రవఘుచరితు లేలినవారి రహస్యభంగము నకు ననుమతింప iv ౧౦; కుడిచికూర్చుండి వతఁ దెచ్చుకొంటిమి iv ౧౬; (అదిలుకను) ఏఁటికి విడిచితి నీకడుపు కందనిస్తుగ iv ౪౧; సున్నకికాయలోన నావగింజయుఁబోదు iv ౫౨; దేవరచిత్త మాసతియదృష్టము iv ౮౫; గ్రక్కునఁ జని వ్రాలుదునో లెక్కలు గట్టుకొని iv ౮౬; అర్థ ముచితం బెచ్చొటికి నెడ్డి యదియ యచోఁ్చ బ్రకటము iv ౧౧౪; సందిట సందెడు తలవెంద్రుకలు iv ౧౩౩; మగవారి మాట బొసగదు నమ్మన్ iv ౧౪౮; చలువ రొమినరించి నంతయ ఫల; ముష్కరి వినుము; మిదియ పదివేలింకన్; చలిపందిలి పెట్టుట కడవలఁబో నుత్తమియొ మాకు iv ౧౫౨; అధర్మ్మి కెన్నఁ బరపీడరొయె యుత్తమలాభము iv ౧౫౪; రాజధర్మ మనుచుం గ్రౌర్యంబు దాఁబూనెనో iv ౧౫౬; వెలుగు చేను మేసిన ఎద్దికాఁపు! iv ౧౫౮; ఎటాడఁ బోఁగా నెటు వచ్చునో v ౩; కొల్లా కోకండ్లం జాడిన కూరుములు v ౨౫; బిసిబిసి మాటలు v ౨౬; ఏమఁగుఁ గంబానకుఁ దిగిచినట్లు v ౨౯; కుక్కుటంబు "విధిచ్ఛంద స్త్రీయామాంత రంతిమయామె భగవాన్భషిః కుసుమధన్వ దేవతా మానినీ రమణాయాం వినియోగ" యంచు నారంభించె v ౫౬; పలుగర సేయుట v ౬౬; మీ చదివిన యామునకే తానఁ జదివినయది v ౬౪; ఈరు దువ్వఁగఁ బేను వచ్చును v ౬౮; అందఱకుం దలాయొకటె స్వార్థము గల్గు v ౮౯; తడిపొలఁ గుత్తుకగోయుట v ౧౨౪; వెలిపింపఁబోయి వెలిదిన తెలఁగున v ౧౪౨; నీచేత నున్నయది నా బ్రతుకు v ౧౫౨.

ఇట్టి నానుడులు, జాతీయములు, ఉపమానములు, అచ్చపు తెనుగు పలుకుబడులు నూరనకు క్రొత్తవి కావు. ఇట్టివి ఇంతకంటె పసందయినవి కళాపూర్ణోదయములో నిండుకొని ఉన్నవి. కవిత్వవిషయమున ఇందులో కళాపూర్ణోదయములోవలె నే

శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగలేదు ;
పదమైత్రి యర్థసంపదలఁ బొదలెఁ ;
దలఁపెల్ల న క్లిష్టతనుఁ దీపితం బయ్యెఁ ;
బునరుక్తిదోషంబు పొసగలేదు ;
ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా-
బ్దావం క్రమక్రియ కడకఁజనఁడు ;
ప్రకృతార్థభావంబు పాడుకో నడుచుచు
నుపపత్తి రొండు నతుల్యక్తితముగ
నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్య భేద-
ములు మహాకావ్య తాత్పర్యమునకు నొసరఁ
బలుక నేర్చెను బహుతపఃఫలము పండె. ii ౩.

అతని కవితలో 'చెలువంపుఁ జెలువు గులుకు కలికి పలుకుల కలకలంబు పీనుల కపూర్వపర్వం బగుచుఁ బర్వుతూ ఉంటుంది. (ii ౫౧) ; ప్రాతవడ్డ ఉపమానము లంటే అతని కేవగింపు. అట్టివానిని దసవ

సిగ్గొదవు నతనికి (ii ౬౪); వెన్నెలతేటనిగ్గు నరవింద పుశేకపు మృదుత్వముం బదార్వన్నియ జాళువా పసిండి రంగు మెఱుంగుల ధాళధళ్యముం గన్నియ (ప్రభావతి); రూపుగాఁ గరువుగట్టి మనోజుఁడు పోఁతఁబోయుట"కు సూరన వాక్కు తోడ్పడినది (ii ౮౯); సూరనముఖము 'శబ్దసంస్కారపూతము', (ii ౯౧); అతఁడే వర్ణన చేసినా 'భావన చేయక' వ్రాయడు (ii ౯౬); అతనివి 'చెవులకుం జవులు మిపుల నలవరించు కులుకు బలుకులు (iii ౫౭); అతనివాక్కులు 'సీమలకు సుధారసముల సోనలు వర్షించు పృథుల సుస్వరభణితిం దా నిట్టటు ద్రొక్కక పనిలేని పునఃపదము లిడక లీలఁ దలిర్చును (iv ౬౦); ఇట్లు కవి తన కైతను గురించి తానే చెప్పుకొన్న మాటలలో కొంత సత్యము లేకపోలేదు. కళాపూర్ణోదయములో ఆతడు నిర్వచించిన కవిత్వ సిద్ధాంతమును పైదానికి జోడిస్తే మంచి కావ్యలక్ష్య మేర్పడుతుంది.

వ్యాకరణ ఛందోలంకార లక్షణము నెంతయినా ప్రపంచించవచ్చును. కాని దానిని లక్ష్య సమన్వయము చేయుటను కష్టము. అప్పకవికి ఛందో వ్యాకరణలక్షణజ్ఞానములో ఏమికొరత? కాని, అప్పకవీయమును చూస్తే లక్షణభ్రంశాలెన్నో కనబడుతవి. అప్పకవి కూడా ఒక కవియేనా? అనిపిస్తుంది. అహోబలుని వ్యాకరణపాండిత్యాని కేమికొదవ? కాని, అతని 'కాళిందీకన్యాపరిణయము' దానిని సేతిబీరకాయ చేస్తున్నది కాదా? లక్షణ మేర్పరిచి దానికి లక్ష్యశుద్ధి కల్పించినవారు పింగళి సూరన్న, కూచిమంచి తిమ్మకవి వంటి వా రెవరో కొంతమంది మాత్ర ముంటారు.

ఇట్లన్నానని తిమ్మకవి సూరన్నతో తులతూగుతాడని చెప్పడానికి కాదు. ఆ సూరన్నకు తిమ్మన్నకు చాలా వ్యత్యాస మున్నది. సూరన్న ఆంధ్రవాఙ్మయములో ప్రత్యేకస్థానమును కల్పించుకొన్నాడు. తిమ్మన్న నలిగిన బాటను పోయినాడు రసికవిహారయోగ్యము లయిన నూతన రాజవీథుల నాంధ్రసారస్వతసామ్రాజ్యములో నేర్పాటుచేసిన వా రెవరో కొంతమంది మాత్ర మున్నారు. అన్ని భాషల వాఙ్మయాలలోను అట్టివారు కొలదిగానే ఉంటారు. తెనుగు భారతిని క్రొత్త పోకడల దిద్ది యుగకర్తలయినవారిలో పింగళి సూరనకు తప్పక స్థాన మున్నది. కాని, అది ప్రభావతీప్రద్యుమ్నరచనవల్ల కాదు; కళాపూర్ణోదయరచనవలన.

ప్రభావతీ ప్రద్యుమ్నములో దృశ్యకావ్యపు ఛాయలుకొన్ని కనబడుతున్నవి. అట్టిఛాయలు మంచి తెనుగు శ్రవ్యకావ్యము లన్నిటిలోను కనబడుతవి. ఈ కావ్యమున తక్కినవాటినుంచి విడదీసి, 'ఒక్క సూరన్నయే అట్టి నేర్పు చూపినా' డనడ మతిశయోక్తి అవుతుంది. శుచిముఖి పాత్రమును చిలుక పాత్రమును చేర్చి నాటకప్రయోగమునకు కవి భంగము కలుగజేసినాడు. ఇంద్రునిఏడుపు, కృష్ణునిచింత, అతని చేతకానితనము శుకము 'తనకుమాలిన పనులు', వజ్రనాభుని తెలివితక్కువతనము, ప్రభావతి బేలతనపు కనుకలి విరహము, ప్రద్యుమ్న చంద్రవతీ గుణవతుల వినుకలివిరహము, ప్రభావతీ ప్రద్యుమ్నుల వయసుకావరపు అతిరతివిహారములు, అంతటి ప్రళయపు పిడుగుగా వర్ణింపబడిన వజ్రనాభుడు తుదకిట్లే చావడము — ఇవన్నీ — శుకీశుచిముఖుల కొక ఆకుపచ్చచీర, ఒక తెల్లచీర కట్టించి రంగముమీదికి పంపించినా — నాటకకల్పన కెంతమాత్రమున్ను పనికిరావు.

సంభాషణ విధానములో కవి ప్రత్యేక ప్రతిభను చూపినాడంటే మాత్ర మెట్టి ఆక్షేపణా ఉండనక్కరలేదు. దానిని కళాపూర్ణోదయములో కూడా చూపినాడు; దానిలో చూపివేయగా ముసలితనములో మిగిలినదానిని దీనిలో సర్ది వేసినాడని మాత్రము మనము చెప్పగలము. అయితే ఆ నేర్పు అసాధారణమైనది. ప్రద్యుమ్నుడు (ఆత్మగతమున సవితర్కముగా శివ నన్నె వ్రాసియిచ్చిన పక్షమునను లేఖన నిమిత్తము వేఱ కలుగునొక్కొ! — కలుగదు, — అంతఃపుర కన్య కిట్టిది ధర్మపరతఁ దక్క ఘటిల్లు టరుదు గాన. — అది యట్లయైనను దదభీష్టయువపరీక్షామాత్రఫలకమై జాఱునొక్కొ! — జాఱదు, — ఈశ్వరియిచ్చె సత్కృపనని బాల నేఁడుఁ జాటుటఁ జెప్ప వింటిఁ గాన. — ఇట్టిగతిఁ జెల్వ కుమ జెడ్డుపెట్టునొక్కొ! — పెట్టదు, — అది దాసృజించిన బిడ్డగాన. బొంకగుచు నంత కిడియ

త్రోపుడునొక్క ! — పదరు, — అజుఁడు చెప్పె నని వినబడియెఁగాన.

### శుచిముఖీ ప్రద్యుమ్నుల సంభాషణము :

శుచి : ఒక చిల్కచేతఁ బత్త్రిక యంపితే నాకు ?
ప్రద్యు : అనిచితిని. అది నీకు నందె నొక్కొ ?
శుచి : అనుచు నెవ్వరిఁగూర్చి యది వారికిని జేరెను.
ప్రద్యు : ఆ యింతికి శుభం బె, హంసరమణి ?
శుచి : నా లేఖ యందుట నామాట యనవచ్చు ?
ప్రద్యు : మున్నట్టి కొదవిరా మూల మెద్ది ?
శుచి : పత్త్రిక కడు దైన్యపడి నీవు పంచుట ట్లాకొం తపై నెంత హాళికలిమి, నాపతియుఁ భవద్విర హాగ్ని నంత గుందె.
ప్రద్యు : నన్ను నెఱుఁగుట యెట్లు మ న్యాంఘనేయ ?
శుచి : శివ లిఖించి యిచ్చినది నీ చెలువు దానికి.
ప్రద్యు : ఏమిటికి నిచ్చె ?
శుచి : వరుఁడు నీ కతఁ డనుచు.

ఇట్టి సంభాషణ విశేషములను పద్యములలో కూర్చుటయు మనోహరముగానే ఉంటుందిగాని అది నాటకపద్ధతి అని చెప్పగలిగేటంతటి విశేషము కాజాలదు. ఇక పంచసంధులు మొదలయిన నాటకలక్షణము లొక్క దృశ్యకావ్యములకే చెందేవికావు. శ్రవ్య కావ్యములయినా, కథ చక్కగా చెప్పే నేర్పుంటే అవి తప్పకుండా కనబడుతవి.

కవి తన కావ్యములో శుచిముఖీ పాత్రమునకు ప్రాధాన్యము నిచ్చినాడు. తక్కినవారి నందరినీ చేత కానివారిని, అవకులను చేసినాడు. శుచిముఖివలె గుట్టు మట్టులను కొంతవరకు దాచగలిగినది శుకి. హంసిని కృష్ణప్రద్యుమ్నుల పక్షమునా శుకిని వజ్రనాభ సునాభుల పక్షమున నిలిపి ఆ యిద్దరిచేతా ఎత్తుకు పై యెత్తులు కవి వేయించి ఉంటే ఎంతో రక్తికట్టి ఉండేది.

ఇంద్రకృష్ణులకున్ను శుచిముఖికిన్ని కవి యింకా నికటసంబంధమును కల్పించి ఉంటే బాగుండేది. కావ్యములో శుచిముఖి చూపినది దూసుపోని జోలి. వసుదేవుని యజ్ఞసందర్భములో భద్రుని నాట్య మసంగతము. ప్రద్యుమ్న గదసాంబులు వజ్రనాభపురము లోనికి ప్రవేశించడానికి కనువుగా దానిని తీసుకొని వచ్చినా, అది కథలో అతుకుగా స్పష్టపడిపోతున్నది. ఆ నటుని ఆటను చూస్తేనేకాని కృష్ణుని కుపాయము తోచలేదు. ప్రద్యుమ్నుని అశ్వవిహార కేళీవర్ణన మప్రస్తుతము. కథానిర్వహణమున కది యెంతమాత్రమున్ను ఉపకరింపదు. దాని వర్ణనముకోసము కవి అన్ని పద్యములను నెచ్చుచేసి ఉండకూడదు. అతడు ప్రద్యుమ్నుడని శుచిముఖి పోల్చుకొనడానికి కావర్ణనము కవి చేర్చినాడు. అంతటి ప్రతిభాశాలిని అయిన ఆ హంసి ప్రద్యుమ్నుని పోల్చుకొనడానికి కాతని అశ్వకేళి నంతసేపు చూచి ఆకాశమున నిలువవలసిన అవసరము లేదు. కవికి ఆ 'గోల్ఫ్' ఆటను వర్ణించి క్రొత్తవిశేషమును చూపవలెననే అభిలాష తప్ప, అది కథ కెంత వరకు తోడ్పడుతుంది అనే చింత లేకపోయినది. వజ్రనాభుని కవి ఉత్తమాగ్నునిగా సృష్టిచేసినాడు. హంసి చెప్పిన మాటలు విని భద్రుడే అని తాను నమ్మి ఒక అపరిచితుని తనపురములోనికి ప్రవేశ మిచ్చినా వాడు వేషధారి, ఐంద్రజాలికుడు అని తెలిసికూడా, అన్నినాళ్లు వాడు తన వీటిలో ఉండి ఏమి చేస్తున్నాడో తెలుసుకొనే ప్రయత్న మయినా చేయనంతటి అవివేకపురాక్షసరా జయినాడు వజ్రనాభుడు. అ తటె అవివేకిని సంహరించడానికి కింత సన్నాహము సంరంభము లక్కరలేదేమో! ఆ నినుకలి కనుకలి విరహవర్ణనలు, ఆ ప్రభావతీ ప్రద్యుమ్నుల నఖాదిశిఖాంతవర్ణనలు మితిమీరిపోయినవి. కావ్యములు పెద్దవిగా అగుటకు మాత్రే మవి ఉపకరించినవి. అవి కథాగతి కడుగడుగునకును నిరోధము కలిగించినవి. ప్రభావతీ ప్రద్యుమ్నుల రత్యుపరతి వర్ణన లుత్త రోతలు; పింగళివానికి కర శాస్త్ర మెంతగా తెలిసియున్నా, పాప మా నాయికానాయకుల రహస్యక్రీడల నంతగా నడివీధిలో చేయించవలెనా? పింగళివా రట్లు చేసినప్పుడు మన మెందుకు చేయకూడదని ముంగలివారుకూడా నాలుగాకు లెక్కువగా చదువుకొని చెలరేగి ఆంధ్ర వాఙ్మయమును గబ్బుపట్టించినారు.

శుచిముఖి దూసుపోని పనిలోనికి చొరబడినా, చాలా నేర్పు గలదే. వేసు నడపడములో దానిది చాలా

కట్టిచేయి. దానిభర్తసూత్రధారుడై దానిని రంగప్రవేశము చేయించినాడు. "ఇదిగో నాటక మాడబోతున్నారు. తప్పు లుంటే క్షమించండి" అనే ప్రస్తావనతో అన్నట్లుగా ఇంద్రునితో అది "దేవా! మమ్ము క్షమింపవలెను. మేము నీ కొలంకులను విడిచి నీశత్రువయిన వజ్రనాభుని పురమును చేరుకొన్నాము. మే మేమి చేయగలము? కడుపు కక్కుర్తి గదా. ఇక్కడి కొలకులలోని పద్మముల నన్నిటినీ వాడు తీసుకొని పోయి, తన కొలకులలో నాటుకొన్నాడు. తిండి కోస మక్కడకు చేరుకొన్నామే కాని మరి ఒకటి కాదు" అని సమాధానము చెప్పుకొన్నది. దేవకార్యమున కనుకూలముగా ప్రభావతికి ప్రద్యుమ్నునిమీద గల ఉత్కటమైన కనుకలి మోహమును తెలిపి, ప్రద్యుమ్నుని ప్రభావతితో చేర్చే సన్నాహము చేయదలచి ఉన్నదన్నది. 'అయితే, కృష్ణునివద్దకు పోయి, ఆ ప్రయత్నము చేయు మన్నా" డింద్రుడు. అది కృష్ణునివద్దకు పోయినది; చెప్పినది. భద్రుడనే నటుని చర్య ఉపకరిస్తుం దని కృష్ణుడు హంసకు తెలిపి, నీవే ఆపనిని నిర్వహించ వలసిఉన్న దని చెప్పినాడు. ఈ సంగతి దగ్గర నున్న రుక్మిణికి తెలియకుండా ఆమెను లెక్కవవారిని దూరముగా పంపించేటట్లు చేసింది శుచిముఖి. ప్రద్యుమ్నుడు అశ్వకందుక కేళిలో ఉన్నాడు; చూచినది. 'ఇతడే కాబోలునే అతడు!' అని అతనికి వినబడున ట్లన్నది. అతడు చూచినాడు, దగ్గరకు పోయినది. మీ తండ్రి యగు నింద్రుడును నిజపరివారంబులోని వారిగా విచారించి యీరీతి బనిపంచి నడుపుకొనుచున్నవారు: "నీవు వారిజాక్షునకు దక్షిణభుజాదండంబునుంబోలె నఖిల కార్యంబులందు నత్యంత ధురంధరత్వంబు వహించియున్నవాడవు గావున మా విఘ్నంబును నీకు విన్నవించుకొంటిమి. ఎల్లపట్టునం దృష్టిఁ బెట్టుకొని యుండునది. ఏను పోయివచ్చెదను." అన్నది. మీరు పోయే పని రహస్య మైనదేమో? దానిని నే నడుగను. కాని, 'అతడే యితడు కాబోలు' నన్నావు. నా ప్రసంగ మెచ్చట వచ్చినది?' అని ప్రద్యుమ్నునిచేత నడిగించుకొన్నది. ప్రభావతి రూపవర్ణనము చేసినది. అతనికి విరాళి ఎత్తించినది. తాను పోయినది. అతడు తనకు ప్రభావతిమీద పుట్టిన మోహము నామె కెరింగింపు మని చెప్పమరచిపోయినాడు. ఏమి దారి? హంసితో ఆమాట ఎవరు చెప్పతారు? సూరన్న తలచుకొంటే చెప్పేవాకే లేకపోతారా? ఒక చిలుక కనబడినది, 'పాపము చాలా బాధపడుతున్న ట్టున్నావు. అయినా, నీ రహస్యాలతో నా కేమి పని? ఒక జాబు వ్రాసి నా రెక్కలలో పెట్టు. నేను తీసుకొనిపోయి ఆ హంసి కిస్తా' నని ధైర్యము చెప్పినది. అట్లే పెట్టినాడు. ఆ లేఖ– అదృష్టమే అనుకొనండి, దురదృష్టమే అనుకొనండి– రాగవల్లరిచేతిలో పడినది, ప్రభావతిచేతికి చేరినది. చిలుక ఎగిరిపోయినది. జాబులను తెచ్చే చిలుక ఎటువంటి దయినా అవుతుంది, దీనిని పోనివ్వకూడదని వెంటనే రివ్వున ఎగిరి శుచిముఖి దానిని గట్టిగా పట్టుకొని, దాని రహస్యమును కనుగొన్నది. ఆ రహస్యము తన కనుకూలమైనదే అని సంతోషించినది. ప్రభావతి వద్దకు వచ్చినది. చిత్రపటములోనివాడు చిలుకచేత తనకు లేఖ నంపిన ప్రద్యుమ్నుడే, ఆమెను మోహించి, తనవలెనే తహతహ లాడుతూ ఉన్నవాడే, అని నమ్మకము పుట్టించినది. కొంతసే పాలోచించినది. తన ప్రజ్ఞలు పలుకుకొన్నది. ప్రద్యుమ్నునికి భద్రవేషమున గదసాంబులతో వజ్రనాభపురము ప్రవేశించడాని కనువు కల్పించినది. ప్రభావతి కతనిని చూపినది; అతని రహస్యోక్తుల కర్థము వివరించి చెప్పినది. వారిని కలిపినది. గదసాంబులను చంద్రవతీ గుణవతులతో కలిపినది. తరువాతి పను లన్నీ తాను తలుపీవలనుండి జరుగ నిచ్చినది. వజ్రనాభుని సంహారమునకు ప్రద్యుమ్నుడు చాలి ఉన్నా, ఎందుకయినా మంచిదని, కృష్ణుని రప్పించి, అతని చక్రమును ప్రద్యుమ్నుని కిప్పించి, మామశిరస్సును దొంగఅల్లునిచేత ఖండింపించినది.

ఈ కావ్యము 'ప్రభావతీ ప్రద్యుమ్నము' కాదు; 'శుచిముఖీవిజయము' ఈ హంసి అంతటి తెలివిగల పాత్రము కావ్యములో మరియొకరు లేక పోవడముచేత అది మిక్కిలీ సులభవిజయమైనది.

శుచిముఖి మాటకేమిగాని, సూరన్న ఆమెనోట తన ప్రజ్ఞావిశేషముల నెక్కువగా మనకు

తెలియ జేసినాడు. తన భాషాప్రావీణ్యము చూడఁగ వాగ్దేవతినా కాక ఆకటిద్దిన కవినా? అని ప్రశ్నించు కొని 'ఆకటిద్దిన కవిని' అని తెలియజేసికొన్నాడు. శుచిముఖి పారంధరహంస కపత్యము; తాను సకల వేద శాస్త్ర పారం-ధరుడైన అమరనార్యుని అపత్యము. బుధుడైన తాను చేసే సుకవిత్వములు 'ఎట్టియర్థమును దగుల్కొనఁ దివియక పలివో' నివ్వవు. తాను 'వాణి పెనుప పెరిగి విద్యలెల్లఁ దద్విమలశిక్షఁ' గన్నాడు. వాణియే తన పలుకులకు మెచ్చుకొని 'కామధేను' అనే బిరుదము నివ్వడమే కాకుండా, ఆ బిరుదము వ్రాసిన నూపురమును (పెండేరమును) తన కాలికి తొడిగినది. వాణిని గురించి బ్రహ్మచేత పలికించిన —

"నీకుఁ బ్రసాద సన్నిధిమహత్త్వము సుమీ
నిగమరాశి ముఖస్థ మగుట నాకు;
నీ విలాస మచర్చ్యకావిశేషము సుమీ
సంగీత సాహిత్య సౌరభంబు
నీకటాక్షశ్రీ విపాక భేదము సుమీ
వేణువీణాదుల రాగలెల్ల;
నీ వనుగ్రహలీలఁ గావించుటన సుమీ
యఖిలలోకవ్యవహారసిద్ధి —"

అనే మాటలు కవికి సంబంధించినవే.

సూరన్న చాలా చదువుకొన్నవాడు. శుచిముఖి మాటలనే కొంచెము మార్చుకొని సూరన్న తనకన్వయింప జేయవలెనని ఉద్దేశించినాడని నిస్సంశయముగా చెప్పవచ్చును.

"కాణాదంబును, గౌతమీయమును, సాం
ఖ్యంబున్, భుజంగాగ్రణీ —
వాణీమార్గము జైమినీయమతమున్
వ్యాసోక్తశాస్త్రంబు న —
క్కాణించుం గడుఁ బూర్వపక్షములు జో
కం బెంచుచుం బెంచి, య —
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదన్
సిద్ధాంతముల్ నిల్పుచున్.

స్వమతిప్రౌఢి దృఢానుమానముల సం
సాధించుఁ జేశేళ నా
ద్ది మతం బప్పుడు వానివానికి నుపా
ధిగ్రస్తతావ్యాప్తి భం —
గముఖానేక సుదూషణంబులు వెసం
గల్పించుఁ దా నవ్య శా —
స్త్రమత స్థాపనవేళ నాసుకవి రా
జశ్రేష్ఠు లౌహళో యనన్.

కావ్య, నాటకాలంకార, గాన, మదన
శాస్త్రపరిచయమహిమంబు (సరసవాగ్వి
లాసి సూరన తెల్పు సోల్లాసముగను
తనదు కృతికర్త మెచ్చి యుద్ధాయనంగ.

విప్రవినోదుల విద్య సూరన్న మనస్సులో సుస్థిరముగా నాటుకొనిపోయినది. వీరిలో ప్రధాన నటుడొకడుంటాడు. అతనికి సహాయకులు పారిపార్శ్వకుడు, విదూషకుడు వారితో వారసీమంతినీవ్రాతము, వైణికులు, వైణవికులు, మారజకులు మొదలయినవారుంటారు. వారూరినుండి ఊరికి తమ 'గణియము' తో పోతూ, ఊరిబయట అనువడిసెలు వేసుకొని, ఊరివారు పిలిచి అడిగితే తమ నేర్పును చూపిస్తారు.

ఆటకు ముందు రంగమంగళాచారము జరుగుతుంది. తరువాత సూత్రధారుడు పూర్వరంగ ప్రవర్తన చేస్తాడు. ఆరంభములో

"గాంధారీప్రముఖస్వరశ్రుతికళా
గంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతని
క్వాణంబు వంశాదిసం
బంధిస్వానపరంపరామహిమయున్
మద్దెళ్ల 'ధిం ధిం ధిమిం
ధిం ధోం ధక్కి ధిమిక్కి' శబ్దభరమున్
దీపించు నాపూర్వతన్.

ఆ తరువాత చంచత్పుట, చాపపుట, ఉద్ఘట్ట, షట్పితాపుత్త్రిక సంజ్ఞలతో, సమ విషమ తాళ ప్రవృత్తులు నాలుగింటిని ప్రస్తరించినందువల్ల కలిగే నానా తాళభేదములు వినబడుతవి. వాటి ననుసరించి ఏలాది ప్రబంధములు, తత్తదర్థస్థానదత్త పటాక్షర బిరుదాది కొంగ విస్ఫురణను చూపెట్టుతారు. చతుర్థశ

ముద్రలు, గీతభేదములు వెనువెంటనే ప్రదర్శితము లౌతవి.

ఇది జరిగిన తరువాత నాందీస్తుతి. పిదప నాటకప్రదర్శనము. ఆనాటకములో ప్రరోచన, ఆముఖము, ప్రస్తావన, ఇవి మొదట జరిగేవి. తరువాత కథలోనికి దిగుతారు. ప్రద్యుమ్నుడు వజ్రనాభుని యెదుట 'గంగావతారము' మొదలయిన చాలా నాటకముల నాడినాడట. సూరన్న చూచిన నాటకములలో ఆతని మనస్సున సుముద్రితమయిన దీ 'గంగావతరణ' మై ఉంటుంది. విజయనగర సామ్రాజ్యములో ఈ యక్షగానమునకు చాలా ప్రశస్తి ఉండేది; అసలు విజయనగరము క్షీణించిన తరువాత దక్షిణమునకు పోయిన మాండలికప్రభువు లీనాటకముల నెక్కువగా పోషించినారు. వారిలో శాహమహారాజు ముఖ్యుడై స్వయముగా ఎన్నో నాటకములను వ్రాసి ఆడించే వాడు. రఘునాథరాయలు తంజావూరిలో ఎన్నో నాటకశాలలను కట్టించినట్లు చేమకూరి వేంకటకవి వ్రాసినాడు. ఇప్పు డీ నాటకకళ క్షీణించిపోవడము ఆంధ్రహృదయక్షీణతకు నిదర్శనము.

యక్షగానరూపమయిన నాటకప్రదర్శనము సాధారణమయిన పని కాదు. ఆడేవారి కొక చిన్న పందిరి తప్ప మరేమీ రంగప్రసాధన ప్రక్రియ లేదు. పాత్రప్రవేశమప్పు డిద్దరు పట్టుకొనే ఒక దుప్పటి తప్ప మరేమీ తెర లుండవు. దివిటీలు పట్టుకొనే వాళ్లు ఆముదపు సిద్దెలతో పాత్రముల ప్రక్కనే నిలబడి ఉంటారు. మద్దెలగాళ్లు, తాళగాళ్లు, వెనుకపాటగాళ్లు అందరున్ను ప్రేక్షకులయెదుటనే ఉంటారు. నిష్క్రమించినపాత్రకూడా ఒక ప్రక్క రంగస్థలముమీదనే ఉంటుంది. ప్రధానపాత్రములు ప్రవేశించేటప్పు డెంతో అట్టహాసము కావలెను. తెరపట్టవలెను. ఫలానాపాత్రము ప్రవేశింపబోతున్నదని ప్రేక్షకులకు పాటలమూలముగా తెలియజేయవలెను. 'ఇదిగో వచ్చె, అదిగో వచ్చె' అని కొంతసేపు ఊరింపు జరుగవలెను. తెరతీసే వేళకు జోడుదివిటీలను ఒక్కచోట చేర్చి గుగ్గిలము చల్లి దృష్టిపరిహారము చేయవలెను. అందులో నాయికాపాత్ర మయితే మరీ కష్టము. తెరతీసి గుగ్గిలము చల్లినతరువాతకూడా, వెంటనే నాయిక మొగముగాని అలంకారముగాని మనకు కనబడనివ్వరు. ఆ పాత్రము మేలిముసుగు వేసికొని ఉంటుంది. ఆ ముసుగు తొలగేసరికి కొంతకాల మవుతుంది. అప్పటి నుంచీ ప్రారంభ మవుతుంది భరతనాట్య ప్రదర్శనాత్మకమైన నాటకము.

సాధారణముగా ఈనాటకప్రదర్శనము రాత్రి జాముప్రొద్దు కారంభ మవుతుంది. నాయికాప్రవేశ మయేసరికి దొంగరేటు అవుతుంది. నిద్ర కాయలేని వాళ్లు నాయికాప్రవేశము కాబోతుందనేవరకు ఒక నిద్ర తీసి, చూడడానికి పోతారు. నాటక మయే సరికి తెల్లవారిపోతుంది. ఆవేషములతోనే నటకులు ఊరిలోని ఇంటింటికిన్ని పోయి బహుమానములు దండు కొంటారు.

ఇంతమందిన్ని పాత్రాపాత్రవిచక్షణత లేకుండా కలసిమెలసి ఉన్నా, పాత్రధారి అందరిదృష్టిని అభినయ విశేషముచేత తన నాట్యకళాప్రతిభమూలముగా తన వంకకు త్రిప్పుకోవలెను. తాను తప్ప రంగస్థలము మీద మరెవ్వరున్ను లేనట్లు భ్రమను కల్పించే అంతటి నేర్పును చూపవలెను. ఆచీన వెనుక, ఆకృత్రిమాలంకారముల వెనుక ఉన్నవా డెవడో ఊహించడానికి అవకాశ మివ్వకుండా, నిజముగా ఆ శివుడో, ఆ భగీరథుడో, ఆ పార్వతియో; లేక ఆ కృష్ణుడో, ఆ సత్యభామయో, ప్రత్యక్షముగా అక్కడ వర్తిస్తూ క్రీడిస్తూ ఉన్నా రన్న భ్రాంతిని కల్పించినా ప్రేక్షకులు తాము భ్రాంతిలోకములో లేనట్లే తలంచుకొనేటట్లు చేయవలెను. గంగ నిజముగా దిగకపోయినా అభినయము మూలముగానే నిజముగా గంగావతరణము కలుగుతూ ఉన్నదని ప్రేక్షకు లనుకొనేటట్లు చేయవలెను. ఆ అభినయము మూలముగానే కైలాసాది నగకల్పనము నానావన ప్రపంచనము, పశుపక్షిమృగాది జంతువిశేష రూపవృత్తులు, ఎచటి కయ్యది యోగ్య మచట తత్తద్వస్తుసృష్టి – ఇవన్నీ జరుగవలెను. అది ఒక కనుకట్టు విద్య. దానికి సామగ్రి స్వల్పము; సృష్టి ఒక గంధర్వ లోకము.

సూరన్న అద్వితీయమైన ఊహతో తన కావ్యము నారంభించినాడు. కళాపూర్ణోదయ కావ్య సృష్టికర్త యెందుచేతనో దానిని సాగించ లేకపోయినాడు. అది ఆంధ్రుల దురదృష్టము.

కళాపూర్ణోదయము వ్రాస్తూ ఉన్నప్పుడే అతనికి ప్రభావతీ ప్రద్యుమ్నము వ్రాయవలెననే ఉండేది. ఈ విషయమును గురించిన సూచనలు కళాపూర్ణోదయములో కనబడుతున్నవి — ప్రద్యుమ్నుని స్వరూపము కవిదృష్టిలో మొదటినుంచిన్ని ఉన్నదన డానికి కారణము కృతిభర్త అయిన నంద్యాల కృష్ణరాజును కృష్ణునితో పోల్చుతూ —

"ఒక ప్రద్యుమ్నునిఁ గాంచెఁ దొల్లి యదువం
శోద్భూతి పెంపొందుచున్
సకలస్తోత్రసురులం గరంబిపుడు శ్రీ
నంద్యాల కృష్ణక్షితీం
ద్ర కరాబ్జాన్వయ సంభవంబు కతనం
బ్రద్యుమ్నులం జేయు మన్
బ్రకటంబయ్యెడు దానవారి యవతా
రంబంది ధాత్రీస్థలిన్" —i ౭౯.

అని వ్రాసిన పద్యమువల్ల స్పష్టమవుతున్నది. ద్వారకాపట్టణవర్ణనము, కృష్ణునివర్ణనము రెండింటిలో అనుస్యూతముగా వచ్చినవి. చిలుక వృత్తాంతము వేర్వేరుగా ఉన్నా రెండింటికిన్ని సామాన్యము. కళాపూర్ణోదయములో (v. iii) సూచింపబడిన సుజ్జఱ్ఱు స్వారి ప్రద్యుమ్నుని అశ్వవిహారవర్ణన సందర్భమున విపులీకరింపబడినది. ప్రభావతీ ప్రద్యుమ్నములోని వినుకలివిరహము కళాపూర్ణోదయములో (vi. ౨౦౯) పూర్వ సూచితమే. "మద్విధుఁడు వాకలలోపలవచ్చి తేర్చు గామాహవకేళి" (కళా vi. ౨౬౧) అనేదానిలో ప్రభావతికి కలిగిన అవస్థ సూచింపబడినదిగదా. అట్లే, రతిపరిశ్రమచేత చొక్కిన రంభ "నలకూబర! విడు విడురా యలసితి"(iii. ౨౮౪) అనే నిర్భర ప్రేమార్త నాదమునే ప్రభావతికూడా చేసినది — ఇట్లే మరికొన్ని సామాన్యఘట్టములను వివరించవచ్చును.

ఇట్టి సూచనలుగల విషయములన్నీ అతని మనస్సులో కళాపూర్ణోదయ రచననాటికే పనిచేస్తున్నవి. కాని వాటి కన్నిటికిన్ని ఏకకావ్య స్వరూపములో మేళనము కలిగి అఖండచిత్ర మేర్పడలేదు. భద్రవట వృత్తాంతము నాధారము చేసుకొని తన కంతకు పూర్వము కలిగిన ఊహలను చేర్చి కళాపూర్ణోదయమునుమించిన సృష్టిని సూరన్న చేయవలెననుకొన్నాడు. మది మదిదప్పిన మొదటిదే ల్పయినాడు.



# నా బ్రతుకు

శ్రీ శంకరంబాడి సుందరాచారి

నీ దివ్యభవనాన
ఎన్ని తిరునాళ్లురా !
నీ నందనవనములో
ఎన్ని విందులురా—
లోని కేగుదమన్న,
పోనీయ రేమిరా

*　　　*　　　*

నీ పూలతోటలో
ఏమూలనో రాలి,
ఒంటిగా నిటుల నే
నుండజాలనురా !

*　　　*　　　*

జాలికే నాజోలి
చాలు ననిపించెరా !
కాటికే నాపిలుపు
కాకపోయిందిరా !—

*　　　*　　　*

కడలిగర్భాలలో
కమలాలు మెరసినా ;
ముంచుకెరటాలలో
ముత్యాలు విరిసినా ;
వద్దురా ఈ బ్రతుకు,
వద్దురా దేవుడా !
ఈ విలయజలధిలో
నే నీదలేనురా !!!

*　　　*　　　*

ఈ చిన్నిగుండెలో
ఎన్ని గుండాలురా—
ఈ లేతబుట్టిలో
ఎన్ని అంపాలురా.



# సిప్రా

## వనస్పతి సంబంధమైన టాయిలెట్ సబ్బు

చాల ఎక్కువ నురుగు, అనుకూలమైన పరిమళముతో కూడినది. చర్మమునకు ఎక్కువ మృదుత్వము చేకూర్చునట్టియు, పరిశుద్ధమైనట్టి దినుసు లిందు చేర్చబడినవి. సుకుమారులకుగూడ యీ సబ్బు సంతృప్తిని కలిగించును.

**లేతచర్మమునకు నిరపాయకరమైనది**

**Bengal Chemical & Pharmaceutical Works Ltd., Calcutta & Bombay.**

మదరాసు ఏజంట్లు:— యస్. దేశాయిగాండర్ అండ్ కంపెనీ, 41, బందరు వీధి.

---

## ఇప్పుడే భీమాచేసికొనుట వివేకంగాదా?

అనిశ్చయమైన భవిష్యత్తుతో ప్రతివారును రాబడిని కూడబెట్టి కాపాడుకొనుటలో శ్రద్ధగా పని చేయుట ముఖ్యమైన పని.

మీరు యింతకుమునుపే జీవితము భీమా చేసుకొనిన దానిని విడువవద్దు, తప్పిపోనీయకుడు. మీకు భీమా లేకపోయిన నేడే భీమా చేసికొనుడు. ఒక జీవితపాలసీ మీకు ఉత్కృష్టమైన రక్షణ యొసంగును. అది మీకు యిప్పుడే తరువాతకంటె చౌకగా నుండును. ముందుగా హెచ్చరిక కలిగియుండుట రక్షణ కవచమువంటిదను వాక్యోక్తి సత్యమైనది.

మిగతా వివరములకు సలహాకు వ్రాయుడు:

## నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

ప్రధానకార్యాలయం: కలకత్తా. స్థాపితము: 1906

బ్రాంచి ఆఫీసు:

"నేషనల్ ఇన్సూరెన్సు భవనములు"

362, చైనాబజారు రోడ్డు, ఎస్ప్లనేడ్, మద్రాసు.

సబ్ ఆఫీసులు: 171, న్యూస్ట్రీట్, మధుర. 5, కెంపెగౌడ రోడ్డు, బెంగుళూరు.

---

## రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసన గల తలనూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, కూడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0  6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

**పి. శి. ఏ. అండు కంపెనీ,**

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

# నిన్నటి సంగీతము

## ఇరువురు సంగీతకోవిదులు



= శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ =

నే నెఱిగిన సంగీతకోవిదులలో నెల్ల కీర్తిశేషులగు మైసూరి వీణ శేషన్నగారును, బిడారం కృష్ణప్పగారును మహాపురుషులు. వైణికశిఖామణి యని వారును, గానవిశారదు డని వీరును బిరుదుగడించినవారు.

వారి కాలమున,—అనగా, ఈ శతాబ్దము మొదట—సంగీత విద్యావంతులలో ఇప్పుడున్నంత లక్షణచర్చ యుండలేదు. అనేకగ్రంథములును బైలుపడియుండలేదు. సంగీత లక్షణమునందు తమకు తెలిసిన సామాన్యవిషయములనుగూడ పరమపవిత్రరహస్యములుగా విద్వాంసులు దాచిపెట్టుచుండిరి. కృష్ణప్పగారు 'కమాసు' రాగమునకు సంచార మెట్లని ఒకానొక ప్రాచీన మైసూరువిద్వాంసుని అడుగగా, ఆ పుణ్యశాలి "పంద్రెండేండ్లు గురుకుల వాసము చేసినగాని ఆ రహస్యము తెలియ వీలులే" దని చెప్పెనట

శేషన్నగారు, కృష్ణప్పగారు పాడి వాయించుచుండిన రచనలు, ముఖ్యముగా త్యాగయ్యగారివి, వారి శిష్యులవి, దీక్షితుల శాస్త్రుల రచనలు. తక్కిన ప్రాచీన ప్రబంధములు, ఠాయములు* మొదలగువానిని వారు పాడగా వాయింపగా నేను వినలేదు. వారు విస్తరించుచుండిన రాగములు శంకరాభరణము, కల్యాణి, తోడి మొదలగు కొన్నియే. ఆహిరి, హుసేని మొదలగు దేశీయమిశ్రరాగముల కీర్తనలను అపురూపముగా వారివద్ద విన్నాముగాని, ఆ రాగముల విస్తరింపును వినలేదు. ఒకమారు శేషన్నగారిని, హుసేనిరాగమును వాయింపుడని ప్రార్థించితిని. "నన్ను పరీక్షించెదవా ?" అని కొంత అతృప్తిని సూచించి, నవ్వుచు ఆయన కొంత విస్తారముగానే దానిని వాయించిరి కాని నా కావాయింపులో రాగవ్యక్తిగాని, శేషన్నగారి అసాధారణప్రతిభాబలముకాని, గోచరింపలేదు. ఇట్టి రాగముల స్వరూపము నన్నడుగవద్దని కృష్ణప్పగారు స్పష్టముగా చెప్పుచుండెడివారు. తాళములలోగూడ ఇప్పుడు కొందఱు ప్రయోగించు విపరీతపుతాళములుగాని, వెగటునడకలు

* రాగాలాపనలో చేరైన నొక స్వరము స్థాయిగానుంచుకొని పాడుట "ఠాయ" మనబడును.

గాని వారు వాడుచుండలేదు. నేను వారివద్ద వినగలిగినదెల్ల చతురశ్రపు నడకగల ఆది, రూపకము, త్రిపుట మొదలగునవే. సంగీతసంగ్రామములందు వారు సంపాదించిన గెలుపులు, గౌరవములు అన్నియు ఈ మూడునాల్గు ప్రసిద్ధతాళములచేతనే జరిగినవి.

శేషన్నగారు రసికులు, సుకుమారులు; చాల చురుకైన, కలతలేని తెలివి-మఱపెఱుగని మేధ. ఆరాధించినది వీణయేకాని చేతికేవాద్యము దొరికినను దానిని నాల్గునాళ్లలో లొంగదీయు ప్రజ్ఞ ఆయనయందున్నట్లు నేనెవరియందును చూడలేదు. ఫిడేలు, జలతరంగము, స్వరజిత్తు, హార్మోనియము, పియానో మొదలగు పలువాద్యము లాయనకు స్వాధీనములు. కాని వీణ ఆయనకు దైవము. వాయించుచు, ఔడుగఱచి "అట్లు పలుకుము" అని వీణను ఆజ్ఞచేయుచుండిన గొప్ప విద్వాంసు డొకడు మునుపు మైసూరిలో నుండెనట. శేషన్నగారుమాత్రము "మాఅల్పయోగ్యతకు తగినట్లు మేము వాయింతుముగాని, వీణ యోగ్యతకు దగినట్లు వాయింప గలమా?" అని పలుమారు భక్తిగౌరవములతో చెప్పుచుండెడివారు. ఆవాద్యము మూలముగానే ఆయన భగవల్లీల యనంతమని యనుభవింప గలిగెను. ఆయననోట కఠినమైన మాట ఒక్కటి విన్నవారు లేరు. కల్పన లన్నియు, ఎంత కఠినములైనను, వినువారికి లలితములుగా తోపజేయు ఇంద్రజాల మాయెడిది. వీణతో ఆటలాడినవాడేకాని పోటులాడినవాడు కాడు. పని చాల కష్టమైనదనిమాత్రము చూపి ఆయన తృప్తిపడలేదు. కష్టమునకు ఫలము సుఖమే కావలెనని ఆయన నమ్మి చూపినవాడు. ఆయనకచ్చేరీలు మూడునాల్గుగంటల కాలముగ నడచినను అందులో మూడువంతులు రాగము, తానము, పల్లవి వీనితో ముగియును. ఆయన వర్ణము వాయింపగా నే నెప్పుడును వినలేదు. రెండుమూడుకీర్తనలకంటె ఎక్కువగా కచ్చేరీలలో వాయించుట కాయనకు ప్రొద్దుచాలదు. కాని, రాగతానపల్లవులు పలువిధములగు పూవులను వర్షించినట్లు, గంపలతో జల్లినట్లు, ఎంచివేసినట్లు నడచెడివి. రచన యెంత గంభీరమో అంత విస్తారము, ఎంత కఠినమో అంత మృదువు, ఎంత అపూర్వమో అంత యందము. నడక యెంత విలంబమో ద్రుతమో అంత స్పష్టము. గణితపు స్వరపంపకము లన్నియు ముత్యాల ముగ్గులవలె, భిన్నవ్యక్తులు గలిగి, ఒకటితో నొకటి తమంతట చేరి మేళగించున ట్లుండెడివి. ఏది వాయించినను కనువొంగమేకాని పెదవిబిగింపులుగూడ ఉండవు. వృద్ధవయస్సులో పలుమాఱు తనచేతి నాదలయానందమునకు తానే సొగసి చొక్కి అఖండముగా కన్నీళ్లు రాల్చుచు తల వాల్చి కొంత ప్రొద్దు వాయింపు నిలుపుచుండెడివాడు. ఆయన సంగీతరాజయోగి.

కృష్ణప్పగారి తత్త్వము కొంత భిన్నమైనది. ఆయన సంగీతమందు హఠయోగి. సప్తస్వరముల ప్రకృతివికృతులను శుద్ధముగా గాత్రమందు చూపుట, ఎత్తిన కాలము ఎట్టిది

గాని తుదవరకు ఈడ్పులుగా, జారులు లేక కచ్చితముగా నిర్వహించుట—ఇవి వారి పరాయణములు. కృష్ణప్పగారు అనేకభాషల కృతులను పాడుచుండిరి. వానిని విన్నప్పుడు ఆ భాషలలో దేనియందును వారికి సాహిత్యసంస్కారము లేదను రహస్యము ఎవరికిని సామాన్యముగా తెలియదు. ఆయననాదము నాభినుండి ధారాళముగ పూర్ణత్వముతో ఉద్భవించి స్వస్థానమందు స్ఫురించుచుండెడిది. పాడునప్పుడు మొగమున నవ్వుకన్న గాంభీర్యము ఎక్కువ; పాటలో అందచందములకన్న అఖండత మెక్కువ. వినువారిని ముగ్ధులనుగా జేయుటకంటె మూగలనుగా జేయుట మెక్కువ.

వారివద్ద సిద్ధముగా నుండిన త్యాగరాజాదుల కృతులు కన్నడ 'జీవర నామములు' అసంఖ్యములు. మైసూరుమహారాజుగారి నగరులో పాడినపాటను మరల పాడ గూడదనిసంకల్పము చేసి దానిని నిర్వహించినవాడు. హిందూస్తానీపద్ధతియందును స్వతంత్రముగా కచ్చేరీలుచేయు సాధనసంస్కారము లాయన కుండెను. నాలుగుగంటలు కచ్చేరీలు ఆయనకు సామాన్యము. ఐదారుగంటలకాలముగూడ శరీరముగాని, శారీరముగాని చెక్కుచెదరక కూర్చొని పాడినదియు పలుమారు విన్నాము.

ఈయిద్దతియందును దక్షిణాదిబాణీ లేదనువారు అప్పటికిని ఇప్పటికిని గలరు. నిజమే. కారణము వారు స్వతంత్రులగు నిర్మాతలగుటయే. బాణీ అను పేరితో ఒకరిద్దఱి పోకడలనే అందఱును అచ్చుగొట్టు దుష్పద్ధతి యీవల దక్షిణదేశమందు ప్రబలుచున్నది. నవ్యత నశించుచున్నది. ప్రతివ్యక్తియందును ఈశ్వరదత్తమగు విశిష్టగుణ మొకటియైన నుండును. అది స్ఫురించుటకు కళలందెల్ల సంగీతము సర్వోత్తమసాధనము. వీరిది ఒక ప్రత్యేకశైలి. వీరు ఇతరుల నెప్పుడును అనుకరింపలేదు. కావుననే యితరు లెవరును వారిని అనుకరింపజాలరు.

[రేడియో ప్రసంగము: ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రమువారి అనుమతితో]





పుష్పచయము

సీరియల్ నాటకము:



# రాజరాజు

= శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి =

### ఇరవయ్యో రంగం

చిత్రాంగి నగరు.

రెండు గడియల పొద్దే వుంది.

మందువా తెరపిలోనుంచి పగటి చరమ దీప్తి, గాజుకుప్పెలలోనుంచి సుగంధదీపికల ప్రారంభ తేజస్సూ వచ్చి మిళితమై హాలు కంతటికీ విలక్షణశోభ కూరుస్తున్నాయి.

జాబాదిగి వచ్చి, చిలకా చిత్రాంగీ పడమటి వేపు లోగుమ్మంలోనుంచుని మహోత్సాహంతో ఎదురుచూస్తున్నారు.

సారంగధరుడి రాక గురించి విన్నవించడానికి, ఇటు సింహద్వారం దాకానూ, అటు పాణిద్వారం దాకానూ జక్కులదీవి పరిచారికలు అంచెలుగా నుంచుని వున్నారు.

వసారా మెట్ల దగ్గిరికి వెళ్లి వార్త అందుకు వచ్చి చెబుతూ, మళ్లీ వాటికోసం వెడుతూ మెరుపులాగ సంచరిస్తోంది రుక్కు.

***

రుక్కు—(వడిగా వచ్చి) దొడ్డిగుమ్మం చేరి మళ్లారు. (వెళ్లిపోతుంది)

చిత్రాంగి—(చిలకతో) బాగుంది. కదూ ?

చిలక—చెప్పి పంపినట్లు గ్రహించుకున్నారు, వారు సామాన్యులా తల్లీ ?

రుక్కు—(మళ్లీ వచ్చి) గుమ్మందాటి లోపల ప్రవేశించారు. మనవాళ్లందరూ పుష్పాలు చల్లి వరాసగా పాదాభివందనం చేస్తూవుండగా చిరునవ్వుతో శిరసావహిస్తూ శరవేగంతో దయచేస్తున్నారు. (వెళ్లిపోతుంది)

చిత్రాంగి—(ఏదో చెప్పబోయి, గభీమని చిలక జబ్బలు పట్టుకుని, అంతలో సిగ్గుపడి వూరుకుంటుంది)

చిలక—సిగ్గెందుకు తల్లీ ? ఇన్నాళ్లు బాధపెట్టినందుకు ముందు వారే చేతులెత్తి—(అర్ధోక్తి)

చిత్రాంగి—(చిలక నోరు మూస్తూ) అయ్యో, అయ్యో!

రుక్కు—(మళ్లీ వచ్చి) మెట్లమీద అడుగు పెట్టారు. (వెళ్లిపోతుంది)

చిత్రాంగి—(అమ్మయ్య అన్నట్టు పెదవులు కదుపుతూ గుండెలమీద చేతులు వేసుకుంటుంది)

చిలక—ఎన్నడో మీ హృదయపీఠమే అధిష్ఠించారు, వారిప్పుడు మెట్లెక్కడం అబ్బురమా తల్లీ?

చిత్రాంగి—(సిగ్గుతో చిలక బుగ్గమీద యిట్టే అంటుంది)

రుక్కు—(మళ్లీ వచ్చి) మధ్యమెట్లమీద నుంచుని ఏదో ఆలోచించుకుంటున్నారు. ఎందుకో పరితాపపడుతున్నట్టు కనపడుతున్నారు. (వెళ్లిపోతుంది)

[చిలకా చిత్రాంగీ మెరుపు కొట్టినట్టయి దిగాలు పడిపోతారు.]

చిలక—(చేరువుని చిత్రాంగి వీపు నిమురుతూ) అతి సాహసకార్యం కాదూ తల్లీ యిదీ? ఒక్కక్షణం. ధైర్యం వద్దు. ఈపాటికి మళ్లీ—(అర్ధోక్తి)

రుక్కు—(మళ్లీ వచ్చి) మళ్లీ బయలుదేరారు. (వెళ్లిపోతుంది)

[చిలకా చిత్రాంగీ పొంగిపోతారు. చిత్రాంగి చిలక చేతులు పట్టుకుని నవుస్తుంది.]

చిలక—సమయానికి సిగ్గుపడతారు సుమండీ, భద్రం.

రుక్కు—(మళ్లీ వచ్చి)దయ చే-శా-రు-(వెనక్కి వెనక్కి తగ్గుతూ రెండోవేపుకి వెళ్లిపోతుంది.)

[సారంగధరుడు ఎదటికి వస్తాడు; కాని మళ్లీ పరితాపపడుతున్నట్టయి, వొక్క క్షణంలో చేరువుని మొగం యెత్తి చూస్తాడు. చిత్రాంగి విభ్రమవిలోకనాలు పరుపుతుంది. చిలక పాదాభివందనం చేస్తుంది.]

చిలక—(దోసిలి వొగ్గి) స్వాతివాన కోరి ముత్యపుచిప్పల్లాగా, చంద్రోదయం కోరి చకోరాల్లాగా నిరీక్షించుకుంటూ వున్నాము. దయచెయ్యండి మహాప్రభూ!

సారంగధరుడు—(మాట్లాడలేడు. చిత్రాంగి కేసి చూస్తూ వుంటాడు.)

చిలక—పద్మసరోవరంలో పూలతెప్పమీద విహారం చేస్తూ దుర్దాంతమైన గాలి విసరున వడి సముద్రంలో పడిపోయాము. సావిత్రీ అమ్మవారిని కొలుచుకుంటూ ఆగాలిని లెక్కచెయ్యక, చివరికి ఇవాళ, వొడ్డెక్కాము, ఏనాగే దుక్కగలిగాము. మహాప్రభూ! తమరు నుంచుని వుంటే మాకళ్లు చూడలేవు. మాహృదయాలు—(అర్ధోక్తి)

సారంగధరుడు—(నుంచునే వుండి దోసిలి వొగ్గి) అపరాధిని. క్షమించకోరుతున్నాను.

చిలక—ఇప్పుడిక్కడ అపరాధులు కానివారెవరు మహాప్రభూ? ఒకరి హృదయం వొకరికి విప్పి చెప్పకోడం కంటే క్షమాభిక్ష మరేమి వుంది మహాప్రభూ? కనక దయచెయ్యండి. (చిత్రాంగితో) మూడేళ్లుగా కలలు కనుక్కుంటూ వున్న పెన్నిధి యిన్నాళ్లకి చేతికి క్కింది, స్వాగతం నివేదించుకోండి తల్లీ!

[చిత్రాంగిమళ్లీ విభ్రమవిలోకనాలు పరుపుతూ, సారంగధరుడికి ఆసనం చూపిస్తుంది. పరవశుడై సారంగధరుడు ఆసనం అధిరోహిస్తాడు.]

సారంగధరుడు—(చిత్రాంగితో) వేళ అతిక్రమించినట్టున్నదే? ఇంకా పూజ ప్రారంభించలేదేమీ?

చిత్రాంగి—(చిలక కేసి చూస్తుంది)

చిలక—మనవి చేసుకుంటున్నాను మహాప్రభూ! ఇవాళ పూజావిధానం మారుతుంది. దానికి తగ్గ సన్నాహాలింకా పూర్తి కాక—(అర్ధోక్తి)

సారంగధరుడు—మార్పా?

చిలక—అవును మహాప్రభూ!

[సారంగధరుడు చిత్రాంగి కేసి చూస్తాడు. చిత్రాంగి కోరచూపులు చూస్తుంది.]

సారంగధరుడు—(చూసిచూసి చిలకతో) అదేమిటో అడగవచ్చునా?

[చిత్రాంగీ చిలకా వొకర్నొకరు చూసుకుం

టారు. సారంగధరుడు ఇద్దర్నీ చూస్తూ వుంటాడు.]

చిలక— (సారంగధరుడితో) అబలలమూ, ఆపన్నలమూ కదా, తీవ్రపరీక్ష ధర్మమా మహాప్రభూ?

సారంగధరుడు—(చిత్రాంగి కేసి చూస్తూ) ఆపన్నత కేమి వచ్చిందీ యిప్పుడూ?

చిత్రాంగి—(మొగం వంచుకుని కొంచెం నిష్ఠురంగా) అంతానూ. తక్కువేం జరిగిందీ?

చిలక—నూనోటనే వినాలని వుంటే—(అర్ధోక్తి)

సారంగధరుడు—బోధపడలేదు. అంచేత—(అర్ధోక్తి)

చిత్రాంగి—(మొగం వంచుకుని) అనుభవానికే వచ్చింది, బోధ కాకపోవడం సంభవమేనా?

సారంగధరుడు—(చకితుడై చిత్రాంగి కేసి చూస్తాడు)

చిలక—(చిత్రాంగితో) మనస్సు చెదిరిపోయీ, హృదయం వ్యథితమయిపోయీ అనుభూతం కూడా గుర్తు తగిలివుండకపోవచ్చు. కనక, తల్లీ, నేను మనవి చేసుకుంటాను. (సారంగధరుడితో) మహాప్రభూ! మూడేళ్ల నాడు.........? పాపికొండల్లో............? జ్ఞాపకం.............?

[సారంగధరుడు కళ్లు మూసుకొని బాధపడతాడు. చిత్రాంగి చిలకని విడిచి సారంగధరుణ్నీ, సారంగధరుణ్ణి విడిచి చిలకనీ ఆదుర్దాతో చూస్తూ వుంటుంది. ఒక్క క్షణానికి మెల్లిగా మొగం యెత్తుకుని, సారంగధరుడు, చిత్రాంగి కేసి చూస్తాడు. అప్పుడు చిత్రాంగి కళ్లుమూసుకుని బాధపడుతుంది]

చిలక—నాటికి వాడు, సుబుద్ధిఅయ్యవారు, ఇలాంటి నిండుహృదయాలను బలవంతాన వేరుచేసి వాటి మధ్య ముళ్లకంచెలు నాటారు. ఈసందుపాటు చూసుకుని, నేటికి నేడు, మహారాజులుంగారు మా అమ్మని చెరపట్టడాని కుద్యుక్తులై—(అర్ధోక్తి)

సారంగధరుడు—(చకితుడై) చెరపట్టడానికా?

చిలక—అవును, కనపడనిదా యిది మహాప్రభూ? చూసిన్నీ—చూస్తూవుండిన్నీ చూడనట్టు నటించడం వీరాధివీరుల కుచితమేనా మహాప్రభూ?

సారంగధరుడు—(చిత్రాంగికేసి చూస్తాడు.)

చిత్రాంగి—(మొగం వంచుకుని కొంచెం నిష్ఠురంగా) నన్ను పరీక్షించడానికే యీ ఔదాసీన్యం అయితే—(అర్ధోక్తి)

చిలక—అది కాదు మన్ననే. ఈపరీక్షలో వీలు తప్పితే ప్రాణా లయినా యిచ్చెయ్యడానికి సిద్ధమే. ఇంతకీ: మా అమ్మ అసాధారణ మేధాసంపన్నురాలు కనక గానీ, లేకపోతే మహారాజా—(అర్ధోక్తి)

సారంగధరుడు—(చిలకతో) నన్ను కీకారణ్యంలోకి తీసుకు వెళుతున్నావు.

చిత్రాంగి—(మొగం వంచుకుని దీనంగా) నేనున్నదే అక్కడ.

సారంగధరుడు—(చిత్రాంగితో) రాజమహేంద్రపుర దుర్గంలో—మహారాణీపదవిలో—(అర్ధోక్తి)

చిత్రాంగి—(మొగం వంచుకుని, వోరచూపులు చూస్తూ, కొంచెం కరుగ్గా) అవును, రాజమహేంద్రపుర దుర్గంలోనే—కాని, కారాగృహంలో—చీకటి కొట్టులో—చావుబతుకుల సంరంభంలో—(అర్ధోక్తి)

సారంగధరుడు—(చిలకతో) వింతగా వుంది.

చిలక—ఉన్నదే అది మహాప్రభూ! లేకపోతే, ఒకరు మనస్సు హరించడం యేమిటి, మరొకరు దేహం హరించడానికి కుట్రలు పన్నుతూ—(అర్ధోక్తి)

సారంగధరుడు—కుట్రలా? ఇంకా పన్నడమా?

చిత్రాంగి—(మొగం వంచుకుని, వోరచూపులు చూస్తూ, కొంచెం కరుగ్గా) కాక? సాహసించడాని కెన్నివేల గుండె లుండాలి?

చిలక—సైథవానికే గాని, శౌర్యసాహసాలకా మహాప్రభూ జక్కులదీవివారి సామంతతే? మా అమ్మ యిప్పుడు జక్కులదీవికి బదులు రాజమహేంద్రపురంలో వున్నారు. ఇంతే భేదం.

సారంగధరుడు—ఎందుకు దయచేసినట్టూ?

చిలక—(అలతినవ్వుతో) కోరి దయచేశారు మా అమ్మ. సూచిభేద్యమయిన గాఢాంధకారంలో వొక్క ఆశాకిరణం గోచరించగా, దాన్ని నమ్ముకుని, అది సాధించుకోడానికి దయచేశారు మా అమ్మ.

సారంగధరుడు—వివాహం—(అర్ధోక్తి)

చిలక—ఇక కావాలి మహాప్రభూ!

సారంగధరుడు—(చిత్రాంగితో) నాయన గారు—(అర్ధోక్తి)

చిత్రాంగి—(ఓరచూపులు చూస్తూ నిరసనగా) సత్యభామా దేవమ్మగారిని ఆశించిన శతధన్వుడి పునర్జన్మ.

సారంగధరుడు—(చకితుడై చిలక కేసి చూస్తాడు)

చిలక—మహాప్రభూ, ఉన్నదున్నట్టు విన్నవించారు మా అమ్మ.

సారంగధరుడు—(చిత్రాంగితో) అయితే కత్తికి—(అర్ధోక్తి)

చిత్రాంగి—(కచ్చితంగా) అది సమరాహ్వానం.

సారంగధరుడు—(చకితుడై మళ్లీ చిలక కేసి చూస్తాడు)

చిలక—(విలాసంగా మందహాసం చేస్తూ) సరిగా అర్థం చేసుకోండి మహాప్రభూ! రాజమహేంద్రపురాధీశ్వరులు సమరాహ్వానం చేశారు, జక్కులదీవి రాజపుత్రిక అందు కంగీకరించారు. దానిమీద వారు కత్తి దూశారు, వీరు పూలదండ విసిరారు. విభీషికలకు జంకే దెవరు? ఎవరి ఆయుధం వారిదీ, ఎవరి స్థైర్యం వారిదీ, ఎవరి భావం వారిదీ, ఎవరి నమ్మకం వారిదీనీ. ఎవరి కెవరు తీసిపోతారూ?

సారంగధరుడు— పూర్వాపరసందర్భాలు—(అర్ధోక్తి)

చిలక—చక్కగా సమన్వయించాయి, లోటేమిటి మహాప్రభూ?

[సారంగధరుడు చిత్రాంగి కేసి చూస్తాడు. చిత్రాంగి చిలక కేసి చురుగ్గా చూస్తుంది.]

చిలక—(చిత్రాంగి యింగితం గుర్తించి, సరే అన్నట్టు సుతారంగా తల పంకించి, సారంగధరుడితో) అయితే, ఉపోద్ఘాతం కావ్యాన్ని మించిపోయింది. ఇదీ వున్న దోషం. కనక విన్నవించుకుంటున్నాను.

మహాప్రభూ! ఆరు మాసాల గడువు పెట్టుకుని మే మిక్కడ ప్రవేశించాము. మహారాజులుంగారిని విసిరి కొడుతూ సంగతి చెయ్యడమే గడువు ప్రయోజనం. ఈసంకులసమరంలో సావిత్రీగౌరీవ్రతమే మాకు అభేద్యకవచం. నాలుగేసీ అయిదేసీ దినాల కొక్క మాటే గాని, మహారాజులుంగారికి ఈనగరిలో ప్రవేశించడానికి కనజ్ఞ లేదు. అదేనా మిడసరిలగ్నంలో. అప్పుడేనా గదిలో తలుపుచాటున మా అమ్మ, ద్వారం యివతల వొక పక్కగా మహారాజులుంగారునూ. ఒక్క తెర మాత్రమే తక్కువ; కాని యీ క్షణం వరకూ వారు మాఅమ్మ ముగం చూసి యెరగరు. మా అమ్మ కంఠస్వరం అయినా యెరగరు. మాశక్షక్యం వహించి, మా అమ్మ మాటలు అనువదిస్తున్నట్టు నటిస్తూ, చిలకలూ పలకలూ పెంచి సమయోచితంగా వారికి ప్రత్యుత్తరాలు చెప్పడం నేను. ఆ మాటలు క్షేమసమాచారాలకు మాత్రమే సంబంధించి వుండాలని వ్రతనియమం అయినట్టు కఠినమైన నిబంధన. దీంతో, ఎంత నిరుత్సాహపడిపోవాలో అంతా నిరుత్సాహపడిపోయి, ఎంత విసిగిపోవాలో అంతా విసిగిపోయి, ఎంత కుంగిపోవాలో అంతా కుంగిన్నీ పోతారు వారు. మాకు మేమయి చెప్పకోడం కాదు; గాని గడువు లోపున మేము వచ్చిన పని కాకపోతుందా, వ్రతమూ మిథ్య, మా అమ్మ మిథ్య, జగత్తే మిథ్య అన్నంత అసిధారావ్రతంగా నడుచుకుంటున్నాము మేము.

మహాప్రభూ! మనస్సు సరిచేసుకోండి. లోకవృత్తం పరిశీలించుకోండి. ప్రేమప్రవృత్తి గుర్తించుకోండి. ప్రాణికోటికి ప్రేమకంటే సుఖకరమైన దేమి వుంది మహాప్రభూ? ప్రాణికోటికి ప్రేమకంటే ఉత్తమ ప్రాప్యం యేమి వుంది మహాప్రభూ? ప్రాణికోటికి ప్రేమానుభూతి కంటే జీవితసాఫల్యం యేమి వుంది మహాప్రభూ? ఆ ప్రేమకు అడ్డేమిటి మహాప్రభూ?

ఆ ప్రేమకు విఘాతం కలిగించగలవా రెవరు మహాప్రభూ? ఆ ప్రేమను జయించగలవా రెవరు మహాప్రభూ? ఆ ప్రేమ అనుభవించని బతు కేమి బతుకు మహాప్రభూ? ఆ ప్రేమకు అగమ్యమైన మార్గం యేమి వున్నది మహాప్రభూ ?

సకలనీతివిశారదా! సుబుద్ధి అయ్యవారి తెలివి తక్కువ మంత్రాంగానికి ప్రతిగా మాఅమ్మ ఈయెత్తు వెయ్యవలసివచ్చింది. మహారాజులుంగారి దుస్సంకల్పం వికల్పం చేసెయ్యడానికే మాఅమ్మ యీనాటకం ఆడ వలసివచ్చింది.

మహారుద్రయ్యగారి కుట్రలు విచ్ఛిన్నం చేసి, అన్యోన్యానురాగంతో— ప్రేమోన్మాదంతో కుమిలి పోతున్న లేతహృదయాలను ఏకం చెయ్యడానికే నే నిన్ని తిప్పలు పడవలసివచ్చింది.

పురుషసింహా! బాలామనఃపాంచాలా! త్రికరణకూ తమ రూపమే భావించుకుంటూ, తమ పాదాలే ధ్యానించుకుంటూ, తమ పేరే స్మరించుకుంటూ, తమ హృదయమే ప్రాప్యంగా, తమ అనుగ్రహమే ఆశించు కుంటూ, మూడేళ్ల నాటి తమ చల్లని చూపే ధారకంగా, నిద్రాహారాలు పరిత్యజించి, పంచాగ్నిమధ్యంలో ఘోరతపస్సు చేస్తూ మాతల్లి — అదుగో తమ యెదుట—తమ పాదాల సన్నిధిని—(అర్ధోక్తి)

[గఫీ మని ముందుకి వచ్చి, చిత్రాంగి, సారంగధరుకి యెదట మోకరిల్లుతుంది. తటాలున యువతిలీకి వచ్చి, చిలక, తెలుపు చేరవేసేస్తుంది. సరిగా యీ సమయంలో కంగారుపడుతూ రుక్కు తొంగిచూస్తుంది. చకిత అయి "ఏమిటి సంగతి?" అన్నట్టు చేసన్న చేస్తూ చిలక రుక్కు దగ్గిరకి నడుస్తుంది.]

రుక్కు—(మెల్లిగా) మహారాజిప్పుడే వేట నుంచి దయచేశారు.

చిలక—(చకిత అయి) ఆఁ!......ఇక్కడికి రాలేదు కదా ?

రుక్కు—లేదు......వస్తే ?

చిలక—(ఆలోచించి గంభీరంగా)సరే.జక్కుల దీవి పరిచారిక లందరూ కత్తులు దూసి సిద్ధంగా వుండేది. సెలవు లేకుండా రాజా పైకి వచ్చాడా, ఎవళ్ల కందితే వాళ్లే కత్తె డ్లైతే నరికేసేది. భద్రం, వెళ్లు.

[ఇద్దరూ చెరోపక్కకీ నడతారు.]

## ఇర్వైనొకటో రంగం

రత్నాంగి నగరు.

నాలుగ్ఘళ్ల రాత్రి అయింది.

అప్పుడే భోజనం చేసివచ్చి, రత్నాంగి, దక్షిణపు వసారాలో పచారు చేస్తూ వుంటుంది.

కూడా తిరుగుతూ, గౌరి, వొకొక్కటే రత్నాంగికి తమలపాకుల చిలక లందిస్తూ వుంటుంది.

పంజరంలో వున్న చిలక "బాబయ్య, బాబయ్య" అని పలికి కళ్లు మూసుకుంటుంది.

***

రత్నాంగి— (పంజరంకేసి చూస్తూ గౌరితో) ఏమిటే అంటుందీ ?

గౌరి—మహారాజులుంగారు వేటనుంచి దయ చేశారుట అమ్మా!

రత్నాంగి—ఎంతసేపయిందిట ?

గౌరి–ఇప్పు డిప్పుడే నగరిలో ప్రవేశించారుట.

రత్నాంగి—నాలుగు దినాలకిందటే కాదూ వెంచేశారూ? ఇంత త్వరగా దయచేశా రేం చెప్మా?

గౌరి— జక్కులదీవి అమ్మగారి సెలవు— (అర్ధోక్తి)

రత్నాంగి—వేటకి వెంచెయ్యమని అంటావా, త్వరగా దయచెయ్యమని అంటావా ?

గౌరి—(చిరునవ్వు నవ్వి వూరుకుంటుంది.)

రత్నాంగి—ఏం, మాట్లాడవేం ?

గౌరి— తెలిసిం దమ్మా, ఒకదాని కొకటి చుక్కడురు.

రత్నాంగి—పోనీ, నట్టువరాళ్లలో కలిసిన కొత్తపిల్ల సంగతి యేమయినా తెలిసిందా?

గౌరి—తెలిసిం దమ్మా! ఆపిల్ల అన్నపూర్ణ దూరపుచుట్టంట. మొన్ననే పదహారేళ్లు నిండాయిట. రంభా, ఊర్వశీ ఆపాటి దనీ, వొక వెలుగు వెలుగు తుందనీ — (అర్ధోక్తి)

రత్నాంగి—ఏం వెలుగో? పసిపిల్ల పాపం. దాని నాట్యారంభానికి మహారణ్యంలోనా సుముహూర్తం?

గౌరి—(ఊరుకుంటుంది.)

రత్నాంగి—అంటే, వారు మహారణ్యాలకు వేంచేసినకారణం మెకాలను సంహరించడానిక్కాదన్న మాటా?

గౌరి—మహారణ్యాలలో వినోదాలూ, నగరంలో వేటా—(అర్ధోక్తి)

రత్నాంగి-అయితే, మెకాలెవరో నగరంలో?

గౌరి—జక్కులదీని అమ్మగారి కంటె మెకం యెవరమ్మా?

రత్నాంగి—నిజమే. (జాలిగా) ఎంత తెలివి-ఎంత చురుకు- ఎంత నమ్రత-ఎంత కలుపుగోలుతనం-ఎంత చక్కదనం- పాపం, ఆమె బతుకు అంతా రసాభాసం అయిపోయింది. ఆమె ఆత్మీయులు—(అర్ధోక్తి)

గౌరి—ఒక్క బిడ్డ, పాపం, వారికి. ఆమెని తలుచుకుని వా రెంతెంత అశలు పోయారో?

రత్నాంగి— అబ్బాయిని తలుచుకుని ఆమె మాత్రం ఆశలుపోలేదూ? అబ్బాయిమాత్రం ఆమెని తలుచుకుని లోపల్లోపల మురిసిపోలే దంటావా? కాని, ఆమెనీ అబ్బాయినీ కూడా మహారాజు వొక్క దెబ్బతో—(అర్ధోక్తి)

(ద్వారంలోనుంచి)

"సుబుద్ధి అయ్యవారు దయచేసి వేచి వున్నారమ్మా!"

రత్నాంగి — (ద్వారంకేసి చూస్తూ) ఏమిటే?

(ద్వారంలోనుంచి)

"సుబుద్ధి అయ్యవారు దయచేసి వేచి వున్నారమ్మా!"

రత్నాంగి— రమ్మను. (గౌరితో) తీసుకు రావే.

[గౌరి ద్వారందాకా వెళ్లి సుబుద్ధితో వస్తుంది.]

రత్నాంగి—ఏం బాబూ?

సుబుద్ధి—యువరాజులుంగారి కోసం వచ్చానమ్మా!

రత్నాంగి—నాయన తమకోసమే బయలు దేరాడు బాబూ!

సుబుద్ధి—కనపడలే దండీ అమ్మా!

రత్నాంగి — (గౌరి కేసి చూస్తుంది)

గౌరి — (సుబుద్ధితో) బుల్లి బాబయ్య — (అర్ధోక్తి)

రత్నాంగి — అవును, మరిసిగారి దర్శనానికి వెళ్లివుంటాడు.

సుబుద్ధి — నే నక్కణ్ణుంచే వస్తున్నా నండీ అమ్మా!

రత్నాంగి — మహారాజు విజయంచేశారుట. వారి దర్శనానికి వెళ్లా డేమో తెలకపోలే.

గౌరి — అలాగే అయివుంటుం దమ్మా!

సుబుద్ధి — కావచ్చు నమ్మా!

రత్నాంగి — త్వరగానే రావచ్చు. తమరు—(అర్ధోక్తి)

సుబుద్ధి — కింద వేచివుంటా నమ్మా!

రత్నాంగి — తమ భోజనం అయిందా?

సుబుద్ధి — ఇంకా కాలేదమ్మా! నే నిప్పుడు భట్టారకులవారి దగ్గిర్నుంచి వస్తున్నాను.

రత్నాంగి — (దీనంగా) ఎంత దుష్టరోగం అలుముకుందీ వారినీ? ఎదట నుంచుని మాట్లాడుతూ వుంటే మా బాబయ్యగారి యెదట వున్నట్టుండేది. బతికి బట్టకట్టి, మళ్లీ వా రిక్కడి కెప్పుడు దయ చేస్తారో, నే నెప్పుడు సేవించుకుంటానో?

సుబుద్ధి — ఇక లాభం లేదమ్మా!

రత్నాంగి — (చకిత అయి) అదేం బాబూ?

సుబుద్ధి — (మొగం వంచుకుని) ఈరాత్రి గడవదండీ అమ్మా!

రత్నాంగి — శివశివా! శివశివా!

సుబుద్ధి — యువరాజులుంగారి దర్శనంకోసం అటమటించిపోతున్నా రమ్మా వారు.

రత్నాంగి — అయ్యో, అయ్యో! ఎలాగ తండ్రీ? (గౌరితో) నా నాయనకి వారి చూపు లందవు కాబోలు నేం చేసునే?

గౌరి — (సుబుద్ధితో) ఈ సంగతి మహారాజులుంగారికి అందచేయించండి బాబయ్యా!

సుబుద్ధి — నేను కాదు, బాబయ్యగారు విన్నవించుకుంటారు, మహారాజులుంగారితోను.

రత్నాంగి — అలాగే చేయించండి బాబూ! ఈ లోపున వస్తే అబ్బాయిని వెంటనే పంపేస్తాను.

సుబుద్ధి — చిత్తం అమ్మా!

రత్నాంగి — సోమిదేవమ్మగారిని జాగ్రత్తగా కనిపెడుతూ వుండండేం నాయనా!

సుబుద్ధి — చిత్తం అమ్మా!

రత్నాంగి — (గౌరితో) చూడూ, నువ్వు ఎళ్లి ఆమెని కనిపెట్టుకుని వుండూ. "అమ్మాయిగా అమ్మాయిగా" రంటూ నన్ను నుచ్చికౌగిలించుకోకుండా వుండలే రామె. (కళ్లు తుడుచుకుంటూ) ఆమె పసుపు కుంకాలకే లోటు రావాలా?

సుబుద్ధి — సెలవు అమ్మగారూ!

రత్నాంగి — మంచిది బాబూ! (గౌరితో) నువ్వుకూడా పదవే.

## ఇరవైరెండో రంగం

చిత్రాంగి నగరు.

నాలుగ్గళ్ల రాత్రి అయింది.

సారంగధరుడి కోసం వచ్చి, సుబుద్ధి, రత్నాంగితో మాట్లాడుతూ వుండిన సమయం అది.

ఇక్కడ, హాల్లో, సారంగధరుడు ఒక ఆసనంమీద కూచునీ, చిత్రాంగి, అతని యెదట, తగినంత దూరాన, నుంచునీ వున్నారు.

చిలక చేరవేసిన తలుపు అలాగే వుంది.

***

సారంగధరుడు—(చిత్రాంగితో) అసాధారణ పరిస్థితుల్లోనే నిక్కడికి బయలుదేరాను. వచ్చినీ మళ్లీ అసాధారణపరిస్థితుల్లోనే పడిపోయాను.

చిత్రాంగి—(చూస్తూ వూరుకుంటుంది)

సారంగధరుడు—మెట్లమీద అడుగు పెట్టాను; కాని న స్నెవరో దిగలాగుతున్న ట్టయింది. చిలక చెప్పింది విన్నాను. సరి, అంతా పూర్వపక్షమే అయిపోయింది.

చిత్రాంగి—(మళ్లీ చూస్తూ వూరుకుంటుంది)

సారంగధరుడు — చివరికి నేను యథాస్థితికి వచ్చేశాను.

చిత్రాంగి—(గంభీరంగా చూస్తూ) అంటే?

సారంగధరుడు—(చకితుడై మొగం వంచుకుని, మళ్లీ అంతలో మొగం పైకెత్తుకుంటూ—అప్పటికీ జంకుతూనే) తమకూ—మా నాయనగారి కత్తికీ—వివాహమే జరిగింది.

చిత్రాంగి—(పులుకు పులుకున చూస్తూ తల పంకించి వూరుకుంటుంది).

సారంగధరుడు—సామ్రాజ్యానికి సామ్రాజ్యం అంతా — రాజమహేంద్రపురానికి రాజమహేంద్రపురం అంతా—అంతఃపురానికిన్నీ అంతఃపురం అంతా కూడా — తమర్ని—మా నాయనగారి రెండో భార్యగా నుత్తించేసివుంది.

చిత్రాంగి—(తల పంకించి, నిరసనగా చిరునవ్వు నవ్వి) తమ రది నమ్మరా?

సారంగధరుడు — (చెదురుతూ) చిత్తం — నమ్మను.

చిత్రాంగి—అయితే, వివాహం అన్నారే, దాని క్కారణం?

సారంగధరుడు—(మొగం పక్కకి తిప్పుకుని) నాయనగారి కోరికా—సంకల్పమూ—దృఢదీక్షా—తీవ్రప్రయత్నమూ—చివరికి కార్యసిద్ధిన్నీ.

చిత్రాంగి—వాటికి కారణం ?

సారంగధరుడు—(మొగం వంచుకుని) తరవాత మనవి చేసుకుంటాను.

చిత్రాంగి—(చూసి చూసి) పోనీ, పాపికొండల్లో - మనం కలుసుకున్నప్పుడు - తమ మనస్సు- (అర్ధోక్తి)

సారంగధరుడు—(మొగం వంచుకునే వుండి) చలించింది. హృదయమున్నూ తమయెడల అనురక్తమయిపోయింది.

చిత్రాంగి—తరవాత - మరే సుందరిమీదనయినా—(అర్ధోక్తి)

సారంగధరుడు—(మొగం వంచుకునే వుండి) నామనస్సు లగ్నం కాలేదు.

చిత్రాంగి—చిత్రపటాలు కోరినప్పుడు—(అర్ధోక్తి)

సారంగధరుడు—(మొగం వంచుకునే వుండి) నా చూపు తమమీదే వుంది.

చిత్రాంగి—అంటే, యీ మూడేళ్లలోనూ—(అర్ధోక్తి)

సారంగధరుడు—(మొగం వంచుకునే వుండి) తమ రూపపటం నాహృదయఫలకంమీద వొకనాటికంటే వొకనాడు స్థిరపడిపోయింది.

చిత్రాంగి-(నిలదీసినట్టు) దానిమీద తామేమి చేశారూ ?

సారంగధరుడు—(ఒక్కమాటు చిత్రాంగికేసి చూసి మళ్లీ మొగం వంచుకుంటాడు)

చిత్రాంగి—(చూసిచూసి) అయితే - యింతకీ- తమ యెడల నాహృదయం - (అర్ధోక్తి)

సారంగధరుడు—(పక్కకి చూస్తూ) గాఢంగా అనురక్తం అయిందని నాడే తెలుసుకున్నాను.

చిత్రాంగి—తరవాత- నామనస్సు-మారినట్టు- (అర్ధోక్తి)

సారంగధరుడు—(పక్కకే చూస్తూ) లేదు లేదు. పైగా, తమ చిత్రపటమే మొదట వచ్చిందన్న వార్త విని — మా రాయబారుల పరిముఖంగా కాక, తమ తండ్రిగారు, స్వయంగానే అంచెగుర్రాలమీద పంపారన్న సంగతి విని తమ మనస్సున్నూ మారలేదని నిశ్చయించుకుని పొంగిపోయాను.

చిత్రాంగి—(కరుగ్గా) పొంగిపోయి?

సారంగధరుడు—(మొగం వంచుకుని వూరుకుంటాడు)

చిత్రాంగి—(చీ కసగా) సుబుద్ధి అయ్యవారి సెలవు కాలేదా?

సారంగధరుడు-(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—(నిరసనగా) సిగ్గు ముంచుకు వచ్చిందా?

సారంగధరుడు—(మాట్లాడ లేదు)

చిత్రాంగి—నామనస్సు మారలేదని తెలిసినప్పుడు పొంగిపోయినట్టే, తమ భార్యని తమ తండ్రిగారు ఆక్రమించుకోడానికి ప్రయత్నించడం తెలిసినప్పుడున్నూ (పళ్లు కొరుకుతూ) పొంగిపోయారు, కదూ?

సారంగధరుడు—(మొగంవంచుకునే వుంటాడు)

చిత్రాంగి—(నిక్కచ్చిగా) మరి, తమ రిప్పు డెందుకు దయచేసినట్టూ?

సారంగధరుడు—(ఒక్కమాటు చిత్రాంగికేసి చూసి, మళ్లీ మొగం వంచుకుంటాడు.)

చిత్రాంగి—(తల పంకిస్తూ కోపంగా) జక్కుల దీవి రాజవంశం అంటే—(అర్ధోక్తి)

సారంగధరుడు—(దోసిలి వొగ్గి)వద్దు వద్దు. నా కలాంటి భావం యెంతమాత్రమూ లేదు. నేనంత క్షుద్ర హృదయుణ్ణని తమరు భావించవద్దు. నేను తమ కుమారుణ్ణి.

చిత్రాంగి—(చెయ్యి జాడిస్తూ రోషంగా) కావు, ఎంతమాత్రమూ కావు.

సారంగధరుడు—(మొగం వంచుకుని వుంటాడు)

చిత్రాంగి—భార్య అంటే యేమిటో, తల్లి అంటే యేమిటో నువ్వెరగవు. నీకు హృదయమే లేదు.

సారంగధరుడు—(మొలకట్టున వున్న కటారి ఒరతో కూడా తీసి, చిత్రాంగి పాదాల దగ్గిర వుంచి, నుంచుని, తర్జనితో కటారి చూపిస్తూ) దాంతో—(తన గుండెలు చూపిస్తూ) ఇక్కడ చీల్చి చిత్తగిస్తే—(అర్ధోక్తి)

చిత్రాంగి—పనిలేదు. (కటారి అందుకుని) నీకు హృదయమే వుంటే అది యిదివరకే బద్ద లయిపోయి వుండేది.

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—నాయెడల మాతృభావం చూపించడాని కయినా నీకు సత్తా చాలదు.

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—నన్ను తల్లిగానే భావించివుంటే యిన్నాళ్లకా, నీతండ్రి వూళ్లో లేనప్పుడా, దొంగపోటుగానా రావడం?

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—కుమారు డనుకోడాని కయినా యోగ్యత లేని మనిషిని పతిగా వరించి, అక్కణ్ణుంచి యిక్కడికి రావడం నాదే తెలివితక్కువ.

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—నీపక్షంగా చూస్తే నీతండ్రి చేసిం దేమీ తప్పు కాదు; కాని నేనే మోసపోయాను.

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—తన కోడలే తనకి భార్య—తన భార్యే తనకి తల్లి. ఆహా! ఏమి తండ్రీ కొడుకులు!

సారంగధరుడు—(మొగం వంచుకునే వుంటాడు)

చిత్రాంగి—మహా సాహసం వున్నవాడిలాగ (చూపిస్తూ) కటారి చర్రున లాగి నాపాదాలదగ్గిర వుంచావే, తల తిరిగిపోయే దారుణాలు జరుగుతూ వుండగా, యెలాగ మూసిపెట్టుకుని వుండగలిగావు?

సారంగధరుడు—(ఏదో చెప్పబోయి తటాలున మొగం పైకెత్తి మళ్లీ వంచుకుంటాడు)

చిత్రాంగి—నీతో మాట్లాడ్డమే కాదు, నీఎదట నుంచోడం కూడా ఆడదానికి మర్యాద కాదు. పూర్వజన్మలో ఎంతో పాపం చేసుకుంటే కాని ఆడది నీవంటివాణ్ణి కనలేదు. (గుమ్మంకేసి చూస్తూ) చిలకా!

[తెరలో]

"తల్లీ!"

చిత్రాంగి—తలుపు తియ్యి.

[చిలక, తలుపు తీసి ఒక పక్కగా నుంచుని వుంటుంది. సారంగధరుడు లేచి నుంచుంటాడు.[

చిత్రాంగి—(గుమ్మం చూపిస్తూ సారంగధరుడితో) వెళ్లు, వెళ్లిపో.

[మొగం వంచుకొని కాళ్లీడ్చుకుంటూ సారంగధరుడు బయలుదేరతాడు. కూడా వచ్చి, చిలక దగ్గిర నుంచుని, చిత్రాంగి, సారంగధరుడి కేసి తీవ్రంగా చూస్తూ వుంటుంది.]

చిలక—(సారంగధరుడి కేసి హేళనగా చూస్తూ) ఏమిటిట?

చిత్రాంగి—(సారంగధరుడి కేసి రూక్షంగా చూస్తూ) నే నమ్మనిట.

చిలక—(సారంగధరుడి కేసి కళ్లూ మూతీ తిప్పుకుంటూ చూస్తూ)అయితే, వుగ్గూ పాలూ పుచ్చుకోడానికి వచ్చారటనా?

[మెరుపు కొట్టినట్టయి, వేలుకొరుక్కుని, సారంగధరుడు గబగబా వెళ్లిపోతాడు. కనపడ్డంత సేపూ చిలకా చిత్రాంగీ కోపంగా అతని కేసే చూస్తారు.]

చిత్రాంగి—(చిలకతో) తేలిపోయింది.

చిలక—రాజా వచ్చాడు.

చిత్రాంగి—(చకిత అయి)ఎప్పుడు?

చిలక—ఇప్పుడిప్పుడే. మిమ్మల్ని విడిచి నే నివతలికి వచ్చాను, రుక్కు వార్త అందించిండి.

చిత్రాంగి—(పాలోచనగా పక్కకి చూస్తూ) సమయానికే వచ్చాడు. (చిలకతో) కాని ఆ రావడం రావడం యిక్కడికే వస్తే యెంత బాగుండునూ!

చిలక—ఇది తెలవదా, యిక రాదా?

చిత్రాంగి—(మళ్లీ పాలోచనగా పక్కకి చూస్తూ) కాదు. మంచి సమయం దాటిపోయింది. (చేత నున్న కటారి చూసుకుంటూ) దీనికి వినియోగం లేక పోయింది.

చిలక—(కటారి పుచ్చుకుని చూస్తూ) ఇదెక్కడిది తల్లీ?

చిత్రాంగి—(పక్కకి చూస్తూ) నేను తన తల్లి నని రాసి వుందిట తన హృదయంమీద. చీల్చి చూసుకోమని—(అర్ధోక్తి)

చిలక—వోస్! కనక కనక యిలాంటి కొడుకునే కనాలి.

చిత్రాంగి—(పక్కకి చూస్తూ వుంటుంది)

చిలక—అమ్మా!

చిత్రాంగి—ఆ! (చిలకకేసి చూస్తుంది)

చిలక—ముందు చెయ్యవలసింది?

చిత్రాంగి—(చూసిచూసి) నేను చెయ్యవలసింది నాకూ తెలుసు, నీకూ తెలుసు. మరి నీమాట?

చిలక—మీదారి వేరూ నాదారి వేరూనా తల్లీ? ఎంతమాటా? మీకు సుఖమూ లేక, మీరూ లేక, నే వుండి రేమి చెయ్యనూ?

[తెరలో]

"చిలకా!"

చిలక—(చిత్రాంగి కేసి చూస్తూ) ఆ!

చిత్రాంగి—రమ్మను.

చిలక—(గుమ్మం కేసి చూస్తూ) రావచ్చు.

[రుక్కు ఖడ్గపాణి అయి వస్తుంది.]

రుక్కు—మహారాజా, మహారుద్రయ్యగారూ—(వసుకుతుంది)

చిలక—వచ్చారా?

చిత్రాంగి—ఎక్కడున్నారూ?

రుక్కు—కిందే వున్నా రమ్మా!

చిత్రాంగి—(రుక్కు చేతిలో వున్న ఖడ్గం అప్పుడు స్మరించి, చకిత అయి, చిలకతో) అదేమిటే?

చిలక—మీ వృద్ధియులకీ అనుకూల్యం కలుగుతుం దనీ, రాజు ఆసమయంలో వస్తా డేమో అనీ, సెలవు లేకుండా వస్తే నరికెయ్య మనీ—(అర్ధోక్తి)

చిత్రాంగి—అదే లేకపోయింది; కాని మంచి యేర్పాటే చేశావు.

చిలక—మరి యిప్పుడు రాజు మాట?

చిత్రాంగి—(ఆలోచించి రుక్కుతో) పిలుస్తాను, అవతల వుండు.

రుక్కు—మంచి దమ్మా! (వెళ్లిపోతుంది)

చిత్రాంగి—(ఆలోచిస్తూ) వచ్చి రావడంతోటే రాజుని పాడిచెయ్యడం, లేకపోతే — తికమకలుగా సమాధానాలు చెప్పి, మనస్సు పాడుచేసి, తమ్ముళ్లంగా కల్లోలాలు పెంచడం—వీలు తప్పివచ్చి నప్పుడు మనమున్నా—(చిలక కేసి చూస్తుంది)

చిలక—అదే బాగుంది. అలా చేస్తే తండ్రి కొడుకునో, కొడుకు తండ్రినో కడతేర్చుకుంటారు. ఈచిచ్చు బులబులాగ్గా పోనివ్వకూడదు.

చిత్రాంగి—ముసిలాడు ఇప్పుడు అసందర్భంగా మాట్లాడితే?

చిలక—పాడిచేసి, పాడిచేసుకుందాం.

చిత్రాంగి—(ఆలోచించి) కల్లోలాలు పెరిగేటట్టే చూడు. రప్పించు.

చిలక—(గుమ్మం కేసి చూస్తూ) రుక్కూ!

[రుక్కు వస్తుంది]

చిలక—ముందు కత్తులు దింపెయ్యండి. తరవాత తీసుకురా.

రుక్కు—మంచిది. (బయలుదేరుతుంది)

చిత్రాంగి—(రుక్కుతో) చూడూ! ఇక వంగి వంగి దండా లక్కర్లేదు. ఎక్కడివా ళ్లక్కడ తప్పుకోవచ్చు.

రుక్కు—(తెల్లపోయి చిలక కేసి చూస్తుంది.)

చిలక—తెలవలేదూ?

రుక్కు—(చూసిచూసి) సరే.

చిలక—వెళ్లు.

[రుక్కు వెళ్లిపోతుంది.]

చిలక—(చిత్రాంగిని పాదివి పట్టుకొని)తలుపు చాటుకి పదండి తల్లీ!

చిత్రాంగి—(అడుగు వేస్తూ) ముసలాడి కింకా మర్యాదా చెయ్యా లంటావా?

చిలక—ముసలాడి కాదు, మనకే తల్లీ!

చిత్రాంగి—సరే.

[చిత్రాంగి తలుపుచాటునా, చిలక సమ్మంలోనా నుంచుంటారు. ఇంతలో రాజూ, మహారుద్రయ్యా దర్జాగా వస్తారు. చిలక, చూసి, మొగం వంచుకుని వూరుకుంటుంది. చిత్రాంగి, చెవులోర చేసుకుంటుంది. ప్రత్యుత్థానాదికం లేకపోయినందుకు రాజూ, మహారుద్రయ్యా అసంతృప్తులై మొగమొగాలు చూసుకుంటారు]

రాజరాజు—(చూసిచూసి, చిలకతో) పూజ అప్పుడే అయిపోయిందా, లేక, యివాళ—

[ప్రశ్నార్థకంగా చూస్తూ, రాజు, ఇంతమాత్రమే అడిగి వూరుకుంటాడు. చిలక, నిర్లక్ష్యంగానూ, నిదానంగానూ చూస్తూ వూరుకుంటుంది. దాని మీద రాజూ, మహారుద్రయ్యా వొకమాటు చురుగ్గా చూసుకుంటారు.]

రాజరాజు—ఇంకా ప్రారంభం కాలేదా?

చిలక—లేదు.

రాజరాజు—కారణం?

చిలక—ఉంది.

రాజరాజు—ఏమిటే?

చిలక—ఏమయినా కావచ్చు.

రాజరాజు—మేము, విన తలుచుకున్నాము.

చిలక—(ఒకమాటు చిత్రాంగి కేసి చూసి రాజుతో) మేము, చెప్పతలుచుకో లేదు.

[రాజు మహారుద్రయ్య కేసి చూస్తాడు. మహారుద్రయ్య ఏదో గొణుగుతాడు.]

రాజరాజు—ఇక్కడికి, సారంగధరుడు వచ్చాడుట?

చిలక—(చిత్రాంగి కేసి చూసి) అవును.

రాజరాజు—ఏడీ?

చిలక—లేరు.

రాజరాజు—వచ్చి యెంతసే పయిందీ?

చిలక—మూడు గడియలు కావచ్చు.

రాజరాజు—వెళ్లి?

చిలక—(ఆలోచన నటిస్తూ) అరగడియ కాబోతోంది.

రాజరాజు—వచ్చి యేం చేశాడూ?

చిలక—(చిత్రాంగి కేసి చూసి) ఉన్నారు.

రాజరాజు—(కళవళపడి, ఒక్కమాటు మహారుద్రయ్య కేసన్నీ చూసి) ఉండి యేం చేశాడూ?

చిలక—(చిత్రాంగి కేసి చూసి రాజుతో కొంచెం వెటకారంగా) వెళ్లిపోయారు.

రాజరాజు—(కొంచెం కరుగ్గా) ఎందుకు వచ్చాడూ?

చిలక—(చిత్రాంగి కేసి చూసి, రాజుతో నిర్లక్ష్యంగా) చెప్పలేదు.

[మండిపడుతూ రాజు మహారుద్రయ్య కేసి చూస్తాడు. వెంటనే "తమ రుండండి మహాప్రభూ" అంటూ మహారుద్రయ్య ముందుకు వస్తాడు.]

మహారుద్రయ్య—(చిత్రాంగిని ఉద్దేశించి గది కేసి చూస్తూ) అమ్మా, తమరు—చిన్నవారు—(అర్థోక్తి)

చిత్రాంగి—(తోక తొక్కిన ఆడతాచులాగ యివతలికి వచ్చి, మహారుద్రయ్యతో) నీ పెద్దతనం మాత్రం యేమి మండిపోయిందీ? నా అంతఃపురంలో నీ కేమిపనీ?

[రాజు చకితు డవుతాడు. బ్రరవంచుకుని మహారుద్రయ్య వెనక్కి తప్పుకుంటాడు. చిత్రాంగి

రాజుమీద కోరచూపులు పరుపుతూ నుంచుంటుంది.]

రాజరాజు—(తీవ్రంగా చూస్తూ చిత్రాంగితో కఠినంగా) నీ అంతఃపురంలో సారంగధరుడికి మాత్రం యేమి పని?

[చిత్రాంగి కోరచూపులే చూస్తూ తలుపు చాటుకి వెళ్లిపోతుంది.]

చిలక—(రాజుతో) ఒకరి వూహలూ, వొకరి వుద్దేశాలూ, వొకరి సంకల్పాలూ, వొకరి ప్రయత్నాలూ, వొకరి పనులూ మరొకరినా అడగడం?

[రాజు చిలక కేసి తీక్షణంగా చూస్తాడు. చిలక, రాజు కేసి అలవోకగా చూస్తుంది. మహారుద్రయ్య వెనకపాటున రాజు చెవిదగ్గిరగా నోరు పెట్టి "యిప్పుడు కాదు, దయ చెయ్యండి మహాప్రభూ" అంటాడు. రాజు, చూసిచూసి, చిలక మీద తల పంకించి మహారుద్రయ్యతో వెళ్లిపోతాడు.]

చిత్రాంగి—(ఇవతలికి వస్తూ) అంటుకున్నట్టేనా?

చిలక—ఇక భస్మ మనడమే తరవాయి.

చిత్రాంగి—అనకక్షిమూల నున్నవాళ్లని ముందుకీడిస్తే వూరికే పోతుందా? (పక్కకి చూస్తూ ఆలోచించి) చిలకా!

చిలక—తల్లీ!

చిత్రాంగి—(గంభీరంగా) నేనూ కొండంత ఆశ పెట్టుకున్నాను, నువ్వూ కొండంత ఆశ పెట్టుకున్నావు.

చిలక—సెల వివ్వం డమ్మా!

చిత్రాంగి—కాని యిద్దరమూ వొక్క నోమే నోచుకున్నాము.

చిలక—సెల వివ్వం డమ్మా!

చిత్రాంగి—వస్తా నుండు. (లోపలికి వెళ్లి తన కటారి తీసుకు వచ్చి) నీకు నేను చెల్లించగల పాదపూజ యిదీ. (ఇస్తుంది)

చిలక—(నమ్రురాలై దోసిలి వొగ్గి అందుకుని కళ్ల కద్దుకుంటూ) మహాప్రసాదం. అమ్మా! నన్ను ఆత్మవతుగా భావించారు మీరు. ఇంతకంటే నాకు గొప్ప సత్కారం మరేమిటి?

చిత్రాంగి—వెర్రితల్లివి నువ్వు. ఎప్పటి కప్పుడే, ఎక్కడి కక్కడికే సంతోషించావు. మరి ఆ కటారి యిలా తే.

చిలక—(సారంగధరుడి కటారి యిస్తుంది)

చిత్రాంగి—(అందుకుని) నేను చతుర్యయువ రాజుని వరించాను. నాహృదయంలో మరొకడికి చోటు లేదు.

చిలక—(చూస్తూ వూరుకుంటుంది)

చిత్రాంగి—ఆమనిషి దగ్గిర నే ననుకున్న యోగ్యత లేకపోయింది. (వొరలోనుంచి కటారి తీసి చూసి) దీని కుండవలసిన యోగ్యతమాత్రం—(అర్థోక్తి)

చిలక—(గభీ మని చిత్రాంగి చెయ్యి పట్టుకుని కంగారుగా చూస్తుంది)

చిత్రాంగి—చెయ్యి వదులు. ముసిలాడు మళ్లీ రాకుండా తొందరపడతా ననుకున్నావా? అప్పుడైనా నువ్వు నేనూ వొక్కమాటే—(అర్థోక్తి)

చిలక—ముందు వొరలో పెట్టెయ్యండి మరి.

[చిత్రాంగి, కటారి వొరలో పెట్టేస్తుంది.]

చిలక—(చిత్రాంగి చెయ్యి విడిచి పెట్టి) మన మింకా కొన్ని సంగతులు పరిష్కరించుకోవలసివుంది. మీరు కడసారం సావిత్రి అమ్మవారిని కొలుచుకోవలసివుంది. ఇక్కడ కాదు రండి.

[ముందు చిలకా, తరవాత చిత్రాంగీ వెళ్లిపోతారు.]

# ప్రణయభిక్ష

[రాధ కృష్ణునుద్దేశించి]

శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

పరకీయ నయ్యు నే
భావమున నీమూర్తి
అవలోకనము చేతురా!
శ్రీకృష్ణ!
అవశతను చరియింతురా!

సకియతో నేవేళ
సరససల్లాపముల
నీ చరితలే తలతురా!
శ్రీకృష్ణ!
నిన్నె మనసున కొలుతురా!

భవదనుధ్యానమున
పారవశ్యము నొంది
ఉన్మత్త నైపోదురా!
శ్రీకృష్ణ!
ఊరకే నవ్వుదునురా!

మురళి కరమున బూని
ముద్దు కెమ్మోవిపై
మధురముగ నూదినటులే
శ్రీకృష్ణ!
మది తలంచుచు నుందురా!

ఆభావమే నన్ను
అలమికొనినంత నే
ప్రణయసౌరభ మెగసెరా!
శ్రీకృష్ణ!
భ్రమను నన్నిటు చేసెరా!

నీ మనోహరమూర్తి
నిరతమును కనుపింప
నిదుర యన్నది యెరుగరా!
శ్రీకృష్ణ!
నీకొరకె వట నిలుతురా!

ఆలింగనము వలదు,
అధరామృతము వలదు,
మనసు లీన మొనర్పగా
శ్రీకృష్ణ!
మధురగానమె చాలురా!

ప్రేమించితిని గాని
కామించగా లేదు;
ప్రణయభిక్షను పెట్టుమా
శ్రీకృష్ణ!
ప్రమదమున గైకొందురా!

# అతిశయోక్తి

## = అభ్యుదయక్రమము =



అతిశయోక్తులు ప్రాచ్యులయం దధికమని యప్రాచ్యులధిక్షేపించుచుందురు. ఇది యుక్తియుక్తముగనే యున్నదిగాని పాశ్చాత్యుల సారస్వతమునందుగూడ ప్రాచీనయుగములందు క్వాచిత్కముగ దోచిన యతిశయోక్తి అర్వాచీనయుగములందు విస్తరమగుచు వచ్చినది. ఆంధ్రవాఙ్మయమునగూడ సనాతనయుగమందిది యభివృద్ధి నందకపోయినది నాటివారికి అతిశయోక్తి జాడకుపోనక్కర లేకపోయినది.

= శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ =

అతిశయోక్తియే సర్వాలంకారబీజభూత మని భామహుడును, దండ్యాచార్యులును ప్రశంసించిరి. ఇంతకు పూర్వమునం దాలంకారికరచనము, లేక కృతకశైలి యెట్లభివృద్ధి యగుచున్నదియు నాలోచించితిమి. అతిశయోక్తుల నతిలత్వముతో నుపయోగించిన కవిత కాల్పనికరచన సహోదరము. ఇది భావానుగుణమైన భాష యగునా, కాదా యను వివేచన లేక పాఠకులు శైలియందు దృఢత కలదా యని పరిశీలించుట సర్వత్ర విదితము. యౌవన ముద్రేకావేశసమాశ్రిత మగుటచే ప్రశాంతిమధురము, సాధుతామసృణము నగు శైలి యువకుల నాకర్షించి రసభావప్రేరితుల జేయలేదు. అందుచే సారస్వతమున నొకప్పుడు కఠినాతికఠినమైన శైలియు నావశ్యకముగ గల్గుచున్నది. రచనాపద్ధతియందు, వాక్యోచ్చారణయందు నతిశయోక్తులతో, సూక్ష్మాంశ విస్తరణలతో నెగడు రచయితే విద్యాగంధ మంతగ లేని పాఠకసామాజికులపై నతివిస్తారముగ తన ప్రభావమును జూపగలడు. భావకును, భావమునకును గల యన్యోన్యానుకూల్యము నెఱిగి ప్రయోగమునందు జాగ్రతిపరుడై రచించిన కవిని ప్రజ కన్నెత్తియేని చూడకపోవుట సంభవించుచున్నది.

ఉపన్యాసకు లతిశయోక్తులం దిష్టము గలిగియుందురు. శ్రోతలపై నిది రామబాణమువలె పని చేయు నని వా రెరుగుదురు. ఇట్లే యుపన్యాసకథోరణిని రచించు కవులును వీని నధికముగ ప్రయోగింతురు. ఏదోయొక యుగమునందు విశ్వసాహిత్యమందలి భాషలన్నియు నిట్టి రచనావిశేషమునకు పాల్పడుచున్నవని యంగీకరించుట సత్యసన్నిహితము. ముఖ్యముగ నిట్టి యతిశయోక్తిరచనయే కవులకును, శాస్త్రజ్ఞులకును విభేద మాపాదించుచున్న దనిన సాహసోక్తి కాదు. తమ యభిప్రాయమున కనుగుణముగ శాస్త్రజ్ఞులవలె కవులు పదములను తూచికొని కొలతవేసిన ట్లుపయోగింపరు. బైరను కవి ! "స్త్రీ ప్రణయమాత్రజీవిని"[1] అని నిర్ణీతార్థకమైన యొక యతిశయోక్తిని ప్రపంచముపై విసరివైచె ననియు, కవు లిట్టి సిద్ధాంతములు చేయునపు డంచెనవేసికొని యాలోచించి పలుకరనియు నొక మిత్రుడు తన్నాక్షేపించినట్లు కల్లెట్ పండితుడు చెప్పినాడు.

ఇందు కొంత యాథార్థ్యము లేకపోలేదు. కవితను విరచించు ప్రతిమానవుడును సాధారణముగ కవులసంభావ్యముల, నసంబద్ధముల ప్రలాపింతు రని నిందించుట మన కెల్లరకును విదితము. అతిశయోక్త్యలంకారమే కొంతవఱకు దీనికి గల కారణము. కాలము పోనపోను, ఆవృత్తిక్రమము ననుసరించి, సరళమై భావానుగుణమైన భాషావిధాన మతిశయోక్తిస్థానము నాక్రమింపకపోదు. కాని పునరావృత్తియు కలుగుచుం

1. "*Love is woman's whole existence.*"

డును. ఇది సర్వ వాఙ్మయములకు నిసర్గము. సరళమై భావానుగుణమైన శైలి యొక్క యుగమున సర్వజనాదర పాత్రము కాకపోయినను దీర్ఘకాలము మనుచుండుట సత్యము. ఫలభరితమైన వృక్షము సర్వధా వినమ్రము, మహత్త్వ మనునది యెప్పుడును నమ్రత గల్గియుండును. అందుచే దాని ఘనత కెట్టి కొరతయు రాదు సరిగదా అతిశయోక్తి వెగటించుకొనినంత త్వరలో సరళశైలి వెగటించుకొనను. ఇది సరళతకు, నతిశయోక్తికి గల తారతమ్యము. ప్రకృతాంశమైన యిట్టి యతిశయోక్తి యొక్క యభ్యుదయక్రమ మరయుదము.

"స్వజనీపాలభరంబునం జెదరగా" ( భార. ఆది. ౫-౩౬.) అని నన్నయభట్టారకుడు దీని నల్పముగ నారంభించెను.

"కలఁగెం దోయధిసప్తకంబు..." ( నిర్వ. ౫-౫౬.)

"అవనీచక్రము సంచలింపగ..." (విరాట. ౨-౨౯౪.)

" కరుల సేనాంసులు సురిగిన దానధా
రావలి దను కలయంపి గాగ "
(విరాట. ౩-౭౫.)

ఇత్యాదులం దిక్కనార్యునందు నల్పముగ గోచరించును.

"కులశైలంబులు దిర్దిరం దిరిగె దిక్కుంభీంద్ర వర్గంబు సంచలతం జెందె" (దశకుమా. ౨-౫.) అని కేతనార్యుడును, "ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె" (మార్క. ౬-౭౪.) అని యద్భుత రసపోషణమందు మారనయు నల్పముగ నతిశయోక్తుల నేకరించిరి. కాని యివి వారివారి గ్రంథ విస్తృతిని బట్టి లెక్కింపదగినవే కావు.

"సకలావయవంబులం బరిపూర్ణంబైన" నన్నెచోడుని దివ్యకావ్యాంగనయందు గూడ —

"శశిరభూమి నరోద్దామ శిఖరమణులఁ గరపి తారాగణంబులు", "తన తేజం బహిమాంశులై...." (కుమార సం. ౨౫౧, ౩౬౮)

ఇత్యాది పద్యములం దొండు రెండు తావులదప్ప నత్యతిశయోక్తి పొడగట్టదు. తిక్కనకు మునుమరాలి మనుమ డైనందున కాబోలు, నించుక నతనిని దలపింప జేయు బుద్ధితో తన రామాయణమందు మడికి సింగనార్యుడు

"ఆరాజన్య లుదగ్ర లుగ్రగతిన
న్యోన్య ప్రహారార్థులై
... ... ... ది
క్కుల్ గ్రయ్య నెల్లార్చుచున్
పోరాడంగ..."

అని భయానకాదుల వర్ణించు తావులం దతిశయోక్తి నత్యల్పముగ సంగ్రహించెను. ఎఱ్ఱనార్యుని నృసింహపురాణమునందు సముద్రమథనమునాటి నురుగింకను వెల్లనలై సముద్రతీరమునందలి వనముల ధావళ్యమునకు హేతు వగుచున్న దని వర్ణించు సందర్భమునను (౧-౩౫), నదీతరంగము లాకాశమును చుంబించుచున్నవని (౧-౩౬) వర్ణించు పట్టునను, ఇట్లే మరికొన్ని తావులం దల్పముగను అతిశయోక్తి సాహాయ్యపడుచున్నను భారతావతరణ మాదిగ పురాణకాలమునాటి వస్తుకవితనంతను! సగటున పరిశీలించినచో ప్రాచీనకవులం దతిశయోక్తి బహ్వల్పముగ గనపట్టును. మనకు తెలిసినంతలో నాంగ్లభాషనే పరిశీలించిన నాటకవులందు నిట్టి యతిశయోక్తి యంతగ స్ఫురింపబోదు.

ఇట్లు సనాతనయుగమం దిది యభివృద్ధినొందక పోవుటకు విస్పష్టముగ కారణముల వివరింపనేల. అయ్యది యాకస్మికసంఘటన మనుటకంటె నరసి చూచినచో నొక విషయము స్ఫురించును. ఆనాటి కథావస్తువే మహాసత్త్వ సమన్వితము. అగుటచే నా కవు లతిశయోక్తి జాడకు పోనక్కఱలేకపోయినది.

ఏనను యథార్థ మూహింప చాళుక్య చోళ యుగములందే మన వాఙ్మయమందలి సర్వవిధములైన కవితాలంకారములకును బీజము లేర్పడినట్లుమాత్రము తోచును. సత్య సంకల్పు డగు రాజరాజనద్వృత్తము పండి, సకల శబ్దశాసనుడు, నుభయభాషా కావ్యరచనాశోభితుడు నగు నన్నయార్యుని వాక్సిద్ధియు,

వజ్రగర్జనతుల్య మగు శబ్దగాంభీర్యమును, వేదవాణి గల మితహిత సత్య వాగ్వైఖరియు, ప్రసన్నకథా కలితార్థ యుక్తియు, నక్షరరమ్యతయు, వర్ణనాసౌందర్యమును, సంభాషణాచమత్కృతియు, మన స్తత్త్వ నిరూపణ మును, స్త్రీపాత్రరచనావైశిష్ట్యమును, ఆవేశనిగ్రహ మును, హాస్యోత్కృష్టతయు గల్గి, నిసర్గ కాంత ప్రవృత్తితో ప్రప్రథమమున నాంధ్రభారతామ్నాయ రచనా బంధురు డయ్యెను. ఇది శుభారంభముగ విషయ బాహుళ్యముతో, కూలంకష ప్రజ్ఞతో, తెలుగు నుడి సొంపుతో, స్వభావోక్తిమధురిమతో, ప్రపంచానుభూతితో, ధారామహిమాతిశయముతో, ప్రసాద ప్రాగల్భ్యముతో తిక్కనార్యుడు విజయ సేనమందును, కీచకవధయందును భవిష్యచ్ఛృంగారరచనలకు ముఖ్యముగ హేతుభూతు డయ్యెను. ఈతనియందలి సందర్భోచిత గాంభీర్య మంతగ నలవడకపోయినను సాహితీఘను డగు నాచనసోమనాథు డీతనినే మార్గదర్శకునిగ గ్రహించి శబ్దాలంకారపదప్రయోగములను, తీరుతీయము గల తెనుగుపదజాలమును, శ్లేషానుప్రాణిత మగు ప్రౌఢశయ్యను ప్రత్యేకించి పొందుపరచుచు నాటివారికి కథావస్త్వైక్య స్వారస్యములందు వ్యగ్రమైన కవితాశక్తిని వర్ణనాధిక్యమువైపు మరలించి పండితాగ్రేసరుడై ప్రకృతిని ప్రతిబింబించు భావములతో వసంతవిలాసోత్తర హరివంశకృతులం దొక విలక్షణతో నెలయించెను. ఇట్లు కథాకలితార్థయుక్తి గల మితభాషణచే నన్నపార్యుడును, ప్రతిభా వ్యుత్పత్తులపైన సమగౌరవము గల్గి రసాభ్యుచిత బంధముచే తిక్కయజ్వయు, వర్ణనా వైశద్య వైలక్షణ్యములచే నాచనసోమనాథకవినాథుడును తమతమ యుగములం దతిశయోక్తి కంతగ పాల్పడక కృతకృత్యు లైరన వచ్చును.

కాని నృసింహపురాణకర్త యగు నెఱ్ఱాప్రెగ్గడయు, 'గాండీవారావఝుంపాఘటితే' మని దేవదత్తమును పూరించిన నాచనసోమనయు నాదిగాగ ప్రబంధయుగ మారంభ మైనది. పిల్లలమఱ్ఱికవి కాలమువఱకు నిది పైకి నుబుకలేదు. ఈ ప్రబంధాతిశయోక్తిపంకమున బడక శ్రీనాథకవిరాజు నెట్లో తన దినముల ప్రశాంత గంభీరముగ గడపుకొని పోయెను. ఇక కృష్ణరాయల యుగముతో నీ యతిశయోక్తి ప్రబలి తదనంతరము రామరాజభూషణునితో దశదిశాభిత్తికల ప్రతిధ్వను లీనెను.

దీనికి నుదాహరణగ శ్రీనాథునుండి రామరాజభూషణునివఱకు గల శృంగారరసమందలి స్వభావోక్తి యతిశయోక్తిగ పరిణమించిన విధానము నరయుదము. కాశికావిశ్వేశ్వరుని భక్తురాలు, ప్రియవిద్యాధరమరణాసహిష్ణురాలు, రూపరేఖా విలాస విభ్రమాధికురాలు నగు ముకుద సుశీల. ఈమె,

" కొసరి వసంతకాలమునఁ
గోయిల క్రోల్చిన భంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండచఱిఁ
బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ
గాటుకకన్నులనీరు సోనలై
యుసిరికకాయలంతలు ప
యోధరముల్ దిగువారునట్లుగన్."

(కాశీఖండము, ౫-౧౬౩.)

దుఃఖావేశమున నేడ్చినట్లు కొంచెము కొంచెతనము గల తన శృంగారప్రవృత్తి వ్యక్తమగుచుండ కవిరాజు శ్రీనాథుడు స్వభావోక్తి యందు వర్ణించెను. ఈపల్లవి నల్లసాని పెద్దనార్య డందుకొని,

" పాటున కింతు లోర్తురె కృ
పారహితాత్మక ! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము
సోఁకె గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నె
సం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను
మిట్టల నశ్రులు చిందు వందఁగన్."

(స్వారో. మను. ౩-౭౦.)

అని సందర్భశుద్ధితో వర్ణించి తన యాంధ్రకవితాపితామహత్వము నిలబెట్టుకొనెను. దీనినే సమకాలికుడు, మధురకవియు నగు నంది తిమ్మనార్యుడు,

" ఈసున బుట్టి డెందమున
హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు
కట్టెదుటన్ లలితాంగి పంకజ

శ్రీసఖమైన మోముపయిఁ
జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠ కల
కంఠవధూకలకాకలీధ్వనిన్."

(పారిజా, ౧-౧౩౩.)

అని బహుకార్యకారణసంబంధముతో నత్యద్భుతముగ చిత్రించెను. ఈపద్యము రామరాజభూషణుని హృద్వ్యక్తియందు మార్మోగుచున్నది. అందరు నన్ని విషయముల తమతమ ప్రజ్ఞల జూపిరి. ఇతనుమాత్ర మేల యూరకుండవలెను? సన్నివేశమునకు మాత్రము వేచియుండెను. ఇంతలో విరహోత్కంఠిత యగు గిరిక లభించెను.

"ఆ జాబిల్లి వెలుంగువెల్లికల దా
యక్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటా
గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ
రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవసుధా
పూరంబు తోరంబుగన్."

(వసు. ౪-౫౨.)

అని వెంటనే సమాసఘటనాపాటవము ప్రకటించుటే గాక, పెద్దనార్యుని వరూథిని కలస్వనంబు నందుమాత్రమే యేడ్చినది గాని సంగీతకళారహస్యనిపుణురాలైన మా గిరిక యెల్గెత్తి కాంభోజీరాగాలాపన చేయుచున్నదో చూడు డని పందెము చరచుచున్నారు. ఒక్క శృంగారమందేమి, కరుణాద్భుతంబులందేమి, యన్ని రసములందు నిట్టి యతిశయోక్తి దినదినప్రవర్ధమానమై ప్రబంధకవితలో, నందును భట్టుమూర్తియందు పరసీమ నంటినది.

ప్రతిప్రబంధమున నిట్టి యతిశయోక్తు లిష్టదేవతాస్తుతి మొదలుకొని ఫలశ్రుతివఱకు ప్రబలియున్నవి. వీనిని వివరింపబూనినచో కడు విస్తారమగు పట్టికనొకటి తయారుచేయవలసివచ్చును. కనుక సూక్ష్మముగ మనుసంభవ వసుచరిత్రలందుమాత్రమే గల విశేషమైన కొన్ని యతిశయోక్తులను ఈ చిన్నపట్టికయందు జూపెదను.

## అతిశయోక్తులు

| స్వారోచిషమనుసంభవము | | | వసుచరిత్రము | | |
|---|---|---|---|---|---|
| సందర్భము | ఆశ్వాసము | పద్యము | సందర్భము | ఆశ్వాసము | పద్యము |
| కృతిపతివర్ణన ... | 1 | 11 | కృతిపతివర్ణన ... | 1 | 13 |
| పురవర్ణన ... | 1 | 35 | పరిఖావర్ణన ... | 1 | 95 |
| చాతుర్వర్ణ్యవర్ణన ... | 1 | 50 | ... ... | 1 | 99 |
| ... ... | ... | ... | గజవర్ణన ... | 1 | 100 |
| పురస్త్రీవర్ణన ... | 1 | 50 | పురస్త్రీవర్ణన ... | 1 | 107 |
| పూదోట ... | 1 | 50 | పూదోట ... | 1 | 108 |
| ... ... | ... | ... | వనపాలోద్యానవర్ణన ... | 1 | 134 |
| స్వరోచి నామకరణము ... | 4 | 6 | ... | ... | ... |
| వరూథినీవిరహము ... | 3 | 6 | చంద్రాదివస్తువర్ణన ... | 4 | 25 |

ఇంకను నిట్టివి పెక్కులు గలవు.

ఇట్లు మనుసంభవ వసుచరిత్రములందే యివి యిన్ని విశదమగు చుండ ప్రబంధవాఙ్మయ మంతయు బరిశీలించినచో నివి పరశ్శతసహస్రములుగ గోచరించు ననుటయం దాశ్చర్యము లేదు. ఇది యొక యాంధ్రభాషయందే కాక యాంగ్లమునందును గోచరించును. ఉదాహరణగ 'బైబిల్' గ్రంథమును పరిశీలించినను తెలియగలదు. జనబాహుళ్యమును వర్ణించునపుడు [2] "సముద్ర సికతాణువుల వలె" నని బైబిల్ గ్రంథము వచించుచుండును. ఇట్టి యతిశయోక్తులు ప్రాచ్యుల యం దధికమని యప్రాచ్యు లధిక్షేపించుచుందురు. ఇది యుక్తియుక్తముగనే యున్నది గాని పాశ్చాత్యుల సారస్వతమునందుకూడ ప్రాచీన యుగములందు క్వాచిత్కముగ దోచిన యతిశయోక్తి యర్వాచీనయుగములందు విస్తరముగుచు వచ్చినది. కార్లైల్ పండితు డీ విషయమునే స్పష్టపరచెను. 'డయొమిడి' యనువతడు 'ఎయినస్' నంజి యొకశిలను రువ్వెనని వర్ణించు సందర్భమున హోమర్ మహాకవి[3] "శిథిలప్రాయమైన యీ యుగమం దిర్వురు బలశాలులైన నామహాభారమును వహింపలేరు" అని సాధారణముగ స్వభావోక్తిలో శిలనుగూర్చి రచించెను. ఇది మూలముగ గొని 'టర్నస్' అను వీరుని బలావేశాతిశయములను ప్రకటీకరించు తలపుగలవాడై 'వర్జిల్' మహాశయుడు [4] విస్తరించి తన యుగ మతిశయోక్తిచే సాక్షరింపబడినట్లు చెప్పకయే చెప్పెను. వర్జిల్ మహాకవి విషయమును బోకప్ప దొగాదనగలనుగాని 'పోప్' కవియొక్క యతిశయోక్త్యలంకారాభిలాషమాత్రము విస్పష్టము.[5] కనుక ప్రాచ్యపాశ్చాత్యవిభేదనములకు నతిశయోక్తికిని సంబంధము లేదు. విదేశములందేని దేశవాఙ్మయమందేని యీ విధమైన రచన యొకానొక యుగమందు తన ప్రభావమును వెలయించును.

ఇది కవితను కొంతగ కైసేయుచున్నదనుటయు యథార్థము. కాని దీనివలన గలుగు నేగియు లేక పోలేదు. పాఠకుడు చదువునపుడు గ్రంథమందలి ప్రతి పుటయందును కథావస్తువు, దానియవకాశము(scope), కవియుద్దేశము మొదలుగాగలవానిని మఱువక యప్రమత్తుడైయుండవలెను. పాఠకుడు కాలయాపనకై యొక గ్రంథమును జదువుచు యాదాలాపముగ నుండి యతిశయోక్తి నిదమిత్థమని సత్తెఱుగ లేక పోయినచో నతడు మోసపోయి, పిదప కొన్ని యసందర్భరచనలకు గడకొనును.

సామాన్యముగ బాల్యావస్థయందు పిల్లలు దాంభికవచస్సందర్భులుగ నందురు. ఇట్టి యాడంబర ప్రవృత్తినే యధికముగ నభిలషించు కవు లీయతిశయోక్తికి పుట్టినింటివా రనదగును. కవితాకన్యను బరువుచేటయినన్ని భాషాభూషణములతోడను, చిత్రవిచిత్రవర్ణనలతోడను విస్తారముగ నలంకరించు ప్రాచ్య లీరీతియతిశయోక్తికి జనకపిత లనుట యతివాస్తవము గానేరదు గాని, పాశ్చాత్యులైన నీ సందర్భమున దీసిపోరు. వారు దీనికి పాలకపితలు. ఏలయన 'షేక్స్పియర్' మహాకవికంటెవాని రచనల కిది పట్టుకొమ్మ. మెకాలే పండితుడు పల్కినట్లు షేక్స్పియర్ మహాకవి తాను నీటుగులుక రచించితి ననుకొనిన తావులం దర్థగాంభీర్యములేని యతిశయోక్త్యనుప్రాణిత శబ్దాడంబరముతో ప్రలాపించుచుండును. అతిశయోక్తిపై నాధారపడుటయే శబ్దాడంబరమునకు గల కారణము. అత్యప్రయత్నముగ రచించిన తావులందే యతని ప్రతిభ ప్రతిఫలించుచుండును.

---

2. *"As the sands of the sea."*

3. *"Not two strong men the enormous weight could raise.*
*Such men as alive in our degenerate days."*

4. *"Vix lecti bis sex cervice subivent*
*Qualia nunc hominum producit corpora tell us."*

5. *"To count them all demand a thousand tongues,*
*A throat of brass and adamantine lungs."*

ఏతంవిధమైన రచనావిషయమునుగూర్చి పండితు లేయభిప్రాయము కల్గియున్నను, నిట్టి యుత్కృష్ట కవితాప్రలాపము లధికముగ పల్కుటకు పరిపక్వమైన భావమో, హారిరసస్థితియో యలవడకపోవుటయే ప్రధానమయిన కారణమని యంగీకరింపవలెను. మన ప్రబంధకవులలో కొందఱి యతిశయోక్తి యత్యతిశయోక్తిలో నుండును. సంగీతము పాడునపుడు కంఠము తీరపోవుటయు, శారీర ముచ్ఛస్థాయి నందుకొనలేకపోవుటయు సర్వదా సంభవించు సంగీతశాస్త్రజ్ఞుని ప్రవీణత నంగీకరించుచున్నామా? శాస్త్రమునం దపారముగ శిక్షనొందియుండవచ్చునుగాని మాటిమాటికిని కంఠము బొంగురువారుట చూడ వానికి సభలు జరుపు నభ్యాసము తక్కువ కాబోలు ననుకొనమా? కవిత్వమం దతిశయోక్తి సహజముగ నాధారము గొను కవిసంగతియు నిట్టే యని మనము గ్రహింపవలెను. గొంతు విడివడక ప్రళయ మేఘనాదముతో రొదచేయువాని కంఠమునందు శ్రావ్యమైన సంగతి యుండదు. అట్లే యతిశయోక్తిరచనావిధానమునకు పాల్పడు కవులయొద్దను చదివి నేర్చుకొనదగినంత విషయ మేమియు నుండదు. 6 "కార్యవాది వాగ్వాదనకు దిగడు" అని మనయం దాపోక్తి. మన ప్రబంధకవుల వర్ణన లీదృశమైనవే యనుట స్పష్టము.7 "గోరంతను కొండంతలు సేయుట" అను నుడి యిట్టి రచనలం దన్వర్థ మగుచున్నది. ఏకవిరచనమైన నేకోన్ముఖ మనువస్తు దాతని వాగర్థములకు చక్కని పొత్తు కుదురును. షేక్స్పియర్ కవియొక్క పరిపక్వశైలిని గుఱించి ప్రశంసించి 'డౌడన్' విమర్శకుడు 8పల్కుటయం దిదియే యభిప్రాయము. పరిపక్వదశయం దతిశయోక్తి నంతగ నాశ్రయింపకపోవుట షేక్స్పియర్ యొక్క ఘనతకు సాక్ష్యము. 'గిల్బర్ట్ ముర్రే' మహాపండితుడు గ్రీకుభాషయందలి మహాకావ్యములం దాదినుండి యంతమువఱకు నెక్కడను నతిశయోక్తి శ్రద్ధాపూర్వకముగ బ్రయోగింపబడుట గానరాదని దృఢస్వరముతో పల్కుటయేగాక దాని నాశ్రయించు నాధునికుల నధిక్షేపించెను.9

ప్రాచీనవాఙ్మయ మట్లుండగ భావనాశక్తి క్షీణించి యూహామాత్రమే ప్రబలుచు వచ్చిన ప్రబంధవాఙ్మయమం దీ యతిశయోక్తి లేక యానందమే లేదనుకొనుట కావశ్యకత నూహించినచో మన కొక విషయము దోచును. భావనాశక్తి నశించి యాలోచనాశక్తిచే (Imagination as opposed to Fancy) ననకరణను శరణ్యముగ జేసికొనిన ప్రబంధకవులు రసానందముదయింపజేయలేకపోయిరి. భావనాబంధుర మనునది శిల్పము. కేవల మూహచే నుత్పాద్య మగు రచన శాస్త్రము. భావనాశక్తి యుడిగిన యా యుగమందొక కవిని మించి యింకొక కవి తన శబ్దాడంబరముచే నూహ పెంపొందించి యతిశయోక్తులద్వారమున పాఠకుల నలికిపడునట్లు చేయ యత్నించుటయే యీ యతిశయోక్తి మితిమీరుటకు ముఖ్యకారణ మని తోచును. పఠిత భయపడు నుపాయము కన్పింపనిచో నీకవి వానిని కంపింపజేయుటకే ప్రయత్నించును. వారి భాష యన్ననో సత్, లసత్, విలసత్, ప్రవిలసత్, ఝంఝత్, స్ఫురత్, విస్ఫురత్, ప్రస్ఫురత్, కవత్, సముద్యత్ — ఇట్టి యుపసర్గాదికముతోడను, ప్రాచుర్య ప్రాకట్యాద్యాది నిరర్థకపదజాలముతోడను నిండి యుండును.

ఇట్టి ప్రబంధయుగంబు చెలరేగినపుడు కూడ చలింపక, వికారము నొందక, శక్తికి మీరిన యతి

---

6. *"Empty Vessels make much noise."*
*Those who shout so loudly have often little to say that is worth hearing.*

7. *"Of presumption a gaint, of power a gnat."*

8. *"A perfect harmony between thought and expression."*

9. *"The language is so free from bombast and exaggeration that it generally disappoints a modern reader, accustomed to the habitual over-emphasis of the Moder n fiction, not to speak of Newspapers and Advertisements."*

ప్రజ్ఞావంతమగు రచనాశాదమున్నలు గాక నంది తిమ్మ నార్యునివంటి సరసమధురకవులు మన యదృష్టవశ మున కొంతగ సరళ మగు కృతులు చెప్పుటయు గలదు. ప్రస్తుతము ప్రవర్తమానమగుచున్న మన యీ భావ కవితాయుగమందుకూడ నచ్చపు పూర్వాభిరుచుల విడనాడని మహామహులైన కవు లున్నట్లు సహృద యులు గ్రహింపకపోరు. తమతమ ప్రకృతులకు నిసర్గ మగు శాంత గంభీర ప్రవృత్తులతో లేఖినిని నడిపిం చుటయం దాధునికులలో బ్రహ్మశ్రీ పింగళి లక్ష్మీకాంతము పంతులుగారిని, బ్రహ్మశ్రీ కాటూరి వేంకటేశ్వర రావు పంతులుగారిని మించిన కవులుండరు. ఆశయమునకు పొందుపడు శైలితో పట్టినదెల్ల బంగార మనిపించుకొనినంత సిద్ధహస్తులైన బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని మీరిన మేధాసంపన్ను లర్వా చీనులలో లేరు. విస్పష్టమై, నిష్కపటమై, వీర్య వంతమై వెలుగొందు రచనలో కీ. శే. గురజాడ అప్పారావు పంతులుగారిని, కీ. శే. కొడాలి సుబ్బా రావుపంతులుగారిని, శ్రీ జాషువకవి గారిని కాదనగలవా రరిది. భావనా, భావమును, సంస్కృతాంధ్రపదములను కూడి ద్రాక్షాపాకమునందు కవిత చెప్పగలవారిలో బ్రహ్మశ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిని త్రోసి రా జనగలవారును లేరు. ఇట్టి విశిష్టతగల సత్కవులు పెక్కు రాధునికకవులందు ప్రథమశ్రేణికి రాదగిన వా రింకను గలరు. ప్రబంధ యుగమునకు భరతవాక్యము, నవీన యుగమునకు నాందీ వాక్యము నై తమరచనలు వెలయుచున్నవని "స్తుతులు పరశ్శ తంబులు నుతు ల్వితతంబుగ నొన్న" వేదమూర్తులు తిరుపతి వెంకటేశ్వర కవిధీరులు నిట్టి యుగసంధి యందు ప్రాచీనార్వాచీన కవితాభిరుచులు గలవారే యగుదురు. ప్రధానముగ పురాణయుగమైనను, ప్రబంధ యుగమైనను, భావయుగమైనను ప్రీయుతే యనునది గల మహాకవు లెప్పుడును యుగప్రభావమునకు కేవ లము దాసులుగాకయు, నట్లని దానిని ప్రతిఘటింప కయు సదసద్వివేకముతో మెలగుచునే యుందురు.

ఘాతప్రతిఘాతము లన్యోన్యాశ్రితములని ఇంతకు పూర్వమే తెలిసికొంటిమి. [10]మోహమునకు వ్యత్యయ మగు ద్వేషమువలె ప్రాచీన ప్రబంధయుగమందలి యీ యతిశయోక్తియే యర్వాచీన కవితాయుగమం దొక రకమగు వ్యత్యస్తాతిశయోక్తి (Meiosis or approximately Litotes) రూపము దాల్చెను. రాజనీతిశాస్త్రమునందువలెనే సారస్వతమందును తన కట్టి యదుపును లేక యాందోళకము (Pendulum) అటునిటు నల్లాడుచుండును. దానికి స్థిరత యుండదు. భావకవిత్వమంతయు వ్యత్యస్తాతిశయోక్తియుక్త మన లేము గాని యందలి యంతర్భాగములయం దిది యొ కటి యనుట మాత్రము సమంజసము. ఈ వ్యత్యస్తాతిశ యోక్తి యాత్మాల్పీకరణముగకూడ నొక్కొకయెడ బాహిరదృష్టికి గోచరించుచున్నది. ఇట్టి యాత్మనిర సనమును గుఱించిన రహస్యమును మన మెఱిగికొన వలెను. ఇది స్వీయాల్పత్వముగ కనుపడియు నాత్మో త్కర్ష గర్భితమై యుండును. దీనిని వ్యాజస్తుతియని మన యాలంకారికు లందురు. ఇది యొకప్పు డాత్మస్తుతి ప్రా యకముగ పరిణమించుచుండును. స్తుతిచే నిందను, నిందచే స్తుతిని స్ఫురింపజేయుటయే వ్యాజస్తుతిగదా! ఈ విలక్షణము లా ఖండకావ్యమునం దాకవి చెప్ప దలచిన విషయము ననుసరించియుండును. మొత్తము మీద నధునాతనకవు లతిశయోక్తిని త్రోసిపుచ్చితి మనుకొని యందలి సంబంధాసంబంధాద్యంతర్విభాగము లను, ఆత్మాల్పీకరణా ద్యంశగర్భిత మగు వ్యాజస్తుతిని అగ్రస్థానమున బెట్టుచుండుట మన కెల్లరకు విదితము.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి —

" అల్పమానుషదోషంబు లాచరించి
యధిక దైవిక కోపంబు లనుభవించి
కాలి పరపాగ మారిన కట్టెవోలె
నడచుచున్నాడ నే నడుగడుగునకును."

అను వప్రస్తుత ప్రశంస గల వ్యాసమును పరిశీ లింపుడు. ఇది యాత్మాల్పీకృతితో ప్రారంభింపబడి యాత్మశిక్ష (self - culture), యాత్మనిగ్రహము

10. *"Hatred is the reverse of love."*

(self-control) లచే పెంపొందిన యాత్మ విశ్వాసము (self-confidence) నధిగమించి, స్వయంభూత్వము (self-existence) గ కూడ పరిణమించు చున్నది. చూడుడు :

"ఈదైవమ్ములుకూడ నావలెనె లో
 భేచ్ఛామదక్రోధవాం
ఛాదుష్టాత్ములు, వీరి నమ్మికొని యీ
 మద్దుఃఖసౌఖ్యార్థినై
యీదౌర్భాగ్యము లేల త్రవ్వకొన? ని
 ట్లే యుండిన ట్లుండి లో
లో దీర్ఘోరుతపంబు జేసికొని నా
 లో నేనె నే నయ్యెదన్."

ఇది బైరన్ మహాకవి 'అనర్థకవాదిత' (Pessimism) వంటిది.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'నాకానుక' (కృష్ణపక్షము : పుట ౭౨) అనువ్యాసము పరీక్షింపుడు:

"ఏది నీ కిత్తు నందువా హృదయనాథ!
కానుకగా నే మొసంగఁగాఁగలను నీకు?
తారకా రత్న భాసుర తారహార
సుప్రభామాలికాజాలశోభితుండవు
రాజరాజేశ్వరుండ వీవు ప్రభుండ వీవు
హృదయపతి వీవు, భవదీయపదసరోజ
మృదురజోలేశ దివ్యసంపదను వలచి
వీథివీథుల వాడల విపినములను
భిక్షుకునివోలె దిరుగాడు పేదనోయి!
కానుకగా నే మొసంగఁగాఁగలను నీకు?
గాఢలజ్జానుతాప సంకలితహృదయ
నీరజదళాల రాలు కన్నీటిచుక్క
గాక, మనసార, వలపూర, గలఁతదీర
కానుకగా నే మొసంగఁగాఁగలను నీకు?"—

ఇది కేవలము స్వల్పతను పైకి సూచించుచున్నను వైరాగ్యాభిముఖ్యము (Self-denial), నాత్మార్పణమును (Self-Sacrifice) గర్భితముగ గల వ్యాజస్తుతి.

అస లిట్టి యాత్మాల్పీకరణ మనునది భక్తిభావమందు శ్రీకృష్ణకర్ణామృతాది గ్రంథములలో కొంతగ గోచరించును. యమునాదులందు నీవు జలమ్ములాడుతరి త్రెంపబడ్డ నాళీకపుష్పాళియందు నన్నొక్క పూమొగ్గగ సృష్టింపక యి ట్లేల తుచ్ఛమర్త్యులుగ బుట్టించితి వని భక్తులను కవులు దైవము నడుగుచుందురు. ఇట్టిది యుద్రేకపారవశ్యములుగల భక్తుల ప్రబ్బికోలు. శ్రీ వేదుల సత్యనారాయణగారి 'పుష్పాంజలి' రచనలం దిట్టివిధానము బాగుగ దృశ్యమాన మగును. భక్తిపారవశ్యమున గల్గు నాత్మాల్పీకృతి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'స్వామి!' అను ఖండకావ్యమునందు పరకోటి నంటినది. పరిశీలింపుడు:

"...పరిగాఢశర్వరీచ్ఛవి దరిద్ర
తావిధానము తేజోవిహీన మనవ
రతపరిస్రుత బాష్పధారామిళితము
నన్ను నీవుండు మన్నంగ నంబుజాంఘ్రి!
తమహాంధకారంబున నెపుడో యొక్క
సారి మెఱసితి వానాడు స్వామి! నా కు
టీర మానంద వాయుప్రచార శతస
హస్రకుసుమ పరీమళవ్యాపృతంబు."
"దానితో సరి! మఱల నాంధ్యమ్ము క్రమ్మె
తొలివిధముకేని యీచీకటులను నేను
నొక్కరొక రప్పళించుకొంచుండినాను
నిన్ను నీనాటి మెఱపు మన్నించుకొంచు."
(ప్రమోదూత ఆశ్వయుజ భారతి-పుట ౬౩౭.)

ఈ మూడుపద్యములును రూపుదాల్చిన త్రిమూర్తులు. ధ్యానసమాధి ముద్రాభిముద్రితుడగు భక్తుడు నిమీలితలోచనుడై యాభగవత్స్వరూపమైన జ్యోతి రాకారముతో సాలోక్య మనుభవించునప్పు డాతని మనస్తత్వ పథమునందు పరిభ్రమించు భావ మీపద్యత్రయ మనదగును.

ఈ యీ వ్యాజస్తుతిమూలకములగు నాత్మాల్పీకరణరచన లన్నిటికి నతిశయోక్తియే మూలాధారమని తెలిసికొనుటకై యిన్ని యుదాహరణల బరిశీలించితిమి.

పైన పేర్కొనిన వ్యత్యస్తాతిశయోక్తి (Reversed hyperbole) బహుశః భక్తిప్రధానమగు శతకకవితయే బీజభూత మనవచ్చును. శతకములంట

కవులు తమ దుర్గతిని నిందించుకొనుటయేకాక యనంత గుణసంపన్నుడైన భగవానుని పాదపరమాణుతుల్యులమైన గా నేరమని విశ్వసించి తమ్ముఁదాము కొంచెపరచుకొను టయు గలదు. ధూర్జటిమహాకవికృత కాళహస్తీశ్వర శతకములో ప్రవృత్తి, భోగములనుండి నివృత్తి, త్యాగ ములలోనికి మరల జూచు కవియొక్క హృదయా వేదనయు, నాత్మార్పణమును దీనికి సాక్ష్యములు. కొందఱు భక్తిపారవశ్యమున త్రికరణశుద్ధిగ తమ్ముఁ దాము నిందించికొందురు. కనుక భక్తిప్రధానమగు శతకరచనము కొంతవఱకు ప్రబంధాతిశయోక్తిపరి ణామరూపమైన నేటి భావకవితలో వ్యక్తమగు నల్పోక్తికి మూలమగుచున్నది.

అతిశయోక్తికి నల్పోక్తి (వ్యాజస్తుతి) యొకా నొక వ్యత్యయ మనుము గాని, యల్పోక్తి యొక్కటి మాత్రమే దాని వ్యత్యస్తరూపము గాదు. అనగా నతిశయోక్తి మఱియింక కొన్ని రూపవిశేషముల దాల్చుటయు గలదు.

అతిశయోక్తినిగూర్చి చర్చించుచు దాని రూప విశేషములై, దానినే బీజములుగా గలవనుటచే నిన్ని వివిధరచనల బరీక్షించితిని. అతిశయోక్తిపై రోసిన నేటి భావకవితాయుగము, దాని రూపమునే గుఱు తింపలేనన్ని చిత్రవిచిత్రవర్ణనలచే కవిత్వీకృతము జేసి మనకు ప్రదర్శించుటయందలి కౌశలము ప్రశంసనీయ ము. కాని భావియుగములం దీయభిరుచిచే రోసి యువకులు ప్రస్తుతము మన మతిశయోక్తియెడ జూపు నిరసనమునకు రెండురెట్లుగ దీనిని నిరసింతురనుట మాత్రము మఱువరానిది.

ఇట్లలంకారాభిరుచిపరిణామమును వ్యక్తపఱచు మానవభావాభివృద్ధియు, నభ్యుదయమును ప్రపంచ చరిత్రయందు సువర్ణాక్షరములతో విలిఖింపబడగలవు.

మ. రా: — వ్యాజస్తుతియే వ్యత్యస్తాతిశయోక్తి యని యీసందర్భమున సర్వసౌలభ్యార్థము వ్యవహృత ము. అతిశయోక్తికి నంతర్విభాగము లాజేటిని వ్యాస విస్తరభీతిని వివరింపలేను. వ్యాజస్తుతిలోని విభాగమే యనుకొన్నను 'ఆత్మాల్పీకరణరచనము' మాత్రము నేటి యుగవిశిష్టతకు గుఱుతు. ఈవ్యాసమున పేర్కొన బడిన రచనావిధానము లన్నిటికి నతిశయోక్తియే బీజ మనుట సారాంశము.





# 'రెండో భాష' మేష్టరు

శ్రీ

= భమిడిపాటి కామేశ్వరరావు =

"తెల్లవాళ్ల స్కూళ్లలో తెలుగు పద్యాలమీద ఖాతరీ లేదండి" అన్న గిరీశంమాటల్లోనూ, "తెలుగు క్లాసటన్న లేలికగా చూచు టాంగ్ల పాఠశాలలందు గలుగు..." అనిన్నీ, "ఆంగ్ల పాఠశాలయందు తెలుగు పంతులుగ జేరుటన్న దౌర్భాగ్యపు పాపము" అనిన్నీ ఉన్న చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి మాటల్లోనూ వచ్చే 'తెల్ల', 'ఆంగ్ల' పాఠశాల లంటే తెలుగుదేశంలో ఉండే ఇంగ్లీషుబళ్లు అనే అభిప్రాయం. కవి పండితులేకాక పామరులుకూడా దీన్ని గురించి తత్తుల్యంగానే సెలవిస్తూంటారు. తెలుగునాట ఇంగ్లీషుబళ్లలో చదువుకున్నవాళ్లు ప్రసంగాలు చేసుకునేటప్పుడు విషయం దొర్లిదొర్లి తమ చిన్నప్పటి తెలుగుమేష్టరుమీదికి పడుతూంటుంది. ఒకడంటాడు: "మాకు ఓ తెలుగుమేష్ట రుండేవాడు. బహుతమాషామనిషి. మహామంచివాడు. అఖండపండితుడు. క్లాసులోకూడా చిన్న రాగిచెంబు ఆయనచేతులో ఉండేది. ఎవరితోనేనా కాస్త మాట్లాడగానే ఆచమనం చేసేవాడు. ముసలిపండులా ఉండేవాడు. మేం 'తాత'గారు అని ఆయన్ని పిల్చేవాళ్లం. భాష తల్లి గనక, ఆతల్లికి తండ్రి అవడంచేతగావును ఆ వరస—అని ఇప్పుడు బోధపడుతోంది. బతికున్నవాడి రచన ఏదీ ఆయన మెచ్చేవాడు కాడు. తనని యే మన్నా రాయమంటే,— మన కేం వచ్చురా మన మొహం! ఆ పూర్వులవి లక్షలూ కోట్లూ ఉన్నాయి, అవి వల్లించి జీర్ణించుకుని వ్యాఖ్యానం చేసుకుంటే చాల సుట్రా, కొలతక్కువగ్రంథాలు మేం పుట్టించాం అంటూ గంతు లెయ్యకపోతేనా! — అనేవాడు. ఆయన సంస్కృతాంధ్రాల్లోమాత్రమే ఉద్దండుడవడంవల్ల, ఆయన్ని మేం హాస్యాన ఏడిపించుకునేవాళ్లం" అని, చిన్నతనపు విషయాల్లో సాక్ష్యం కష్టం గనక తనకే విజయం ఉండేసినట్టు నీలిగి నవ్వుతాడు. మరొకడు విషయం దొరకపుచ్చుకుని, "మా తెలుగు మేష్టరుండేవాడు. మహాగడుగ్గాయిగానూ, చాలా పెడసరంగానూ ఉండేవాడు. మాట్లాడ్డం ఆయన మొద లెట్టేసరికి పుల్లవిరిచి పొయిలో పెట్టేవట్టుండేది. కర్మదశ, ఆయన స్వయంకృషివల్ల ఇంగ్లీషు నేర్చాడు. ఆ గర్వంతో మమ్మల్ని నోరెత్తనిచ్చేవాడు కాదు. పైగా, అడ్డమైనప్పుడూ శ్లేషల్తో మాట్లాడి మాకు అసహ్యం కలిగేటట్టు తనప్రజ్ఞలూ పైత్యాలూ కనపరిచి, చిన్న కుర్రాళ్లని చేసి మమ్మల్ని వెగ్గుకుపోతూండేవాడు. ఆ అసహ్యం నామనస్సులో పేరుకుని నిల్చిపోయి తరవాత తరవాత ఆయన ఎదరపడ్డప్పుడు నేను ఆయనకి దణ్ణమేనా పెట్టనీకుండా చేసేసింది. తను వెనక తిన్నగా ప్రవర్తించిఉంటే నేను తరవాతేనా తన్ని గౌరవించి ఓదణ్ణం పారేస్తూండేవాణ్ణిగా! తలబిరుసు కనపరిచి నిక్షేపంలాంటి వాదణ్ణం చెడగొట్టుకున్నాడు! ప్రాప్తం ఉండద్దూ!" అంటూ తన ఔదార్యం వెళ్లబుచ్చుతాడు. ఇటువంటి రౌగ్యతానిర్ణయవాక్యాల్ని బట్టి చూస్తే, బొత్తిగా ఇంగ్లీషుముక్కేనా తెలియకుండా ఉండి అది నేర్చడానికి ఉబూరుమంటూ యత్నించే విద్యార్థులకి హాస్యం కల్పించినవాడు తెలుగుమేష్టర్లలో క్షంతవ్యుడనిన్నీ, అటువంటి ముక్కలే ఓ బుట్టెడో తట్టెడో తనూ పోగుచేసుకుని గడుసుగా మేష్టరీ నిలబెట్టుగో

డంలో పెట్టిన తెలుగు మేష్టరు గర్విష్టి అనిన్నీ ఊహాలు మొదట తెలుగువిద్యార్థుల్లోనూ, అందువల్ల కొద్దికాలం తరవాత తెలుగువాళ్లల్లోనూ వ్యాపించి, వ్యాపించుతూ ఉండటం అనేది సత్యదూరం కాదు. అటువంటి తెలుగు మేష్టరీయొక్క స్థితీ, ఆస్థితి సంపాద్యం అయ్యే లాగు చేసిన వాటాదార్లు ఒకరికి తెలియకుండా ఒకరు పడ్డ శ్రమలూ గమనించడమే ఈరచన ఉద్దేశం. స్కూళ్లల్లో ఇంగ్లీషుభాషాపాఠం తప్ప కడమపాఠాలన్నీ తెలుగులోనే కానివ్వతీరాలనే ఈరోజుల్లోకూడా, 'రెండో భాష' అనే బిరుదం పోగొట్టుకోడానికి శక్తి లేకుండా ఉన్న 'తెలుగు' యొక్క యథార్థస్థితి గురించి ముచ్చటించేటప్పుడు, నవ్వొచ్చినా ఆగదు, ఏడుపొచ్చినా తప్పదు.

"అసలు కోతి, అందులో కల్లు తాగింది, ఆపైని తేలుకుట్టింది, దరిమిలాను దయ్యంపట్టింది, పైగా ఎన్నికలకి అభ్యర్థిగా నిల్చింది" అంటూ కొందరు సామ్యం పోరేస్తుంటారు. అల్లాగ్గానే, అసలు మేష్టరు, అందులో తెలుగు మేష్టరు, ఆపైని ఇంగ్లీషుబళ్లో తెలుగు మేష్టరు, దరిమిలాని తెలుగువాళ్ల ఇంగ్లీషు బళ్లో తెలుగు మేష్టరు, పైగా పోటీలు! ఓ! ఎల్లా ఉండవలసునో అల్లా ఉంటుంది. ఇంగ్లీషుబడి అంటే విస్తారం ఇంగ్లీషు వాల్లాడిపోయే బడి అన్నమాట. అందులో ఫక్తు ఇంగ్లీషుభాషాపాఠం మాత్రమే ఇంగ్లీషులో కానివ్వ ఊరుకోకుండా, చాలాభాగం శాస్త్ర పాఠాలుకూడా తెలుగుపిల్లలకి ఇంగ్లీషుభాషలోనే బోధించేచోటు — అనగా ఒక శాస్త్రం అభ్యసించాలంటే దాని తాలూకు పరిభాషకూడా పరభాషలోనే ప్రతీ తెలుగుకుర్రాడూ తెలుగువాడైన మేష్టరువల్ల నేర్చుకునే చోటు. పఠనీయ విషయాల్లో తెలుగు ఒకటి. అటువంటి తెలుగులో విద్యార్థుల్ని ఉత్తీర్ణుల్ని చెయ్యడానికి ఆసామీ ఉండాలి. ఆయన్ని తెలుగు శాస్త్రుల్లు, తెలుగు పండిట్, తెలుగు మున్షి, తెలుగు పంతులు, తెలుగు మేష్టరు అని విద్యార్థులుకాని వాళ్లంటారు. విద్యార్థులు తమ సహజ చమత్కారం దానంచేసి సాధారణంగా ప్రతీ పండిట్‌నీ ఒక ముద్దు పేరుతో వాడుతూంటారు. అలాంటి తెలుగుదేశపు ఇంగ్లీషుబళ్లో తెలుగు మేష్టరుగా ఉన్న జీవితం— పానకంలో పుడకకంటె అడ్డు; తోటకూరకాడలో పురుగుకంటె తీసికట్టు; గొప్ప యింటి తక్కువ సవితి కూతురుకంటె అసహ్యం; మనకర్తిలేని వానవఆడు పడుచుకంటె కనిష్ఠం; శ్రీరామనవమి హరిదాసుకంటె అన్యాయం; గానం కరిపించని ఆంధ్రనటుడికంటే అధమం; ఎన్నికల్లో ఎగబడే బ్రాహ్మణ అభ్యర్థికంటే కిందిచెయ్యి; ఇల్లటపల్లుడికంటె చేలిక; ఇంగ్లీషు చదువుకోని పెళ్లికూతురుకంటె తక్కువ; తీర్థాల్లో సులకోమంచం మిఠాయికంటె చవక; పంచముడు జొరబడ్డ దేవాలయం కంటె అపవిత్రం; నిజం వాదించే ప్లీడరుకంటె నాశరకం; ఎన్నికల్లో ఓడిపోయి తరవాత 'నామినేటు' కాబడ్డ అభ్యర్థి కంటె లోగసాను; తద్దినం పెట్టేవాడి తమ్ముడికంటె అనవసరం; ఉమ్మడి ఆస్తికంటె బంజరు; ఆంగ్రసంస్థకంటె మూరాముట్లు; లైసెన్సులేని డ్రైవరు కంటె అభాంద్రా; రాజీనామా దాఖలుచేసి వెళ్లిపోయిన ఉద్యోగస్థుడిస్థానే వచ్చిన అయ్యకంటె హాస్యాస్పదం; పిలవని భోజనానికి వెళ్లిన వ్యక్తికంటె తరవాతమాట; చటుక్కున కళ్లనీళ్లు పెట్టుకోలేని ఆడదానికంటె పెత్తిమనిషి; అజ్ఞాతవాసం చేస్తూండే సైరింధ్రి స్వరూపంకంటె ఇది; బిళ్ల అంటించని ఉత్తరంకంటె చచ్చు; పాలలో బల్లి, నీళ్లలో రాతి, గాలిలో చేప!

ఇంగ్లీషుబళ్లో తెలుగు మేష్టర్ని — హెడ్డు మేష్టరు కసురుకోవచ్చు; కాని 'తల' గలవాడు అట్లా చెయ్యడు. అదృష్టంవల్ల తెలుగురాని ఇతర మేష్టర్లు చప్పరించి పారెయ్యవచ్చు; కాని, పరమార్థం గుర్తించిన ఇతరుడు అట్లా చెయ్యడు. జ్ఞాతిపండితుడు ఢీకొట్టవచ్చు; కాని, అప్పుడు తిట్లే కాని దెబ్బలుండవ్. పిల్లలే హాలో లక్ష్మణా అని పాడించవచ్చు; కాని, అది వ్యక్తియొక్క గాత్రాన్ని బట్టి పిరాయిస్తుంది. ఛంత్రోతులు వినిపించుకోకపోవచ్చు; కాని, వినుపించుచున్నవాళ్లకి చెయ్యక పోవచ్చు గనక ఆ విషయం నష్టం ఉండదు. సరే సరి పెద్ద ఇనస్పెక్టరు మొహమే చూపించకపోవచ్చు; ఓవెహాస్తరు

ఇనస్పెక్టరు గదమాయించవచ్చు; మరీ మైనరు ఇనస్పెక్టరుకూడా ఏదో యథాశక్తి కొండంటికం పెట్టకుండా ఊరుకోకపోవచ్చు — అందరికీ విడివిడిగా తెలుగూ కలిపి సంస్కృతమూ తెలియకపోవుగాక, అది వేరుసంగతి!! ఒకచోట ఇనస్పెక్షన్ అంతా పూర్తికావచ్చిన సమయంలో ఇక ఏమేమిటి మిగిలిపోయాయో ఇనస్పెక్టరు లెక్కచూసి తెలుగు కాంపోజిషన్ బుక్కులు చూసిఉండలేదని తేల్చి, తను తన బసకి వేంచేస్తూ, కాంపోజిషన్ పుస్తకాలకట్ట పట్టుగుని తెలుగు మేష్టర్ని తనబసకి రాత్రి రమ్మన్నాడు! మొత్తం మీద చెప్తే, ఇంగ్లీషు బళ్లలో ఉండే విద్యతో బాదరాయణసంబంధం ఏదో వోటి కలిగిఉన్న అజ్ఞమైన జనానికీ, తెలుగుమేష్టరంటే — "విద్యావిషయాల ప్రణాళికలో 'రెండో భాష' అనే నామధేయంతో ఉన్న 'తెలుగు' యొక్క పూచీ నెత్తిమీద వేసుగుని, కాళ్లు పట్టుగుని ఈడ్చి పారేస్తూన్నా చూరుపట్టుగుని వేళ్లాడుతూ, ప్రస్తుత ప్రపంచంతో ఈషణ్మాత్రమైనా సంపర్కం లేనటువంటివన్నీ, తనకీ మరి తనలాంటి ఇద్దరికో ముగ్గురికోమాత్రం తెలిసినటువంటివన్నీ ఒకానొక పాండిత్యం దేవభాషలో ఎందుకో ఎల్లాగో ఎంతవరకో కలిగి ఉండి, తద్వారా సంక్రమించిన త్రివర్ణత్వాన్ని నిలబెట్టుకో గలందులకు నెలకు ముప్ఫైరూపాయల పరమావధిజీతం లాగుతూ ఉండే పరమ నెంబరు వన్" అనే సంకల్పం ఉన్నట్టు సూచనవల్ల కనిపిస్తుంది.

ఇంగ్లీషుబళ్లో తెలుగుపాఠంవేళ అయేసరికి విద్యార్థికి ఎక్కడలేని ముచ్చటా, ఎక్కడలేని హుషారీ, ఎక్కడలేని సరదా, ఎక్కడలేని స్వేచ్ఛానూ! కడంపాఠాలు చాలాభాగం ఇంగ్లీషు భాషలోనే జరిగిపోతూండేవి. ఇటీవలి ప్రభుత్వపు నిర్బంధంవల్ల వాచా ఇతర పాఠాలుకూడా తెలుగులో మొదలెట్టి యత్నించినా, మనసా ఇంగ్లీషులోనే వెళ్లబుచ్చుకుంటున్నారు. కొందరు త్రిశంకుస్వర్గంలో పడుతున్నారు. ఇంగ్లీషు భాష తెలుగువాడికి పరభాష. కాబట్టి ఇంగ్లీషుపాఠంలో మేష్టరు వాడుతూండే సంప్రదాయాల్లో చాలావరకు తనకి అగమ్యం అయినా, విద్యార్థి, తెలుసుకోక తెలియనిసంగతి ముఖులకుణాల్లో కించిత్తూ పాక్కనియ్యక వింటూ, పైలైతే నీలి అద్దాలమాటున లేతకునికిపాట్లు అభ్యసిస్తూ కూచుంటాడు. ఇంగ్లీషుప్రశ్న తనమీద పడినప్పుడు సమాధానం చెప్పడం గండమంత పని అవడంచేత సాధారణంగా ఆ గండం గడవక, విద్యార్థి గురువుగారి గౌరవార్థం స్తబ్ధులా నిలబడతాడు. అందుకని ఇంగ్లీషులో పాఠం జరిగేటప్పుడు కుర్రాడి నాలిక కేవలం రైరులో ఉంటుంది. తెలియని మాటలు వినడం అతడికి పరిపాటి అవుతుంది. అక్కణ్ణించి తెలియనిమాటలు తప్ప అతడు విన్నేలేక, తనికి తెలిసేటట్టు మాట్లాడే ప్రతీవాడికీ సరుకు లేదంటాడు— ఉపన్యాసాల్లో ఒక్కొక్క శ్రోత తనకి తెలిసినచోటల్లా "హియర్, హియర్" అని హెచ్చరించినట్టు. క్రియముక్క---తెలియనిపాఠం గంభీరంగా మెచ్చుకోడం, మర్యాదాగా బిగమింగడం, జీర్ణించుకోలేకపోయినా కిక్కురు మనకుండా అల్లరి లేకుండా కాలం వెళ్లబుచ్చుగోడం, కుర్రాడికి అమరిన వ్యాపారం. మేష్టరు ఇంగ్లీషులో కోప్పడుతుంటే కుర్రాడికి కోపం లేదు, విచారకరమైన విషయం చెబితే విచారం లేదు, నవ్వుమాటలు చెబితే నవ్వు లేదు. తెలియకుగా!! అల్లాంటప్పుడు ఇంగ్లీషు చెప్పే మేష్టరు అనోకమాస్తరు చిన్నతనంలాంటి అపజయం అనుభవిస్తాడు. ఎంచేతంటే, ఎదేనా ఒకటి గొప్ప మాట అనుకుని, ఒకడు, సభవారిమీద ప్రయోగించినప్పుడు అది పట్టిచ్చిందా సరేసరి; పట్టివ్వక దెబ్బ తేజోటయి మాట తేలిపోయిందా, వాడు కొంచెం కుంగిపోయి అది తనకి కేవలం శిరశ్ఛేదం అనుకుని ఇతరత్రా ప్రయత్నించి మరోటీ, ఇంకోటీ చెప్పొగొచ్చి, చేతా వాతా అయినంతమట్టుకు నెగ్గడానికి, చెమటపట్టేవరకూ శరీరం ధారపోస్తాడు. అల్లాంటి అపజయం నివారించుకునేటందుకు ఇంగ్లీషుని పాఠం చెప్పే మేష్టర్లు—తమరికి తెలుగు రాదని చెప్పుకుంటూ (అల్లా చెప్పుగోడం పూర్వంలో మహానుభావత్వానికి లక్షణం అనుకునేవారు) తమ భావాన్ని తెలుగులో అనేసేవారు. 'ఒన్, ఇంతేనా' అనో, వైరుధ్యం వల్లో కుర్రాళ్లు నవ్వేవాళ్లు. దీన్నిబట్టి నవ్వుకో

డానికి తెలుగుభాష. అనిన్నీ, ఎక్కడ తెలుస్తాంటే అక్కడ నవ్వవలసిందే అనిన్నీ చాలామంది బుద్ధిమంతుల తాత్పర్యం అయినట్టు తోస్తుంది. అందుచేత తమరి మాతృభాష తమకే వేళాకోళం చెయ్యతగ్గ భాష అని ఒక్కొక్క కుర్రాడు అనుకోడానికి మార్గం ఒకటి దొరుకుకొచ్చింది. ఇక ఇల్లాంటిభాషలో పాఠం చెబుతా నని బయలుదేరిన ఘటం—మూర్తీభవించిన వెక్కిరింత, తనవు దాల్చిన అమాయికత్వం, ఘనీభవించిన అప్రయోజకత్వం, ఖాయపడిన అనాథత్వం, పండిపోయిన దావస్తం అనేటటువంటి భావం కుర్రాళ్ల హృదయంలో అంకురించి ఊరుకోక కుదురుగట్టి వేరుబారడంలో ఆశ్చర్యం ఏముందీ! అందువల్ల ప్రతి విద్యార్థికీ తెలుగు మేష్టరు దర్శనం అయేసరికి, లోగడ వ్యక్తం కావడానికి వీల్లేక నిల్చిపోయిన అనేక చేష్టలు గోచరిస్తాయి. అక్కణ్ణించి, మాటచమత్కారం, హాస్యం, వెటకారం, ఎకసెక్కెం, కన్నుగీటడం, అబద్ధం ఆడటం లాంటి లక్షణాలు వచ్చిపడతాయి. కొందరు వేషాలు వేస్తారు. కొందరు మొద్దుకోట్లు అప్పుడు తొడుక్కొస్తారు. కొందరు ఆ గంటలో పెద్ద పెద్ద బుట్ట తలపాగాలు చుడతారు. కాబట్టి మామూలుగానే అల్లరిచేసే విద్యార్థి తెలుగుక్లాసులో పట్టపగ్గాలు లేకుండా ఉంటాడు! అదివరదాకా పిల్లిలాగ ఏఅల్లరీ లేకుండా ఉన్నవాడు కూడా అమాంతంగా ఆడపులిలా చేస్తాడు. ఒక పెళ్లి సంబంధంలో పెళ్లికొడుకు యొక్క మంచితనం పొగుడుతూ ఒకాయన—"అబ్బే! పెళ్లికొడుకు ఎంత నెమ్మది గలవా డనుకున్నా రేమిటి! స్కూలు ఫైనలు పరీక్షవాళ్ల మొహాన్ని దరఖాస్తులకోసం అన్ని రూపాయలు పోశాడా, అయితేం, నిగర్వి. ఆఖరికి తెలుగు క్లాసులోకూడా అల్లరి చెయ్యడట!" అన్నాడు. అనగా, శరీరస్థితి వీల్లేక ఏదో జబ్బులో పడిపోయి ఊరుకోవాలి గాని కుర్రాడేమిటి తెలుగుక్లాసేమిటి అల్లరి చెయ్యకపోవడం ఏమిటి అని. తెలుగు క్లాసులో అల్లరి చెయ్యని పీనుగుల్ని తక్కినవాళ్లు ఏడిపిస్తారు, "మర్యాదస్తుడు బయల్దేరాడయ్యా మహా!" అంటూ. అందుకని ఎవళ్లూ మానరు. ఒకడు అనవసరంగా ఒళ్లు విరుచుకుంటాడు, ఒకడు ఆవలింతలు, ఒకడు తెగతుమ్ములు వగైరా. ఒకడు కాకితపు పడవలు చేస్తాడు. జుట్లు లేనికాలం కాబట్టి జుట్టూ జుట్టూ ముడెట్టడానికి వీల్లేక, ఒకడు, బట్టా బట్టా ముడేస్తాడు. ఒక్కొక్క పెద్దపన్నాముతగ మానీటరు హాజరుపట్టీ నిమిత్తం మేష్టారుకుర్చీదగ్గర నిలబడి మేష్టారిజుట్టు కుర్చీకి ముడెయ్యబోతాడు. ఒక్కొక్కప్పుడు ఎక్కణ్ణించో తెలియకుండా చిన్నచిన్న రాళ్లు మేష్టరుమీద పడి ప్రమాదం అంతపని జరుగుతుంది. ఒకడు మేష్టరు వెనకాల కళ్లీ ముఖం వికారంగా పెట్టి తెయితక్కలాడతాడు. ఒకడు వెనకాలే నడిచి మేష్టరుమీద, పన్నీరు అప్పట్లో లేక, సిరా చిలుకుతాడు. కొందరు కొందరు బల్లలు బాత్తారు. కొందరు జంతువుల కూతలు అభ్యసిస్తారు— అనగా, గర్జన, గాండ్రింపు, సకిలింపు, ఓండ్రపెట్టడం, మొఱుగు, ఘుర్ఘురింపు, అంకె, బుస మొదలైనవి, వాచకాల్లో చిన్నతనంలో చదివినవి నెమరికొచ్చి! ఒక్కొక్కప్పుడు ఒకడు బయలుదేరి పక్కవాడు తనని కూనీ చెయ్యడానికి సన్నద్ధుడై ఉన్నాడనిన్నీ, తనవల్ల తప్పు లేదనిన్నీ, కూనీ జరుగుతూండగా పండిట్ చూసి ఊరుకున్నట్టు తెల్లి హెడ్మాస్టరుతో రిపోర్టు చేస్తాననిన్నీ బెదిరిస్తాడు. తెలుగుక్లాసులో జరిగే అల్లరికి నాయకత్వం దొరకడం అనే అదృష్టం పట్టినవాడి జన్మ సఫలం అనిన్నీ, వాడికి పునర్జన్మ ఉండబోదనిన్నీ, దేవుడు వాడికి జంతుజన్మ ప్రసాదించనందుకు దేవుడి ఋణం, తెలుగుదేశం తన్ను కన్నందుకు దేశ ఋణం, తనతల్లిది తెలుగు అవడంవల్ల తెలుగుఋణం వాడు ఆ దెబ్బతో నిస్సందేహంగా తీర్చిపారేశాడనిన్నీ, మానవత్వం సార్థకం చేసుగోడానికి అంతకంటె మహాతరుణం ఉండదనిన్నీ, కొందరి సంకల్పమా అనిపిస్తుంది. కొందరు మాటకార్లు అప్రస్తుతప్రశంస మొదలెడతారు. కొందరు తెలుగుమేష్టరుగారి ఇతరవ్యవహారాల్లో ప్రవేశిస్తారు. కొందరు ఆయనే చేసిన పుస్తకం యొక్క ప్రాశస్త్యం కొనియాడతారు. దాంతోటి ఆయన ఉబ్బిపోయి తన గ్రంథం అంత గొప్పదైనప్పటికీ తను దానికి చాలా తక్కువఖరీదే పెట్టాననీ, అల్లాంటివి ఈ కాలంలో బయలుదేరటం లేదనీ మోస్తరులో లెక్చరు ఇస్తాడు, పాఠం ఏవ్యం అయిపోతుంది.

విద్యార్థులు కనుసంజ్ఞలు చేసుకుంటూ ఆనందిస్తూంటారు. ఒక్కొక్కప్పుడు, పఠనగ్రంథాలుగా నియమింపబడ్డ టెక్స్టుబుక్కులనే తద్దినపు గ్రంథాల్లో శృంగారఘట్టం తగుల్తుంది. అందులో ఉన్న అశ్లీల పదాలకి అర్థం చెప్పవలసివొచ్చినప్పుడు, తెలుగు మేష్టరు ఎవరితల్లిమీదో చెప్పక ఛేకగతి అవలంబిస్తాడు. అటువంటి సమయంలో ఆయన్ని ఆపి అక్కడే తనకి అర్థం తిన్నగా అవటంలేదని ఒక్కొక్క ద్విపాదుడు పట్టుపడతాడు. గౌతముడిశాపం, కర్ణజననం, పాండవులజననం, ఊర్వశీశాపం మొదలైనవి ఇల్లాంటి గండకత్తెర స్థలాల్లో కొన్ని. క్లాసులో దైవాద్యా ఆడపిల్లలే ఉండడం తటస్థించిందా, పైరీతి ప్రశ్నలు ఒక్కరవ్వ జోరుగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. మరోడు క్లాసులో ఉన్న ఆడపిల్లల పేర్ల ఇతర అర్థంతో వచ్చే ప్రశ్నలడుగుతాడు. "మేష్టారండి, వీడు మిమ్మల్ని బూతులు తిడుతున్నాడండి" అంటూ ఒకడు ఇంకోడిమీద తమాషాకి పితూరీచేస్తాడు. ఒకడు ఆలస్యంగా వచ్చి కూచుని, "ఏమిరా" అంటే, "మాయింట్లో గడ్డిమోపు వేయించి వచ్చాను." అంటాడు. ఇంకో అబ్బాయి మహా మతావేశంతో "ఈవేళ నక్షత్రం ఏమిటండి మేష్టారూ!" అని, "ఎందుకురా?" అని పక్కవాడు అడగ్గా, "ఉండరా; మామామగారి కూతుర్ని తీసుకురావాలి!" అన్నాడు. ఓ తెలుగు మేష్టారికి కూతురు పుట్టిన సంగతి ఆయనతో ఓ అబ్బాయి క్లాసులో ఉన్నప్పుడే చెప్పడంతోటే, ఇంకో పిల్లాడు జయ్‌మనిలేచి, "అల్లాయితే నేను తెలుగుమేష్టార్ని మామగారూ అని పిలవాలిగావును" అన్నాడు. తెలుగుగంటకోసమే బోర్డుమీద తప్పుడురాతలు రాసి ఉంచేవాళ్లుంటారు. ఆ గంటలో అందరి జేబుల్లోనూ ఉన్న సరుకు కలపోస్తే, ఓ అల్పాహారవిందు చెయ్యొచ్చు. తెలుగు క్లాసులో దీపావళిఅమావాస్య, ఆక్రితం పౌర్ణమికి ప్రారంభించి తరవాత పౌర్ణమిదాకా ఉంటుంది.

ఆంధ్రదేశంలో ఉన్న ప్రతీ బడి తెలుగు మేష్టరుపట్లా సర్వత్రా ఈ స్థితి అక్షరాలా ఇల్లానే ఉంది గావును అనుకోడం పొరపాటు. కాని, పైన ఉన్న ఉదాహరణలు అసలు పేర్లు తీసేసిన యథార్థాలు గనుక, సూత్రించిన స్థితి అబద్ధం అనేసెయ్యడంకూడా పొరపాటే. ఇక, ప్రతీ సూత్రానికి లెక్కకొన్ని ప్రతిబంధకాలు ఉన్నట్టుగానే, తమరు బోధించేది దిక్కులేని తెలుగయినా తమరి యితర ప్రజ్ఞలు కూడా ప్రయోగించి ఇటు కుర్రాళ్ల మన్ననా, అటు అధికారుల ఆదరణా కూడా పొందిన అధ్యాపకులు కొందరు ఉండేవారు, ఉన్నారు. అందుకని, ఈస్థితి సిద్ధించడానికి తంటాలుపడ్డ వాళ్లని స్మరించుకోడం న్యాయం. వాళ్లేవళ్లూ, ఎంతమందీ అంటే, "పంచైతాని మహాబాహో". లేకపోతే, పెద్దలు సాధారణంగా అంటూండే "నా (నరు?) చేతను, నీచేతను, వరమడిగిన కుంతిచేత..." అనే ప్రాసతప్పు పద్యంలో లాగ చాలామంది!

ప్రతీపనీ చేసే చెయించో సాధారణంగా గైరుహాజరు అయిపోవడమే అభ్యసిస్తూంటాడు గనక సెందటేసుక్కాయి దేవుడు! దిక్కుమాలి కర్మం దేవుడికి తెలుగు రాదని తపస్చివల్ల కనిపెట్టినట్టు చెబుతారు మరి! నేర్చుగోడానికికూడా అతడికి తీరుబడి లేనట్టు వినబడుతుంది. తెలుగు వేరు, దేవుడి భాష వేరు. ప్రార్థన వగైరాలు తెలుగులో చేస్తే అతనికి ముట్టవేమో అని చాలామందికి భయం అందుచేతనే! తెలుగు గురించి దేవుడు ఇంకా ఏపుణ్యం కట్టుకున్నాడంటే, పురాణపురుషుల భాష. ఇది కాకుండా మరోటి అరేటట్టు చేసేశాడు. కృష్ణుడూ తెలుగు వాడు కాడు, రాముడూ తెలుగువాడు కాడు. ఒకవేళ కృష్ణుడికి గుజరాతీ కాక హస్తినాపురసంబంధంవల్ల హిందీభాషానూ, రాముడికి హిందీ కాక లంకాద్వీప సంబంధంవల్ల అరవభాషానూ తెలిసేవేమో! అదీకాక, దేవుడు ఈ తెలుగుని ఎప్పుడు రాజభాషగా వెనకటి కాలంలో ఉండనిచ్చాడో మనం ఎరగంగాని, ప్రస్తుతంలో ఆపదవి దాని కివ్వనిసంగతి అందరికీ తెలుసు. ముందు ఎప్పుడో ఇస్తాడు గావును అనుకోనేటందుకు ఆధారాలుగాని, ఆఖరికి దారాలుగాని లేవు. అందుచేత ధనాధికార సంపదలుగల తెలుగువాళ్లచేత మన్నన పొందడానికి తెలుగు నోచుకోలేదు. ఇంకా ఆలోచిస్తే,

ప్రపంచఖ్యాతి పొందిన భారతీయకవుల హృదయాల్లో తెలుగుస్మరణ లేకుండా దేవుడు కట్టుదిట్టం చేశాడు. చూడండి, తెలుగువాళ్లు తమరియొక్క ప్రతీసందర్భంలోనూ అర్థం చూసుకోకుండా సగర్వంగా పాడుతూండే 'జనగణమన' అనే సర్ రవీంద్రబాబుగారి భారతదేశపుపాట! అందులో తెలుగుప్రమేయం లేదు. రాష్ట్రాల పేర్లల్లో (పాటయొక్క రచనవాటికి, అనగా ౧-౧-౧౯౦౧ నాటికి ఒరిస్సా అనేది వేరు రాష్ట్రం కాకపోయినా) 'ఉత్కల' ఉందిగాని 'ఆంధ్ర' లేదు. అది 'ద్రావిడ' అనే శబ్దంలో లీనం అయిఉండింది అని మనం అనుకోవాలి — పప్పు సాంబార్‌లోలాగ! నదుల పేర్లల్లో 'గోదావరి' లేదు; కాని, 'గంగా' 'యమునా' కూడా ఉన్నాయి! ఇంకా చెప్పాలంటే, తెలుగు అక్షరసముదాయానికి రూపంలో పూర్ణత్వమున్నా (లలిత ముక్తాఫలాకార విలసనము — అంటాడు తెనాలి రామకృష్ణుడు), ఉచ్చారణలో మృదుత్వమున్నా ఇచ్చినా, వ్రాతలో మితత్వంగాని, నిశ్చితత్వంగాని, సమగ్రతగాని, సంక్షిప్తలేఖనావేగానికి వృద్ధిగాని భగవంతుడు ప్రసాదించలేదు.

రెండోకారణం అధికారులు. అధికారులంటే గవర్నమెంటు కాదు — వారికి ఉండే గొడవల్లో ఈ తెలుగుగొడవ ఎందుకు? అయినా, వాళ్లు తెలుగువాడిమీద కర్తవ్యం పెట్టకుండా తెలుగుకద్దివం ఏదీ పెట్టరు. మరి అధికారులంటే ఎవరు? విద్యాశాఖలో తెలుగుతరఫున ఉండే పాలకవర్గంలో సభ్యులు. దిక్కులేని తెలుక్కి వాళ్లనే అధికారులు అనుకోవాలి. సాధారణంగా వారిలో ఆంధ్రేతరులు ఉండవచ్చు. వాళ్లని గురించి కష్టంగా ఏమీ అనరాదు. ఏమంటే వాళ్లది తెలుగు కాదు. ఆ అధికారుల్లో ఒకరకం తెలుగువారుండవచ్చు. వాళ్లల్లో చాలామందిని ఏమనీ లాభం లేదు. వాళ్ల మాతృభాష తెలుగైనా దానియందు వారికి ప్రవేశంగాని, వాత్సల్యంగాని ఉండవు. వాళ్లు పుణ్యవశంచేత తెలుగురాని తెలుగువాళ్లవడంచేతనే ఆ అధికారపదవి అందగలిగిఉంటారు. ఇక, ఆ అధికారుల్లోనే తెలుగులో ప్రావీణ్యత ఉండి తెలుగుమీద ప్రసన్నత గలిగినవాళ్లు కొందరేనా ఉండితీరతారు అనుకుందాం. అటువంటివారు ఏకాకులవడంచేత స్వతంత్రించి ఏదేనా తెలుగువిషయం సంస్కరణ ఉద్దేశించినట్టాయినా, చేతులోఉన్న ఆ కాస్త అధికారంకూడా అమాంతంగా ఎక్కడ లేచిపోతుందో అనే భీతిగలవాళ్లవడంచేత, వాళ్లవల్లకూడా తెలుక్కి ఏమీ ఆదరణ జరుగుతూండదు కాని, అటువంటివాళ్లవల్ల స్వల్పమైనటువంటి మార్పులు కొన్ని సూచింపబడచ్చు, పైవారికి డబ్బు లగులుబాటు లేకుండాఉంటే అవి ఆచరణలోకి కూడా దిగవచ్చు. అయినా, తెలుగుమేష్టరు జీతం ఇంగ్లీషుమేష్టరుజీతంలో సగంకూడా ఉండదు, కాని అతనికి రెండుభాషలు రావాలి, సర్వీసుకూడా రెట్టింపు ఉండచ్చు. ఇంగ్లీషుపాఠం ఎన్నిగంటలు చెబుతారో అందులో సగంగంటలు తెలుగుపాఠం. ఇంగ్లీషుపాఠం పేపరు ఒకటికి దిద్దినందుకు ఎంతిస్తారో అందులో సగం తెలుక్కి. దినచర్యలో పాఠక్రమం నిర్ణయించేటప్పుడు తెలుగుపాఠాన్ని చివరగంటలకి పారెయ్యచ్చు — ఎంచేతంటే పిల్లలు అప్పటికి విసిగిపోతారు గనక తెలుగు నేర్చుకోడానికి సరిదైనస్థితిలో ఉంటారు. స్కూలుఫైనలు ఇంగ్లీషుపఠనగ్రంథం చివర, ఇటీవల, టీక ఉండటంలేదు. కాని, తెలుగుపఠనగ్రంథం చివర టీక నేటివరకూ ఉంది. ఊరికే ఉండడమే కాకుండా అసలుకంటె ఎక్కువగాఉంది. పైగా మరోటి, ఏటేటా విశేషమైన సామగ్రితో పెరిగిపోతోంది. ఆంగ్లభాష తెలుగుజాతివిద్యార్థులకి అందరికీ గర్భగ్రాహిగా వచ్చునని, తెలుగుచెప్పే మేష్టర్లకిమాత్రం తెలుగు రాదని అధికారులభయం అయిఉంటుంది. ఇంగ్లీషుపాఠాలకి టీక, చివర వేస్తే, ఆటీక చదివేసుకుని ప్రతీ కుర్రాడూ క్లాసులోకి సులువుగా వస్తాడట, దాంతోటి ఇంగ్లీషుమేష్టరు చెప్పడానికి ఏమీ ఉండదుట! అదీకాక, కుర్రాళ్లంతా ఆ చివరటీక కంఠతా పెట్టేసి రామచిలకలలాగ పరీక్షల్లో ప్లేటువేసేసి, మూర్ఖులైపోయి, ప్యాసైపోతారట! పైగా, ఆటీకలో ఉండగలట్టి ముక్కలు, కుర్రాడు, నేరుగా ఇంగ్లీషుచెప్పే మేష్టరునోటంటనే విని, అవన్నీ ఆయన తన అపూర్వాఖండ మేధాసంపత్తివల్ల ఆసువుగా విశేషార్థాలేమిటి, పూర్వగాథలేమిటి, వ్యాకరణ విశేషాలేమిటి, చూసీ చూడగానే ఊహించి చెబుతున్నారని అనుకోడానికి

బీలు చెడిపోతుందేమో అని భయంట! ఈ సబబులు తెలుసుపరచవ గ్రంథంగురించి లేవుట. ఇంగ్లీషు ప్రశ్నపత్రంలో కుర్రాడు కనివిని ఎరగని పద్యరచనని వ్యాఖ్యానం చేయమని, భూసగుచ్చినట్టు వాడి స్వంత ఆంగ్లంలో చెప్పవలిసిందని అడిగే ప్రశ్నలు ఉండవచ్చుట. తెలుగు పేపరులో అటువంటిపనులు, ఎవరో కూడదుఅని ఉంటారా, లేవు. ఇంగ్లీషులో ఉత్తరాల మకిలబులన్నీ రావాలిట, తెలుగులో, వచ్చి లాభం ఏమిటని గావును, అక్కర్లేదు. ఇక భాషానువాదం ఇంగ్లీషులోంచి తెలుగులోకి మాత్రమే ఉంచారు, ఆ మార్కులు పట్టిగల్లి తెలుగులో కలిపెయ్యమన్నారు. ఇంగ్లీషులో ప్రజ్ఞ ఉంటే తెలుగులో ఉందన్నమాటే! ఆంగ్ల భాషేతర పాఠాలన్నీ తెలుగులో కానియ్యవలిసిన ఈ రోజుల్లో ఆంధ్రభాషా వ్యాపారం ఏమయిందీఅంటే, పరిభాషల నిమిత్తం అదనంగా సంస్కృతంకూడా ప్రవేశించి గురుశిష్యులకి ఒక్కరవ్వ ప్రాణంమీదికి తెస్తోంది. అది యిక్కడ అప్రస్తుతం.

సరి, శాస్త్రంచెప్పినట్టు, మూఢోకారణం తనే. మామూలుగా తెలుగు మేష్టరికి రావలిసింది ఇంగ్లీషు కాదు గనక రాదు. కుర్రాడికి కొన్ని ఎంగిలిముక్కలు వస్తూ పోతూఉంటాయి. అల్లాంటివి రానివాళ్లని చూస్తే కుర్రాడికి నిరసన. తెలుగు మేష్టరికి సంస్కృతం రావాలి, వస్తుంది. ఎంతవరకూ అంటే, తెలుగువాళ్ల నోరు మూసేటందుకు సరిపోయే ఉంటుంది. ఆ సంగతి కుర్రాడికి మరీకోపం. తెలుగు మేష్టరు సంస్కృతం వాడక మానడు. అది కుర్రాడికి ఎంతోమంట. ఒకొక్క తెలుగు మేష్టరికి కేవలం సంస్కృతంమాత్రమే వస్తుంది. అతడు తెలుగులో పుస్తకాలు ఏమీ చూడకుండానే వాటిలో ఏమీ లేదని గ్రహించి మరివాటిని చూడనిరకం. ప్రమాణ లక్షణలక్ష్యాల్లో ఏంకావలిసినా సరే బలువు కోసం అతడు సంస్కృతంలోంచే యిస్తాడు, పుచ్చుకుంటాడు, తెలుక్కి అంటగట్టి రుద్దుతాడు. అతడు తెలుగుగురించి కుర్రాడికి ఆసక్తి పుట్టించడు, ఆవేశం ఎత్తించడు. ఒకొక్కడు నవీనవిజ్ఞానం జ్ఞానంలో చేరదంటాడు. ఒకొక్కడు తెలుగులో ఏ పూర్వకవులున్నా వాళ్ల పాండిత్యం స్మరించి 'సరే'అని ఒప్పుకుంటాడు. బతుకున్న వాళ్ల (అతని ఉద్దేశంలో) మృతవత్తపు పుస్తకాలు ఏపరుసవేదివల్లో పఠనగ్రంథాలుగా మారిపోయి అవి తనే చెప్పవలసిన ప్రారబ్ధం తనికి పడితే, ఒకొక్క తెలుగు మేష్టరు అవి నేలెట్టి కొడతాడు గాని పాఠం చెప్పడు. తెలుగు మేష్టరు భాషాసంస్కారంకోసమే పాకులాడతాడుగాని, కుర్రాళ్లలో నవ్యభావోదయం కలగటానికి ఆలోచన చెయ్యడు. అలాంటివాడు పాఠం చెప్పేటప్పుడు మొదట్లోనూ మధ్యా చివరామాత్రం పురాతనవ్యాకరణ - లేక ఆదివ్యాకరణ - దస్తరం విప్పడం అన్నమాట. అతడి పరమావధి పాతవ్యాకరణాన్ని అనుసరించడమే! వ్యాకరణం భాషకి అస్థిపంజరంవంటిది అవడంవల్లా, పైగా అది లాభంఉండని తెలుగుతాలూకు వ్యాకరణం అవడంవల్లా, ఒకొక్క వ్యాకరణమాత్రం వినకున్నప్పుడల్లా డోక్కుని, కేర్చుగోమన్నప్పుడల్లా హాలోమని గోలెత్తుతాడు, ఆంధ్రవిద్యార్థి! తెలుగు మేష్టర్లు ఇటీవల బాగా ఇంగ్లీషు తెలుసుకుని వ్యవహరించేవారు ఉన్నా, ఇంగ్లీషుని నిలువునా చీరి మాట్లాడేవాళ్లూ ఉన్నారు:— "ఆఫ్టర్ ఐ ఎక్స్ప్లనేషన్ యూ, నాట్", "ఐ ఫైన్ యు ఫై యాన్ఫోర్", "వై డుయ్యూ లేట్", "వై దు యు టాకి మీ వెన్ ఐస్పీచ్ హిం" మాదిరిగా ఉండే వాక్యాలు కుర్రాళ్లతో జరిగే టప్పుడు హాస్యరసం వచ్చితీరుతుంది. ఒక కుర్రాడు కుడిచేతి చిటికెనవేలు చూపించినప్పుడు అప్పటికి వెళ్ల మనటానికి ఓఆయన "వెళ్లపోయ్ కుంకా" అనడానికి "గానెవే ఫూల్" అనేవాడు. ఆమాత్రం జాతిభావ ముక్కలూ తెలియక ఏకేవా ఇంగ్లీషు నోటీసు వస్తే ఒకణ్ణి చదవ మనడం, వాడు తనచిత్తంవొచ్చినది వల్లించి అక్కడ ఉన్నదానికి అర్థం అనడం, చివరకి పైవారు తెలుగు పండిట్ని కబర్దారుగా ఉండమన్నారని ముగించడం. ఒకొక్క మేష్టరు తన కుర్చీని శ్రద్ధతో తను అలంకరించకపోడంవల్ల చాలా గలిభీ జరుగుతుంది. పిల్లమూక గల్లంతులో పడ్డప్పుడు బల్లమీద తడేబాదుతూ, "ఇదే మాటో తెలుసా! మీపిర్రమీద వాత" అనేవా డొక మహానీయుడు. దాంతో వాళ్లు మరీ కూసేసరికి ఆయనకి మరీ కోపం వెచ్చి అందర్నీ బెంచి యెక్కమనడానికి "గెటప్ బెంచ్" అని ఆయన

అనగానే సాయంపట్టె తెంచీలన్నీ చేతులమీద నిల బెట్టేవాడు. మరో మేష్టరు కుర్చీలో జోగి పోతూ పాఠం చెబుతాడు. అప్పుడు ఊహాగల పిల్లాడెల్లి తనటోపీ (అప్పుడు ధరించకపోతే దండించేవారు) ఆయనకి విసరడం—బుట్టమూకతో పడగెత్తిన పాముకి విసరడం జ్ఞాపకం వచ్చి! ఒకొక్క తెలుగు మేష్టరు పేపర్లు దిద్దితే అంతా ప్యాసే! అదేమిటంటే, అహింసా తత్వం అని సమాధానం. లేకపోతే ఐ. సి. యస్. లో లాగ కావలిసినంతమంది ప్యాసు! వ్యాసరచనలో విషయం 'సత్యం' అయినప్పుడు ఒకవేళ విద్యార్థి 'గాంధీజీ' గురించి రాసినా, వాడి ఉద్దేశం మంచిది, ప్రజ్ఞకనపరిచాడు, పండితా స్సమదర్శినః అన్నాడు అని మార్కులు యావత్తూ బేబాకీగా ఇచ్చేసేవాడు. ఒక తెలుగు మేష్టరికి దయారసం విస్తారం అవడంచేత పరీక్షావస్థలో కుర్రాళ్ల ప్రాణాలకి తన ప్రాణం అడ్డేసి, ఒకడు రాసిన కాగితం ఇంకోడికి తనే అందించి పుణ్యం హస్తగతం చేసుకునేవాడు. రెండోకంటివాడికి తెలియ కుండా జాగ్రత్తగా కాపీ చేసుకోమని ఓ ఆయన కోప్పడే వాడు. ఒకొక్కరు కుర్రాడిమీద కోపంవచ్చి, ఆగ లేక, తను వాణ్ణి శిక్షించక, పైకి రిపోర్టు చెయ్యడానికి బయల్దేరి, మధ్యదారిలో కుర్రాడు "మేష్టారండి, మేష్టారండి" అనేసరికి కరిగి తిరిగి వెళ్లిపోడంలో "వింధు మనంబు నవ్య..."స్ఫురణకి తెస్తారు. ఇటీవలివారిలో తెలియదుగాని, కొత్త పూర్వంవారిలో, ఏయిద్దరు ఒకచోట చేరినా, కొత్తరికంలో మిక్కిలి పొత్తుగా ఉండి, వారం పదిరోజులయేసరికి, వీరికి రామశబ్దం రాదని వారూ, వారికి గుణింతాలు రావని వీరూ దెప్పేసు కునేవారు. పరీక్షలనేవి ఏవీ అప్పట్లో లేకపోవడంనించి (పరీక్షలవల్ల పాండిత్యాలు ఎల్లా నిర్ణయింపబడుతు న్నాయో చూస్తూనే ఉన్నాం!) ఎవరి కెన్ని తెలివి తేటలున్నాయో తెలుసుకోడానికి మరోమార్గం కని పించక, వాళ్లు వాగ్వాదన లగాయతు అవాచ్యాల ద్వారా మల్లయుద్ధాలవరకూ వెళ్లేవారని తెలుస్తుంది. వారి వైషమ్యాలు జన్మజన్మకీకూడా నిల్చిపోయే తారాకాణలు కనిపిస్తూండేవి. కుర్రాడు ప్రశ్న ఏదేనా తప్పిపోయినప్పుడు ఒకొక్క మేష్టరు, "నువ్వు నిరుడు ఆ వెనకదగ్గిర తెలుగు అహోరించి వచ్చావ్ కాదూ! ఆ వెనకకి తెలుగెంత వచ్చి చచ్చిందో, నీకూ అంతే రాక చచ్చింది!" అనడంకూడా వినిపించేది.

నాలుగోకారణం విద్యార్థులే అవడం తప్పేకాని, తప్పదు. విద్యార్థుల్లో కొందరు విద్య అర్థించనివాళ్లు ఉండవచ్చు. కేవల దురాలోచనగాని, దూరాలోచన గాని చిన్నమనస్సుల్లో వేంచేసి ఉంటుం దనుకోడం అమానుషం. శిష్యపాపం గురు ర్వ్రజేత్ అని కదా అంటారు. తెలుగుదేశపు విద్యార్థి తన హృదయప్రతినిధియైన తెలుగుయొక్క స్వరూపాన్ని తనకి అవగాహనలోకి తెచ్చేవాళ్లని తను ద్వేషించి నా, హింసించినా, దూషించినా, తిరస్కరించినా, చప్పరించినా, నిరసించినా అది మాతృద్రోహం కాక పోయినా తప్పకుండా ఆత్మద్రోహంకిందికీ, తద్వారా దేశద్రోహంకిందికీ వస్తుంది కాబట్టి హాస్యాస్పదం అనడం కంటే దాన్ని శోచనీయం అనడం న్యాయంగనక నున్నా, చిన్నవాళ్లకి నిందావిషయాల్లో వాటా చిన్నది గానే ఉండితీరాలని అనుభవశాలురు మధ్యవర్తిత్వంచేసి చెబుతారు గనకనున్నా ఈ ఉపవిషయం ఆపేస్తాను.

ఐదోకారణం తెలుగువిద్యార్థుల తండ్రులు- అనగా తెలుగునాయకులు. తనకొడుకు ఒక్క తెలుగులో మాత్రం విద్యార్థిదశలోనే తెగపండితుడైపోవాలని ఏ తెలుగుతండ్రీ కోరుకోడుగదా! సరిగదా, ఒక్క తెలుగు మినహాయించి ఏ యితర అంశంలోనేనాసరే, పాండిత్యంమాట దేవుడికి తెలుసును, ఆఖరికి ప్రవేశ మైనా సరే లేక-చివరకి స్పర్శఅయినా సరే ఉంటే పోనీ కొంతనయంగదా అని సరితపించుతాడు. అసలు కుర్రాడి నిమిత్తం ఎప్పుడైతే తమరు ఫీజు కట్టేసి వాణ్ణి సాలుకి ౧౮౦ రోజులుమాత్రం—అందులో రోజుకి ౫ గంటలు మాత్రం—బడికి పంపిస్తారో, ఆ దెబ్బతోటి కుర్రాణ్ణి కాయడంపూచీ చీదాగా తమకి వదిలిపోయి, అక్క డితో వాడియొక్క శరీరాభివృద్ధీ, మనోవికాసమూ కలగడమే కాక వాడికి గుణశీలాలూ, సదభ్యాసాలూ, ధైర్యసాహసాలూ, మానమర్యాదలూ, ఔదా ర్యాలూ, సత్యధర్మాలూ పట్టుబడడం కుర్రాడు స్కూల్లో ఉండని ౧౯ గంటల కాలంలోకూడా కావచ్చునుగదా అనేమాటేనా ఒప్పుకోక, కుర్రవాడు ఒక వేళ ఫేలయితే

ఆ సంగతియొక్క ధ్వని తమరింటికి వినపడేవరకూ వాడి సంగతి నమస్కరంతిగా చూసి ముఖ్యమైన ఇతరపన్నల్లో లీనమై ఉండేవాళ్లు, వ్రాడికి తెలుగు వచ్చిందో వచ్చిందో, అదంటే వాడికి సరదాగాఉందో పరదాగా ఉందో కనుక్కుంటారా? చదువుకున్న తండ్రులైనా తాము తెలుగుని మన్నిస్తారా! తెలుగుభాష నిశ్చలం ఎంతవరకైందో, చంచలంగా ఎంతవరకుందో చూస్తారా! ఎవరెవరి తెలుగుమాటల సందేశంవల్ల తెలుగుమనుష్యులపేరు నిల్చిందో గమనిస్తారా! గమనించుకోమని కొడుకుతోనేనా చెబుతారా! కొడుక్కి పోనీ ఆ వేమన "ఉప్పుకప్పురం" అనుకోండి, ఆపోతన "కరసింహో సవసై" అనుకోండి బ్రహ్మోపదేశం చేస్తారా! పెద్దబాలశిక్షేనా వచ్చేటట్టు చేస్తారా! కొడుకు తెలుగుపద్యాలు కంఠపాఠం చేస్తే పద్యానికి ఓకానీచొప్పునేనా ఇస్తామని నిలవకడతారా! సుగమం, మధురం, ఆకర్షణీయం, హృద్యం అయిన తెలుగుపద్యపాదాలు ఏరి, వారితో కలిసి మననంచేస్తారా! అటువంటి రత్నాలు గల పుస్తకాలు కొని వారికిస్తారా! తెలుగుని ఘంటుకోనక్కర్లేదని వాదించే తండ్రులు తక్కిన తెలుగుపుస్తకాలు తనవాడు కొనుక్కున్నాడో లేదో కనుక్కుంటారా! తమ తాత ముత్తాతలనాడేనా బలవంతం కాకుండా హృదయపూర్వకంగా తెలుగుకి రూపాయలు తెచ్చే విలువ ఉండేదని విన్నారా! లేక తమవాడు తమరు చూశారా! హృదయాన్ని అంటిపెట్టుకుని ఉండే భావాలు ఇతరులకి తెలియపరచడానికి తల్లిభాష తప్ప తక్కినవి బుద్ధిప్రజ్ఞవల్ల తెచ్చిపెట్టుకున్న బాపతు బాబుల్లారా అని కొడుకులకి చెబుతారా! ముందు తమరు నమ్ముతారా!

తెలుగుదేశపు ఇంగ్లీషుబళ్లో తెలుగుమేష్టరు స్థితి, తెలుగుస్థితి! అనగా, తెలుగుదేశంస్థితి! అనగా, తెలుగువాళ్లస్థితి! నా కవడేనా గురువు అనేవాడుంటే వాడు నాహృదయం వికసింపజేసి నాపూర్వుల హృదయాలన్నీ వాళ్లమాటలద్వారా నాలో లీనం అయేటట్టు నాకు తెలుగు చెప్పినవాడే అనేటంతగా తెలుగు విద్యార్థిహృదయం (అది ఉం దని అంటారు గనక, పవిత్రం అని అంటారు గనక) మారాలి. ఉన్నస్థితీ, ఉండవలసినస్థితీ కొంచెం ఎడంగా ఉన్నాయి—ఒకటి దక్షిణధ్రువం, రెండోది ఉత్తరధ్రువం! అయినానరే మార్పురావచ్చు! ఇప్పుడు ఆంగ్ల భాషేతరపాఠాలన్నీ తెలుగులోనేగా! 'రెండోభాష' ఏదవుతుందో!!

---

# పాలికాపు

= శ్రీ పురిపండా అప్పలస్వామి =

నేను —

రేయి జడలోపూలు
రాలిరాలకమున్నె
తొలికోడి మలికోడి
కూసికూయకమున్నె
ప్రియురాలి కనుముద్ర
వీడివీడకమున్నె
ఎటకోయి నీ పయన
మెవరోయి నీవు!
కనుల కాటుక రేఖ
కరగిపోనేలేదు
పెండ్లి పసుపుల పూత
చెరగిపోనేలేదు
తొలికవుంగిలిపసిడి
తళుకు మాయనెలేదు
మునికోల సీకేల
ఈపయన మేల?

అతడు —

పాలికాపును నేను
బందెబానిసను
మంటిలో నాబ్రతుకు
మంటిలో పాట
మంటిలోనే వెతలు
మంటిలో కతలు
కడిపె డాకలికొరకు
కవళమ్ముకొరకు
పెల్లియొడి దిగజారి
నడక నేర్చిననాడె
నాతోడుమునికోల
నాబ్రతుకునీడ
పాలికాపును నేను
బందెబానిసను
వేకువల పయనమై
మునిమాపుదాక
మంటిలో నాబ్రతుకు
మంటిలో పాట
పాలికాపును నేను
బందెబానిసను.

వ్యాస మీమాంస

# బైచరాజు వేంకటనాథుఁడు

= శ్రీ డా. నేలటూరు వెంకటరమణయ్య =

గతజ్యేష్ఠమాసభారతియందు మిత్రులు డాక్టరు చిలుకూరు నారాయణరావుపంతులుగారు "పంచతంత్రము, వెంకటనాథ నారాయణకవుల అనువాదాలు" అను శీర్షిక క్రింద నొక విమర్శనాత్మక వ్యాసమును వ్రాసి ప్రకటించియున్నారు. అందలి సారాంశమిది:—"పురాణములమీఁదను, శృంగారప్రబంధములమీఁదను ఆంధ్రుల కెక్కుడు ప్రీతి యుండుటచేత పంచతంత్రము తెలుఁగులోనికి వచ్చుటకు ఆలస్యమాయెను. క్రీ. శ. ౧౫-వ శతాబ్దాంతమున నుండిన దూబగుంట నారాయణకవియు, ౧౬-వ శతాబ్దమధ్యమున నుండిన బైచరాజు వేంకటనాథుఁడును దీనిని మొదట తెనుఁగులోని కనువాదము సల్పిరి. వీరిద్దఱును ఇంచుమించుగా సమకాలీనులు! వెంకటనాథుని కవిత్వము నారాయణకవి కవిత్వముతోఁ దులదూఁగఁజాలదు. అనౌచిత్యాదిదోషములు అనేకము లతని పంచతంత్రమునఁ గానవచ్చుచున్నవి. చీపురు పాపురు పుల్లలఁ జేపలబుట్టల్లినట్లు జెప్పెడి యూతని కాపుకవిత్వపు మాటలు ఆకాలపుఁ బాపన కవివరుల చెవులకుఁ బ్రమదమిడలేదు. కావున వారు వేంకటనాథుని కవనమును నిరసించి నారాయణకవిని గొనియాడిరి. అందు కాగ్రహించి వేంకటనాథుఁడు దన పంచతంత్రపీఠికయందు నోరార నారాయణకవినిదూషించెను. పంచతంత్రమును బద్యకావ్యముగ వ్రాయుట ఇద్దఱుకవులకును సామాన్యమైన తప్పే; కాని యాకాలమునఁ బద్యరచనయే గణుతికెక్కియుండినందున వీరిద్దఱును క్షంతవ్యులే. వెంకటనాథుని గ్రంథమున ననౌచిత్యదోషము బహుళముగాఁ గానవచ్చుచున్నది. సంస్కృతపాండిత్య ప్రకటన పరాయణుఁడై మొదటియాశ్వాసమున నిరర్థకసమాసములను, మఱియు నిట్టి యన్యదోషములను దొరలించెను. మొత్తముమీఁద నారాయణకవి కవనమే మేలు." మఱియు వ్యాసవిషయమునకు విశేష సంబంధము లేని వెంకటనాథుని జన్మదేశప్రస్తావన కొంత కలదు. "వెంకటనాథుఁడు నెల్లూరివాఁడు కాఁడు. అతఁడు కృతి యిచ్చిన హరిహరనాథుఁడు నాచనసోమన కృతి యిచ్చిన హరిహరనాథునివలెనే తిక్కన కృతి యిచ్చిన నెల్లూరి హరిహరనాథస్వామి కాఁడు."

మొదట వెంకటనాథుని జన్మదేశమునుగూర్చి కొంత చెప్పెదను. గ్రంథముయొక్క పీఠికలో నిట్లు వెంకటనాథుఁడు వ్రాసియున్నాఁడు:

క. "ఏచనవుగలదు హరిహర
సాదివ్యము నొంద నవ్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచన సోమునకు మఱియు నాకుం దక్కన్."

ఈ పద్యమును నారాయణరావుగారు చక్కఁగ నన్వయము చేసికొనక వెంకటనాథ నాచనసోము లంకిత మొసఁగిన హరిహరనాథుఁడు తిక్కన యంకిత మిచ్చిన నెల్లూరిలోని హరిహరనాథుఁడు కాఁడని చెప్పినట్లు తోఁచుచున్నది. ఈ పద్యమున వెంకటనాథుఁడు ఏ హరిహరనాథునికిఁ దిక్కన నాచనసోమన లంకిత మొసఁగిరో యా హరిహరనాథునికే తాను నంకిత మిచ్చితినని చెప్పుచున్నాఁడు. తిక్కన నాచన సోమన లంకిత మిచ్చిన హరిహరనాథులు వెంకటనాథుని హరిహరనాథునికంటె భిన్నదైవములయినచో నతఁడు వారి నీసందర్భమునఁ దనతో జోడించి పేర్కొనుటకుఁ గారణ మగపడదు. నారాయణరావుగా రీవిషయమై యభిప్రాయభేదము గలదని చెప్పియున్నారు. అట్టి యభిప్రాయభేదమున కెంతమాత్రమును ఎడము లేదని నేననుచున్నాను. తిక్కన నాచనసోము లంకితమిచ్చిన హరిహరనాథునికే తాను నంకితము చేసితినని వెంకటనాథుఁడు స్పష్టముగఁ దెలియఁజేయుచుండఁగా నారాయణరావుగారి యభిప్రాయభేదమున కవకాశ మేది? ఆంధ్రదేశమున నెల్లూరునందుఁ దప్ప మఱియెచ్చటను

హరిహరనాథుఁ డుండినట్లు సాక్ష్యము లేదు. కావున వేంకటనాథుఁ డంకిత మిచ్చినది నెల్లూరి హరిహరనాథుని కనియే చెప్పవలసియున్నది. మఱియు వేంకటనాథునికి నెల్లూరితో సంబంధ ముండెనని గ్రంథాంతర్గత సాక్ష్యమువల్ల విశదపడుచున్నది. మిత్రభేదమునందు నక్కభేరీల కథను వెంకటనాథుఁ డిట్లారంభము సేయుచున్నాఁడు:

క. "దమనకుఁ డిట్లను పరవి
క్రమవిక్రమసింహపురనికటవటకాంతా
రమున నొకనాఁడు గాథ
క్రమమున జీవరిగి తిరుగఁగాఁ గ్రొత్తైమురక్."

(౧-౧౭౬)

విక్రమసింహపుర ప్రస్తావన సంస్కృత పంచతంత్రమునఁ గానరాదు. నారాయణకవి 'కలహాభూమిని' పేర్కొనియెనే కాని విక్రమసింహపురము పే రెత్తలేదు (౧-౧౪౮). భానయయు "ఒక్క భగ్నవాహినీసమీపస్థలంబునఁ గ్రుమ్మరుచు నొక్క వాతాహత భేరీనినాదం బాకర్ణించి" యని కథ నారంభము చేసెనేకాని విక్రమసింహపురమును దలపెట్టలేదు. ఇందువల్ల వెంకటనాథుఁడు విక్రమసింహపురమును ప్రయత్నపూర్వకముగ నీ కథలోనికి జొప్పించె నని తెల్లమగుచున్నది. ఆంధ్రదేశమున ప్రఖ్యాతనగరము లెన్నియో యుండ నన్నిటిని వదలి విక్రమసింహపురముపైఁ జూపిన యీ పక్షపాతమునకుఁ గారణమేమి? నారాయణరావుగా రేమందురో కాని నాకుఁ జూడ నా పట్టణము వెంకటనాథుని జన్మదేశమైనను గావన్నను దానితో నతనికి గాఢమైన సంబంధ మెద్దియో యుండెనని తోఁచుచున్నది. రాయిగుద్దినట్లు వెంకటనాథుఁడు నెల్లూరివాఁడు కాఁడని చెప్పుటకు నాకు సాహసము చాలకున్నది.

ఇఁక వెంకటనాథుని గ్రంథవిషయమై నారాయణరావుగారి విమర్శను పరామర్శించవలసియున్నది. వీరి విమర్శ సక్రమమైన దని నా బుద్ధికిఁ దోఁచలేదు. కావున నీ విమర్శనమున వీరు ప్రచురపఱచిన యభిప్రాయముల నించుక వితర్కించవలసివచ్చినది.

౧. పంచతంత్ర మాంధ్రభాషలోనికి వచ్చుటకు నారాయణరావుగా రనుకొనినంత యాలస్యము గాలేదు. మొదటి యాంధ్రీకరణము కాకతీయయుగ చరమదశయందు నడిచె ననుటకుఁ గొంత యాధారము గలదు. క్రీ. శ. ౧౪—వ శతాబ్దోత్తరార్ధమున వర్ధిల్లిన మడికి సింగన యను ప్రాచీనకవి సకలనీతిసమ్మత మను నొక రాజనీతిగ్రంథమును విరచించెను. ఇది యొక సంకలనగ్రంథము. తత్పూర్వవిరచిత ప్రాచీనతరాంధ్ర గ్రంథములు పెక్కు ఇందుదాహృతములై యున్నవి. వానియందు పంచతంత్ర మొకటి. యత్కృతమో చెప్పుటకు వీలులేదు. సకల నీతి సమ్మతమును బరిష్కరించి ప్రకటించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఈ పంచతంత్రమును గూర్చి యిట్లభిప్రాయపడుచున్నారు: "సకల నీతి సమ్మతమునఁ బంచతంత్రి పేర నుడివిన గ్రంథము లభింపదయ్యె. కర్త పేరు తెలియంగ సాధ్యము గాదు. ఈ కవి లభించుచున్న పంచతంత్రముల కర్తల కంటెఁ బ్రౌఢుఁ డని వేంకటనాథాదులపద్యములఁ బోల్చిచూచిన తెలియంగవచ్చును." కవిగారి యభిప్రాయము కర మంగీకార్యము.

ఇతనికిఁ దరువాతఁ బంచతంత్రమును దెనుఁగు సేయఁ గడఁగినవాఁడు దూబగుంట నారాయణకవి. శ్రీ నారాయణరావుగా రితనిచరిత్రను వలయునంత విపులముగఁ దెలిపియుండుటచేత దాని నిచ్చట మరల వర్ణించ నవసరము లేదు. అటువెనుకటి యాంధ్రీకరణ కర్త భానయ. అతఁడు శ్రీకృష్ణదేవరాయల సమకాలీనుఁడు. విజయనగరవాస్తవ్యుఁడు. స్వవిరచిత పంచతంత్రమును సంగీత సూర్యోదయ గ్రంథకర్తయు, రాయలనగరికరణములలో నొక్కఁడును నైన భండారు లక్ష్మీనారాయణున కంకితమొనర్చెను. కవిత్వాతిశయమున నితఁడు నారాయణకవికిఁ దీసిపోవువాఁడు కాఁడు. ఇతని గ్రంథ మింకను ముద్రితము కాలేదు. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున వ్రాఁతప్రతి కలదు.

భానయకు వెనుకటి యాంధ్రానువాదకుఁడు వేంకటనాథుఁడు. ఇందువల్ల వేంకటనాథునికి పూర్వము పంచతంత్రమును తెనిఁగించినవారు నారాయణకవిగాక మఱియిరువురు గలరని తెల్లమగుచున్నది గదా. వేంకటనాథుఁడు తన పంచతంత్రపీఠికయందుఁ దూలనాడినది యాంధ్రీకృత పంచతంత్ర కర్తను,

పతనిని స్తోత్రముచేసిన యన్యకవులనే యని వాదమునకై యొప్పుకొనినను ఆపంచతంత్రకర్త నారాయణకవియే యని చెప్పుట కెట్లు వీలగును? నారాయణకవియు, వెంకటనాథుడును ఇంచుమించుగా సమకాలీనులగుటచేత వెంకటనాథుడు దూలనాడినది నారాయణకవినేయని నారాయణరావుగారివాదము. పదునేనవ శతాబ్దియంతమున నుండిన నారాయణకవియు, పదునారవ శతాబ్దమధ్యమున వెలసిన వెంకటనాథుడును ఇంచుమించుగా సమకాలికు లగుట యెట్లు? ఇంచుమించన పూర్వుడని యర్థమా? అగునేని పూర్వుడు సమకాలికుడగుట యెట్లు? నారాయణకవికి దర్వాతివాడు పదునారవ శతాబ్ద పూర్వార్ధమున నుండిన భావయ వెంకటనాథునికి నారాయణకవికంటె సన్నిహితుడుగదా. అతడును నారాయణకవిని బోలి శాపకవియేకదా. నారాయణరావుగారు ఊహించినట్లు వేంకటనాథుడు దూషించినది పంచతంత్రకర్తనే యనుట నిశ్చయమేని అట్లు దూషింపబడినవాడు భావయకవి యేల కారాదు?

కావున, నారాయణరావుగారి యూహ నిరాధారమగుటచే గ్రాహ్యము కాదు. వేంకటనాథుని పంచతంత్రపీఠికలోని 'ఒకఁ డలంకారంబునకు' మొదలైన పద్యములు ఒకరి నుద్దేశించి వ్రాయబడెనని తలచుట పొరబాటు. కుకవిదూషణ దీనికి బూర్వముండు 'రసవిస్ఫూర్తి గొంత' యను పద్యముతో సమాప్తి నందినది. ఇందు గావ్యరసాస్వాదనపరాయణుల యభిరుచులు భిన్నములని తెల్పబడినది. తరువాతి పద్యములో ఒప్పులు గల కృతిలో నొక తప్పున్నను లోపముగా బరిగణింపరాదని విజ్ఞాపన. అటువెనుక నాలుగుపద్యములయందు సకల కుకవినింద. ఒకవేళ నారాయణరావుగారు వాదించునట్లివియన్నియు కుకవినిందాత్మకము లైనను గావచ్చును. కుకవివర్గమున వేంకటనాథుడు తన ప్రతిస్పర్ధులను చేర్చియుండిన నుండవచ్చును. ఇందు విశేషమేమియు లేదు. ఆంధ్రకవు లందఱును పాటించిన మర్యాద ఇట్టిదే. వేంకటనాథుడు మాత్రము తన యస్థిపంజరమును విడిచి వెలుపలికి లంఘించగలడా? అట్లు లంఘించలేదని యతని దూఱుట దేశకాల స్థితులను విసర్జించి పరయుగప్రవేశము చేయజాలకపోయెనని తప్పుపట్టుట యగును. ఇట్టి మహిమ వాఙ్మయ యోగీంద్రులకు గలిగినఁ గలుగవచ్చుఁ గాని కవిమాత్రుల కసాధ్యము. కుకవినిందను విస్తరించి చేసినంత మాత్రముననే అది నారాయణకవి నుద్దేశించి చేసినదనికాని, కుకవులు సామాన్యముగ జేయు తప్పులన్నియు వేంకటనాథుడు తన గ్రంథమున నుండినట్లొప్పుకొనెనని చెప్పుట కాని తగదు.

౨. పంచతంత్రమును పద్యకావ్యముగ వ్రాయుట తప్పని శ్రీనారాయణరావుగారు తమ యభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. నారాయణ వేంకటనాథులు పద్యకావ్యముగ వ్రాసి తప్పొనర్చిరని వారి సిద్ధతని నిష్పక్షపాతబుద్ధితో ఖండించిరి; వారికాలపు గ్రంథకర్తలనుబోలి పద్యకావ్యమే ప్రశస్తమని తలచి వీరును తమ పంచతంత్రములను పద్యకావ్యములుగనే రచించిరని పెద్దమనస్సు చేసి క్షమించి విడిచిపెట్టిరి. వీరికి వెర్రిప్రేమలు తప్పినందుకు సంతోషమే! కాని పంచతంత్రాంధ్రీకరణవిధాన మిట్లుండవలెనని నారాయణరావుగారు చేసిన దీర్ఘోపన్యాసము అంగీకార్యమని నాకు దోచలేదు. పద్యకావ్యముగ రచించుట వలన వచ్చిన నష్టమేమో నాకు బోధపడలేదు. నీతిశాస్త్రగ్రంథము లెన్ని పద్యాత్మకములు సంస్కృతమున లేవు? పద్యాత్మకము లైనంతనే యందలి నీతులు విలువను గోలుపోయి దుర్గుణులై పరిణామమును బొందునా? కవులు వారికాలమున చెలామణియందుండిన వాఙ్మయాభిరుచుల ననుసరించియు, సమకాలీన పాఠకాదరణమును గోరియు గ్రంథరచనకు గడగుట సహజము. చచ్చినవారిని, బుట్టనివారిని వారు సరకుగొనరు. గ్రంథకర్త ప్రతిభావంతుడేని, పద్యాత్మకము గాని, గద్యాత్మకముగాని స్వవిరచిత గ్రంథమును రసవంతముగను, బ్రజారంజకముగను జేయగలడు. ప్రతిభాశూన్యుడేని యే పద్ధతి నవలంబించినను దాను వ్రాయగడగిన పుస్తకమును మృత్తికాప్రాయము సేయగలడు. కావున పంచతంత్రకర్తలకే కాదు గ్రంథరచయితల కందఱకును ప్రధానము ప్రతిభ. అది లేనివారు పద్యము వ్రాసినను గద్యము వ్రాసినను నొక్కటియే.

3. వేంకటనాథుని యనౌచిత్యములను కొన్నిటిని పేర్కొనియున్నారు నారాయణరావుగారు. అందు మొదటిది యష్టాదశవర్ణన. ఉదాహరణ: గ్రంథారంభమందలి పాటలీపుత్రముమీఁద సీసపద్యము ౧ అగ స్తరు సీసపద్యము. "కోటగోడలు, సౌధాలు, బ్రాహ్మణాలు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, వేశ్యలు, పుష్పలావికలు, మదపుటేనుఁగులు, గుఱ్ఱములు, రథములు; ఒక్కొక్కదానికి రెండేసి, మూఁడేసి పద్యాలుగా పెరిగినవి." ఇట్టి రాజును వర్ణించు సీసపద్యము లైదు, ఒక శార్దూలము, ఒక మత్తేభవిక్రీడితము. ఇన్ని పద్యాలు వ్రాయుట యెందుకు? అనంగా ననంగా నొకపట్నం; ఆ పట్నంలో నొకరా జని చెప్పిన నెంత ముచ్చటగా నుండెడిది" అని నారాయణరావుగారి విమర్శ.

అష్టాదశవర్ణనలు గ్రంథములయందుఁ జేయుట తప్పా? తప్పింపరాని యట్లు? ఇట్టి వర్ణనలు సేయని తెలుఁగుకవు లరుదు. స్వభావసిద్ధముగ నీ వర్ణనలఁ జేసిన నవి గ్రంథముల విలువను హెచ్చింపఁగలవు; కాని తెనుఁగువారికి అతిశయోక్తులు ప్రియతమములు. అతిశయోక్తి బహిష్కారపాత్రమేని తెనుఁగుకవుల గ్రంథములయం దతిశయసంఖ్య బహిష్కారార్హము లే. మొదట బహిష్కరింపఁదగినది శ్రీకృష్ణరాయ విరచితమగు నాముక్తమాల్యద. తెనుఁగు కావ్యములను విమర్శింపఁ గడఁగి యతిశయోక్తిని బహిష్కరింపఁబూనుట కంబళి యందు భుజించుచు వెంట్రుకల నేఱుట యగును.

ఒక్కొక్క విషయమును వర్ణించుట కిన్ని పద్యములా యని మఱియొక యాక్షేపణ. ఈ సందర్భమున ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకొనవలసిన యంశ మొకటి కలదు. కావ్యరీతులనుబోలి వర్ణనలును దేశకాలానుగుణముగ భేదించుచుండును. మన వర్ణన లాంగ్లేయులకు నచ్చవు; వారి వర్ణనలయెడ మనకును నట్టిభావమే కలదు. పూర్వకవుల పోకడలు మన భావకవులకు గిట్టవు. వీరి పద్ధతి రాఁబోవుతరమువారికి రుచించునేమో చెప్పుటకు వీలుకాదు. వర్ణనాసంగ్రహవైపుల్యములు కవుల మనస్తత్త్వముల ననుసరించి యుండును. కొందఱి కీషణ్మాత్రము సూచనచేసి విడిచిన సంతసము గలుగును. అనేకులకు విపులముగ వర్ణింపకుండినఁ దృప్తియుండదు. కాని యతిశయ విపులీకరణము వాచకులకు విసుగు పుట్టించును దోషమే యగును. అయినప్పటికిని గ్రంథవిమర్శనకుఁ గడఁగువారు ఇట్టి యల్పదోషముల నెన్నుటయందు నిమగ్నులై గ్రంథోత్కృష్టతను మఱచి రంధ్రాన్వేషణకుఁ దొడఁగిన కవియెడ వక్రమప్రవర్తనకుఁ గడఁగుటయే కాక వాచకులనుగూడ వంచించినవా రగుచున్నారు. వేంకటనాథుని పంచతంత్రము పీఠికతోడను, పురవర్ణనతోడను సమాప్తమగుటలేదు. కాని నారాయణరావుగారి తీవ్రవిమర్శకు సరియైన విధియే. గ్రంథమునంతటిని పరిశోధించి, దేశకాలానుసారముగ మాఱుచుండు విషయములపై ననవసరముగ నూఁత నిడక గుణావగుణములను పరికించి విమర్శించుట సమంజసము.

మఱియు సంస్కృత పాండిత్యము వేంకటనాథుని యవగుణములయం దొక్కటిగ నారాయణరావుగారు పరిగణించుచున్నారు. "సంస్కృత పాండిత్యము, అనర్థక నిరర్థక సమాసఘటన, ఇంకా ఏవేవి దోషములుగా తా నుద్ఘాటించుకొన్నాఁడో అవన్ని దొరలినవి." సంస్కృతపాండిత్యమును వేంకటనాథుఁడు దోషముగ నుద్ఘాటించుకొనియున్నాఁడా? ఇది నమ్మఁదగినవిషయముగాదు. ఒక్క వేంకటనాథుఁడే కాఁడు, మఱి యే ప్రాచీనాంధ్రకవియు సంస్కృత పాండిత్యమును దోషముగఁ బరిగణించియుండఁజాలఁడు. ఆకాలమున సంస్కృతము తెలియని పండితుఁడుగాని, కవిగాని లేఁడు. వారికి సంస్కృతాంధ్రములు కరతలామలకములు. మన దుర్దశ వారికి పట్టలేదు. ఆంగ్లవిద్యాభ్యాసము పెంపునను, గిడుగువారి ప్రసాదము సొంపునను నిప్పటి తెనుఁగువారికి సంస్కృతాంధ్రభాష లపరిచితములాయెను; నేఁటి తెనుఁగుకవులకు సంస్కృతాంధ్రభాషాజ్ఞానము అనవసరమని తోఁచెను. ఉత్తమగ్రంథరచన సన్నగిల్లి గ్రామ్యభాషాగ్రంథములు దేశమునం దంతటను ప్రాఁకెను. ఈ రోగము ప్రాచీనులను పీడించలేదు. కావున వారినోట సంస్కృతపాండిత్య స్ఫోరకమగు కవనము సహజముగనే వచ్చుచుండెను. సంస్కృత పాండిత్యము కవులయందుఁగాని, యన్యులయందుఁగాని దోషము గాదు. మన యజ్ఞానకారణమున దోషమని మన బుద్ధికిఁ దోఁచుచున్నది. నారాయణరావుగారి వంటి సంస్కృతభాషాభిజ్ఞులకే సుగమములగు వేంకట

నాథుని సమాసములు దుర్గ్రాహ్యములని తోఁచినపు డన్యుల మాట చెప్పవలయునా?

వెంకటనాథుని యనౌచిత్యము: దీనికి తార్కాణ కోతి మూలములోని చీలను ఊడఁదీసి అండములు నలిగి చచ్చిన కథ. "ఊసుపోక, మూలములో లేనికథను కల్పించడంవల్ల కావ్యకళకు ముప్పు తెచ్చినాడు" అని నారాయణరావుగారి విమర్శ. 'మూలములో లేనికథ' అని నారాయణరావుగా రనుచున్నారు. కథయొక్క బీజము మూలమునందు కలదు. నారాయణకవియు నీకథను చెప్పియున్నాఁడు. దాని సారాంశ మిది. ఒక పట్టణము సమీపమున జీర్ణమైన దేవాలయ మొకటి యుండెను. వైశ్యుఁ డొకఁడు దానిని బాగు చేయుటకు నిశ్చయించి దాని నిర్వాహణకు వలసిన ధనము శిల్పకారుల కొసఁగెను. వారు దేవాలయనిర్మాణమున కారంభించి యొక దేవదారువును దెప్పించి దానిని పలకలుగాఁ గోయుచు రంపపుఁగోఁతచే నేర్పడిన సందున మేకులు గొట్టి భోజనార్థ మింటికి పోయిరి. తరువాత కోతియొకటి వచ్చి ఆ మ్రానిపైఁ గూర్చుండి మేకును పెకలించెను. అంతట నామ్రాని ప్రయ్యయందు దాని యండములు దగులుకొని చితికి పోయెను. కోతియు మృతినందెను. కావున నారాయణరావుగారు చెప్పినట్లు వేంకటనాథుఁడు లేనికథను తెచ్చిపెట్టలేదు. ఉన్న కథను మార్చి యొక్కుడు హృదయంగమముగాఁ జెప్పినాఁడు. కథను మార్చుట కితఁడు ప్రథముఁడుగాఁడు. హితోపదేశకారుఁడు చూపిన మార్గము ననుసరించి యట్లే తానును నొక క్రొత్తదారి ద్రొక్కినాఁడు. బౌద్ధుఁ డొకఁడు బుద్ధాలయమును నిర్మింపఁదలకొనె నని చెప్పినాఁడు హితోపదేశకారుఁడు. ఇఁక వేంకటనాథుఁడు ఒకపట్టణమనుచోట యుజ్జయిని యనియు, జీర్ణాలయము, లేక బుద్ధాలయ మనుటకు బదులు శివాలయ మనియు, వర్తకుఁడు లేక బౌద్ధుఁడనుటకు మాఱు భోగినీస్త్రీ యనియు మార్చినాఁడు. ఈ మార్పులు కావ్యకళ కెట్లు ముప్పు తెచ్చునో తెలియదు. వాస్తవముగ నారాయణరావుగారి కోపమునకుఁ గారణము వేఱని తోఁచుచున్నది. నారాయణకవివలె ఏ వర్తకునితోడనో తృప్తినందియుండక వేంకటనాథుఁడు కావ్యములోనికి లేనిపోని భోగముపిల్ల నెక్కడనుండియో తెచ్చి చొప్పించెను — ఎంతటి యపరాధము! అంతటితోఁ దృప్తిపడక దాని సౌందర్యమును, ఆటనేర్పును, పాటమాధుర్యమును కన్నులయందు పాడ కట్టునట్లును, చెవులఁదాఁకునట్లును వర్ణించినాఁడు. దానికై తిరిగెడు విటకాండ్ర పోకడలను జెప్పినాఁడు; దానిని పాముచేఁ గఱపించి యాసాకునఁ దనకుఁ దెలిసిన విషవైద్యపద్ధతు లన్నిటి నేకరువు పెట్టినాఁడు. ఇట్టి యనౌచిత్యమునకుఁ బాల్పడిన కవి తుంటర్వుఁడా?

భోగినీస్త్రీల పేరు చెప్పిన చెవులు మూసికొనెడు 'ఆంటినాచ్' సంస్కర్తలు కావ్యవిమర్శ సేయునపుడు దమ యభిప్రాయములకు విరుద్ధవిషయములను వర్ణించు కావ్యముల నక్రమముగ ఖండింపఁ గడఁగుట సద్విమర్శనాపద్ధతి కాదు. వేంకటనాథుఁడు పదునాఱవ శతాబ్దమువాఁడు. ఆ కాలమున భోగకాంతల యెడ నెవ్వరికిని అసూయ లేదు. పేరు గలిగిన వాండ్రెల్లను భోగకాంతలను దాత్కాలికముగ నుద్వాహముఁ జేసుకొనుచుండిరి. ఇట్టి వివాహమునకుఁ గళత్రీకరణ మని పేరు. కావున భోగినీస్త్రీని దన కావ్యమునుండి వెలివేయకపోయె నని వేంకటనాథునిపైఁ గన్నెఱ్ఱసేయుట పాడిగాదు. ఈ పట్టున మనస్సున నుంచుకొనఁదగిన విషయము లొకటిరెండు కలవు. క్రీ. శ. ౧౬-వ శతాబ్దారంభమునుండియుఁ నాంధ్రవాఙ్మయచరిత్రయందు శృంగారయుగమారంభమాయెను. ఏ మాత్రము అవకాశము చిక్కినను కవులు శృంగారవర్ణనలను దమ గ్రంథములయందుఁ జేర్చుచుండిరి. కావున వేంకటనాథుఁడు భోగస్త్రీని ఈకథయందుఁ బ్రవేశపెట్టుటయందు వింతలేదు. ఇంకొక విషయము: వెంకటనాథుఁ డొక గొప్ప కథకుఁడు. ఆంధ్రకథావాఙ్మయమున నతనిస్థాన మున్నతమైనది. కేతన, మారన, గోపరాజాది ప్రాచీన కథకులకును, కదిరీపతి నారాయణాది అర్వాచీనకథకులకును నితఁడు మధ్యకాలము వాఁడు. పురాతన కథకుల మార్గములును, నాధునిక కథకుల పోకడలును నితని గ్రంథమునఁ గానవచ్చుచున్నవి. మఱియు నితఁడు కవిత్వమునకు నవీనగుణసనాథుఁడైన నాచనసోమనాథుని మేలుబంతిగఁ గొని యతఁడాంధ్రకవిత్వమున నూతనముగ ప్రవేశపెట్టిన పద్ధతి

నవలంబించెను. ఏ వస్తువునుగాని వర్ణింపవలసి వచ్చినప్పు డా వస్తువునకు సహజములగు నంగములను జాఱవిడువక యది వాచకుల చక్షువులకుఁ బొడకట్టు నట్లు వర్ణించుట నాచనసోముని కవనమందలి నవీన గుణములలో నొక్కటి. దీనిని 'వాస్తవికపద్ధతి' యన వచ్చును. వేంకటనాథుఁ డీ పద్ధతి నవలంబించెను. శృంగారయుగమువాఁ డగుటచే స్వయుగధర్మము ననుసరించి తనకావ్యమున శృంగారమునకుఁ బ్రాధాన్యము నొసఁగె సంస్కృతపంచతంత్రమున లేని భోగినీ స్త్రీలఁ బ్రస్తావకథలఁ గథానాయికలఁ జేసెను. కథకుఁ డగు టచేఁ గథయందు నూతనాంశములను జేర్చి పెంచెను; వాస్త వికతని యగుటచేఁ దన కాలమునందలి భోగినుల ప్రవర్తనలను, విష చికిత్సా మార్గములను వాస్తవముగొప్పన వర్ణించెను. ఇం దౌచిత్యభంగ మేమియుఁ గానరాదు. దేవాలయము నెవ్వరు కట్టించిరను కోఁతి యుండములు చిదుగుటకుఁ గారణ మగు క్రయ్య సేయఁబడిన దూల మును మఱవ లేదు. భోగినీస్త్రీ దూతలను జెప్పించె ననుట యనౌచిత్యమా? లేక నీతికథలలో శృంగారము పనికి రాదనియా? అట్టి కథలు పంచతంత్రమున లేకపోలేదే! ఎట్లు చూచినను ఈ పట్టున ననౌచిత్యము గాన్పించను లేదు, కావ్యకళకు ముప్పు రాను లేదు.

---

 # రాలిన పూలు 



## కీ. శే. డా. బుర్రా శేషగిరిరావుగారు

సాహితీ లోకములో లబ్ధప్రతిష్ఠులైన శ్రీ డా. బుర్రా శేషగిరిరావుగారు స్వస్థలమైన విజయనగరము నందు ఈ జూలై నెల ౧౧-వ తేదీనాడు ఆకస్మాత్తుగా సుంకెజబ్బుకు పాల్పడి గంటలలో గతాసువులైరి. ఆంధ్ర సారస్వత లోకమునకు వీరి నిర్యాణమున నొక పెద్ద లోటు ఏర్పడినదని ఘంటాపథముగ చెప్ప వచ్చును.

వీరి పాండితీ ప్రతిభలు జగద్విదితములు. నిరంతర విమర్శనలతో వీరు ఆంధ్రసారస్వతమునకు ఎడ తెగని సేవ గావించిరి.

వీరు జన్మమెత్తినది ౧౮౮౭ లో. విద్యార్థి దశలోనే వీరు తమ శేముషీ విశేషములను ప్రకటించిరి. పట్టపరీక్షలో మహోన్నత శ్రేణిలో ఉత్తీర్ణులై అనితర సాధారణమైన మెక్డొనాల్డు పతకమును బహుమతిగా గడించిరి. తరువాత మార్కుహంటరుకు ప్రియ శిష్యులై యం. ఏ. పట్టమున గూడ అసమానముగా గడించిరి. ౨౧-వ యేటనే ఉద్యోగ జీవితములో ప్రవేశించిరి. మద్రాసు విశ్వవిద్యాలయములో కొంత కాలము రీడరుగా పనిచేసిరి. నిన్న మొన్నటి వరకును విజయనగరపు మహారాజావారి కళాశాలలో ప్రధానాంగ్లోపాధ్యాయులుగా పనిచేసి అపారమైన కీర్తిని సంపాదించిరి. ఉద్యోగమునుండి విరమించుకొని విశ్రాంతి జీవితమును గడపుచున్న కాలమునగూడ వీరు తమ సాహిత్య పరిశోధన ప్రమేయములను విడువ లేదు. యథాపూర్వమయిన ఉత్సాహశక్తులతోనే వానిని నడపుచుండిరి. వీరి పాండిత్య ప్రకర్షకును, భాషాసేవకును మెచ్చుకొని వీలరు పండితుడు ఇటీవలనే అమెరికానుండి స్వయముగా వచ్చి వీరికి డాక్టరు బిరుదమును, ఘనమైన బహుమానములను ఇచ్చి సత్కరించెను. ఈయన ఆంగ్లభాషా విశారదతతోపాటు స్వయంకృషివల్ల సంస్కృతాంధ్రములయందేకాక చరిత్రశాఖయందును, బౌద్ధవాఙ్మయమునందును, భాషాశాస్త్రమునందును, నాటకకళయందును ఆశ్చర్యమును గొల్పు ప్రజ్ఞావిశేషములను సంపాదించి ప్రదర్శించినాడు. వ్యావహారికవాదమును నడపిన మహారథులలో ఈయన యొకడు. సంస్కర్తలలో సంస్కర్త. ఆంధ్ర భారతీతీర్థ మను నొక సాహితీవిమర్శకమండలిని స్థాపించి ప్రాచ్యవిజ్ఞానమును పాశ్చాత్య లోకమున ప్రచార మొనరింప నిజశక్తి యుక్తులనెల్ల ధారపోసిన పరార్థపరుడు.

ఇట్టి మహనీయుడు వయసు కెల్లకముందే అస్తమించుట ఆంధ్ర సారస్వత ప్రపంచపు దురదృష్ట మనక తీరదు. భగవంతుడు వీరి ఆత్మకు శాంతి కల్పించుగాక.

---

## కీ. శే. పురాణం సూరిశాస్త్రిగారు

సంస్కృతాంధ్రములం దుద్దండపండితుడు, ప్రజాసేవాపరాయణుడు, దేశభక్తుడు, గూడూరునందలి సంస్కృత కళాశాలకు పదివేలరూపాయల విరాళమిచ్చిన దాత— సూరిశాస్త్రిగారుకూడ పరమపదించిరి. ఇది మరొక్క పిడుగుపాటు. నిశితమైన ఆయన విమర్శనలకు ఆంధ్ర పండితలోకము తల లూచినది. నాట్యాంబుజము, నాటకోత్పలము, విమర్శక పారిజాతము అను మూడు విమర్శ గ్రంథములు ఆయన సాహితీ కళా విమర్శన పాటవమునకు నిదర్శనములై మనకు మిగిలినవి. తాను చేసిన భాషాసేవగాని, దేశ సేవ గాని, ప్రజాసేవ గాని, ఆయన మనసార చేసినాడు. ఇంకను ఎంత చేయగలిగియుండువాడో కాని ...ఆంధ్రుల అభాగ్యవశమున అస్తమించినాడు. భగవంతు డనుగ్రహించి ఆయనయాత్మకు శాంతి కల్పించుగాక!

# ఖాజీపేట శాసనము: కాకతీయ వంశక్రమము

= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ =



కాకతీయసంచిక, కాకతీయ ఆంధ్రరాజయుగ చరిత్రము మున్నగు చారిత్రక గ్రంథరత్నములలో కాకతీయుల చరిత్రమునుగురించి నూతనముగా నిక నేమియు కనిపెట్ట నవకాశము కలుగదో యనునట్లు శ్రీయుతులు మారేమండ రామారావుగారు, కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు, దూపాటి రమణాచార్యులుగారు మున్నగువారు దొరకిన యాధారముల ననుసరించి కాకతీయచరిత్రను సాంగముగను, విపులముగను, మత, సాంఘిక, వాఙ్మయ చరిత్రచర్చలతోను విశదీకరించిరి. కాని, ఒక విషయమునందు మాత్రము వారి పరిశోధన నిస్సంశయమను సిద్ధాంతమును పొందినట్లు కనబడుట లేదు. అదేమన, కాకతీయ వంశక్రమమే.

కాకతీయ చరిత్ర కత్యంతోపయోగకర మగు నొకశాసనమును శ్రీయుత దూపాటి రమణాచార్యులుగారు నైజాము రాష్ట్రమునందలి ఖాజీపేట యను గ్రామమున కనుగొని యందలి కాకతీయవంశ క్రమసంబంధమగు విశేషాంశములను కాకతీయ సంచికయందు (పుటలు ౨౫౪-౨౬౦) ప్రచురించిరి. ఈ శాసనము సంస్కృత కన్నడ భాషలయందు శిలయొక్క నాలుగువైపులను చెక్కబడియున్నది. కాని, శాసనశిలపైభాగము ఒకమూరవరకు విరుగగొట్టబడియుండుటచే శాసనవిషయము సమగ్రముగ లభింపక, నాలుగు వైపులను పైభాగమున కొన్ని పఙ్క్తులు నష్టమైపోవుటచే నొకప్రక్క నున్న శాసన ఖండము పనును, మఱొకప్రక్క నుండు శాసనభాగము నకును అన్వయము కుదరకయున్నది. ఏతత్కారణముచే శాసనశిలమీద నొక శాసనమా, లేక ఎక్కువ శాసనము లున్నవా యను సందియమున కెడము కలుగుచున్నదని శ్రీఆచార్యులవారు సంశయించిరి. కాని వారు ఏకారణముచేతనో శాసనప్రతిబింబములను కాని, శాసన మూలమును దొరకినంతమట్టుకు సమగ్రముగనైనను ప్రచురింపకైరి. ఆధారములను బయలుపెట్టక వారు విశదీకరించిన విశేషాంశము లంత విశ్వాసనీయము లని యామోదించుటకు కొంత ప్రతిషేధము కలుగుచున్నది. సంశయభూతము లగు కొన్ని యంశములను సిద్ధాంతరూపమున వారు వెలిబుచ్చిరి. ముఖ్యముగా కాకతీయవంశ క్రమవిధానమునుగురించి వీరు తెల్పినది సందేహాస్పదముగ నున్నది. రెండవ బేతరాజునకు త్రిభువనమల్లాపర నామధేయ ముండినట్లును, అతడే రెండవ ప్రోలరాజు తండ్రి యని చెప్పుట సంశయాస్పదమే. ఏల యన, రెండవ ప్రోలరాజు శాసనములలో గాని, యాతని తర్వాతిరాజులగు రుద్రదేవ గణపతిదేవ శాసనములలో గాని రెండవ ప్రోలరాజు బేతరాజుపుత్రుడని యేశాసనమునందును గానరాదు. రెండవ ప్రోలరాజు అన్వయమును వర్ణించు శాసనము లన్నింటిలోను నతడు త్రిభువనమల్లుని కొమారు డనియే నిరూపింపబడి యున్నాడు. కాని త్రిభువన మల్లుడే రెండవ బేతరా జని నిర్ణయించుట కే యాధారమును లేదు. త్రిభువనమల్ల బిరుదము రెండవ బేతరాజున కుండె ననుటకు ప్రథమమున పూర్వోక్తములు దొరగాకే కారణభూతము లగుచున్నారు. గణపతి దేవుని కాంచీపుర పు శాసనమును పరిష్కరించు సందర్భమున (చూ. ఇండి. ఆంటిక్వెరి వాల్యుం 21. పుట 200.) నా శాసనమునందు

రుద్రదేవుని పూర్వీకుడుగా వర్ణింపబడిన బేతమహారాజే హనుమకొండ శాసనమునందు రుద్రదేవుని తండ్రిగా నిరూపింపబడిన త్రిభువనమల్లరాజని హూల్ట్షుగా రభిప్రాయపడినది పొరబాటు. పూర్వీకుడన్నంతమాత్రముననే అతడు తండ్రియని చెప్పుట మిక్కిలి యసమంజసము. ఇది పొరపాటని గ్రహింపక కృష్ణశాస్త్రిగారు రెండవ ప్రోలరాజు యొక్క అనుమకొండ శాసనమును పరిష్కరించునప్పుడు హూల్ట్షుగారి యభిప్రాయమునే కొనుటవలన ఇటీవలి చరిత్రకారులందఱును నీతదభిప్రాయమునే రూఢిగా గొని పొరపాటుపాలైరి.

ఇటీవల, నేను మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి స్థానిక చరిత్రలను పరిశీలించునపుడు అనుమకొండయందలి యీ క్రింది శాసనపు నకలు లభించినది. ఇయ్యది అనుమకొండ గ్రామమునందు శితాబు ఖానుని యింట్లో ఆంజనేయ దేవళము వద్ద దిగువపడియున్న రాతిమీద నుండిన దని మెకంజీ సుమాస్తా యొకనిచే నిరూపింపబడి దానినకలు ఈ క్రింది విధమున నివ్వబడియున్నది.

(L. R. vol. 45. pp. 17-21.)

అనుమకొండ గ్రామాన శితాబుఖానుని ఇంట్లో ఆంజనేయ దేవళంవద్ద దిగువ పడివుండిన రాతికి.

సూర్యుడు చంద్రుడు

గోవు వత్స అంజనిబింబం నిలువు ప్రతిమె లింగం.

శ్రీయాసవ (శ్రియస్సవో) వితరతు శ్రీకస్య (స్య) శ్రీపతిప్రియః, యత్ప్రసాద ప్రభూతశ్రీ స్సన్నృపేంద్రో జగత్త్రయీ (యే), సామంత విష్టివంశ శ్రీమాన్ కాకతిపురాధినా, ధోర్భటః (బేత) ఖోళ (చోళ) క్ష్మాపాళ భిమాన్యవాది (దమూర్ధిః) ప్రమథవసమాజానో జితలక్ష్మీః॥ పుత్రస్తస్య జగత్పవిత్ర చరితః ప్రోలక్షమః పాలకో సర్వత్రీకృతచక్రకూట విమయో భిద్రంగ విద్రావణః, జిత్వా కొంకణమండలో (లం) నిజయశో...వా (పూ) రితాశాఃపరా— గుత్పారాజ్యం యజనస్తు తస్య విసరత్కీర్తిం సమావర్తయేత్ ॥ సవిర ॥ జితోప్యాంతర మన్నయానః ప్రాను వనం కొండప్తత్తి దుర్గాత్యజ(క)ం హత్వాజో(జా) గుణసాగరస్య [పురకూటా] (చపురందే) శంచ గొన్నాహ్వయం, తత్తద్భూయిత మన్మకొండవిషయం త్రైలోక్య మల్లక్షితిశాచ్ఛాపనబద్ధ ముద్ధతో జంయా సంలబ్ధవాన్ శాశ్వతం॥. సూమరస్యపరభూప దవాగ్నిశోచ్ఛల మాళవ మదేభమృగా (గే)ంః, విక్రమేణ భువి విక్రమ చక్రీ భీ(బే)త భూపతిఃత ప్రథితో భూత్ ॥

అన్మకొండపురీవాటీం తీర్థం శివపురాహ్వయాం కృత్వా తత్ర స్వనామ్నా సౌ దేవాలయ మచీక (రోత్)॥ టించశివోద్యే..........

(One line lost here,)

(II Side of the stone )

శాంద్రాహ్వ (రాహు) గ్రస్తే దివాకరే, రామేశ్వరముక్తాయ పాదా ప్రక్షాళ్య దత్తవాన్ " తను జోస్య సింహాశార్యజితకుర్గొరిపుర్గం సింహా ఇతి విఖ్యాతః — త్రిభువనమల్లశ్రీమాన్ స్వభుజార్జిత విభవమన్యభిక్షః ప్రభూరాజిస్తే (జతే) ఆచంద్రార్క మపితపావమహిమ్నై శైవ్యఃపరైః పాల్యంసర్వ సమస్త మేత దితిప్రో స్వహస్త్రశ్రేయసి స్తంభంస్థాపితవాన్సకీయకులకీర్తిం స్థిరవద్భాసహిన సత్రీమాన్స్కలమతిః గండనృపతి ద్వారిద్ర్యవిద్రావణః, ఒడికొండ ప్రబోద్ధావణ భట్టస్య మహాలకిర్వణః కావ్యమిదం.

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిలక చాళుక్యాభరణ శ్రీమత్త్రిభువనమల్ల దేవర విజయ రాజ్యాభ్యుదయ మాచంద్రార్కతారం సల్లుత్తమిరె తత్పాదపద్మోపజీవి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వరం పతిహితచరిత వినయ విభూషణం శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ్యభీటరస నన్మకొండపురద నైఋతి దిగ్భాగదొళు శివపురమాన వాళియంమాడి తన్న పెసర దేవాలయంగళ నెత్తిసి యాబణే శే (బేతే) శ్వర దేవరంగ భోగక్కం దేవాలయ దఖండ స్ఫుటితన విసుధాకమజనిమార్జనక్కం మల్లిపటతపోధనగెణ అన్నదానక్కం మతిది సన్మానక్కం శకవరుషం ౧౦౧౧ నెయ ప్రమోదూతసంవత్సరద కార్తిక బ ౧౫ ఆదిత్యవారదందు సూర్యగ్రహణ

మినిత్త మాపటియం కాళాముఖ తపోధనరుం శ్రీపర్వత ప్రసిద్ధ మల్లికార్జున శిలామఠాచార్య్యరు మప్ప పర్వత వళియు రామేశ్వరపండితర్గ్గె తచ్ఛిష్యపరం పరాచార్య్యకముం తగుత్పన్న నిధినిదానకుల్క వంష భనోపభోగ్యతుంత్రిశాగాభ్యంతరసిద్ధ సుబు(వు) ప్పన్తు సర్వనమస్యవాగె తత్పాదప్రక్షాళన అష్టోపక దాన పూర్వ్వకమిత్తుపల్లిపిద నిజభరు ధర్మ్మమం సముద్ధరి ప్పా చెటరపనసుపుత్ర॥ కులతిలకం సకళ జగతిలకా సౌజన్య సార్వభౌమ నెనిప్ప గళిక్కర్గె శ్రీమన్మహా మండలేశ్వరం దుర్గ్గనృపతి త్రిభువనమల్లం॥ పరభూ పాలకలోకర్ణదంగపాణనిర్దళ్ళిత్తమోగ్నికర్గ్గె మె యగరెదుళుగంటిన కొడ్డినంకదరూ బ్యార్గ్గోత్తిన భూలోదిగ్భరితాత్మోజ్వళ కీర్తిర్ణ పకోర్వతిర లోకా లోకముం శాశ్వతం ధరణీచక్రమ వాళ్వకోళ్వలదగండం దుర్గ్గ భూపాళకం॥ తన్న ప్రవానరం బమగర్గ్గె మం పాదం మ్యాలదెర్గ శిగరం నాడధుద్ధరెనళం కరము మంత ధర్మ్మవశ రక్షకరప్పన్తుపాడిర్ణసి పడెను సమస్తా గ్రహార ప్రభు మహాజనదపుర గృహపతి మకపతి గళ సాక్షియొళు శ్రీమచ్చాళుక్య విక్రమకాలది ౨౩ నేయ బహుధాన్య సంవత్సర దీక్షాహియ్యుత్తరాయణ సంక్రాంతియొళ్ బరుతీర్గె స్థంబన్నసూర్య్గపమాగినె ని (డి)సిద శాసనగంభమిద చంద్రార్కతారం నిల్కె మంగళం మహా శ్రీ॥ అనుమకొండ పురదసిద్ధ ప్రముఖ నకరము మార్బెతిశ్వర దేవర నందదీవిగె నిత్యవొందు మాన బత్తెయుం స్వసమ్మర్గె మాగిపల్లిగుళ అంతె ధమ్మర్గె మారు చెల్లమం స్వధమ్మర్గె నిర్విశేషమాగెనడపు వమహాత్మ్యరశ్వమేధ యాగఫలభాగ్య గళిల్లి తిలలక మాత్ర మనాదోష మలిన జౌని వారణాసి యొళు సాశిర్వ ప్పకుర్పిరు మనని తెకటి తిగళు మనళిద పాపం॥ స్వదత్తం పరదత్తంవా.

తేషాం మయా విరచితాంజలి రేవ మూర్ధ్నె॥ నమశ్శివాయ॥

తప్పుల తడికగా నున్న ఈ శాసనపు నకలును శాసనప్రతిబింబములు లేనప్పుడు సవరించుటకు వీలు లేక యున్నది. కాని ఈశాసనముతో ఖాజీపేటలో దొరకిన శాసనమును పోల్చిచూచిన నీ రెండును నొక్క టియే యని స్ఫురింపకమానదు. ఖాజీపేటయందలి దరగాలో నీశాసనపు శిలను స్తంభముగా నుపయోగింప బడుటకు పూర్వము ఇయ్యది అనుమకొండయందు శితాబుఖానుని యింటిలో నాంజనేయ దేవళమువద్ద పడియుండి మెకంజీ గుమాస్తాలచే పరిశోధింపబడినట్లు తెలియుచున్నది. ఖాజీపేటదరగాలో నుపయోగింపబడునప్పు డీశిల పైభాగము తెగగొట్టబడుటచే శ్రీ రమణాచార్యులవారు పరిశీలించినపుడు ఈయనకు శాసనము సమగ్రముగా లభించుట సంభవించెను. కాని మెకంజీ గుమాస్తాలచే పరిశోధింపబడినప్పుడు శాసన శిల సమగ్రముగా నుండుటంబట్టి వారినకలు సంపూర్ణముగానే యున్నది.

శాసనమునందు తెలుపబడిన విషయ మేమన? చాళుక్య త్రిభువనమల్లరాజ్య కాలమునందు శా. శ. ౧౦౧౨ ప్రమోదూత సం॥ కార్తిక బహుళ ౧౫ ఆది త్యవార సూర్యగ్రహణమునాడు మొదటిబేతరాజు పౌత్రుడును, ప్రోలరాజుపుత్త్రుడును నగు రెండవబేత రాజు శ్రీ పర్వతకాళాముఖ మల్లికార్జున శిలామఠా చార్యులగు రామేశ్వరదీక్షితులకు తనచే నూతనముగా నిర్మింపబడిన శివపుర మను గ్రామమును అదే గ్రామమునందు తాను ప్రతిష్ఠించిన బేతేశ్వరాలయము నందు పూజాపునస్కారములు సలుపుటకును, దేవాలయ ఖండస్ఫుటిత నవసుధాకర్మ నిర్మాణములకును తపో ధనుల కన్నదానసత్రము నడుపుటకుగాను ధారా పూర్వకముగ నిచ్చిన దానము నుద్ధరించు నుద్దేశముతో రెండవ బేతరాజు కొమారుడగు చలమర్తిగండ బారి ద్వవిద్రావణబిరుదాంకితు డగు త్రిభువనమల్ల దుర్గ రాజు ఏతద్దానమును శాసనలిఖితము గావించి శాసన స్తంభమును తనయొక్కయు, తన తండ్రియొక్కయు శ్రేయస్సుకొఱకు ఆచంద్రార్కస్థాయిగా నెలకొ ల్పెను. శాసనస్తంభస్థాపనసందర్భమున అనుమ కొండపుర వాస్తవ్యులగు నగరముఖ్యజనులు బేతేశ్వ రాలయమునందు చిరస్థాయిగా దీపములు వెలిగించుటకు గాను నిత్యము మానెడు నెయ్యి సమర్పించిరి.

శాసనవిషయము సంస్కృతమునందును కన్న డమునందును వ్రాయబడియున్నది. సంస్కృతభాగము

నందు కన్నడభాగమునందు వివరింపబడిన దానమును శాసనదాతయొక్క వంశక్రమాది వర్ణనలతోకూడ శ్లోక రూపమున నిర్దేశింపబడియున్నది.

ఈశాసనమందలి నూతనాంశములను కొన్ని శ్రీ రమణాచార్యులుగారు తెలిపిరి గాని వారు బేతరాజునకు త్రిభువనమల్ల దుర్గరాజను కొమారుడున్నట్లు శాసనమునందు స్పష్టముగ తెలియుచున్నను బేతరాజునకే దుర్గరాజత్రిభువనమల్లా పరనామధేయము లున్నట్లు శాసన విరుద్ధముగజెప్పిరి. శాసనము సమగ్రముగ దొరకకుండుట వలన కాబోలు ఈపొరపాటొనర్చిరి. ఇదేకాక మాదిరెడ్డికుంటశాసనమునందు పేర్కొనబడిన త్రిభువనమల్ల రాజుతండ్రి యనబడువాడు మొదటి ప్రోలరాజని శ్రీ ఆచార్యులవారు గణించినదియును ప్రమాదజనితమే. పై నుదాహరింపబడిన అనుమకొండ (ఖాజీపేట) శాసన ప్రామాణ్యమువలన త్రిభువనమల్లుని కొమారుడుగా గల వాడు రెండవబేతరాజే యగుచున్నాడు కాబట్టి మాదిరెడ్డి కుంటశాసనోదాహృతు డగు శివపురదాత రెండవ బేతరాజుగానే యుండవలయును. మఱియును నీ రెండుశాసనములందును దాతయు, ప్రతిగృహీతయు, దానమివ్వబడిన గ్రామము దీనియొక్క యభేదము గమనించినయెడల దానవిషయ మీ రెండు శాసనములందును నొక్కటియేయని స్ఫురింపకమానదు. కాని దానవిషయ మొక్కటియేయైనను శాసనములు పుట్టిన కాలము భిన్నముగ కనబడుచున్నది. అనుమకొండ (ఖాజీపేట) శాసనము దుర్గరాజుచే స్థాపింప బడినది. మాదిరెడ్డికుంటశాసనకంధము చలమర్తిగండ ప్రోలావనీశునిచే నెలకొల్పబడినది. ఈ విషయముల సారాంశ మేమన బేతరాజొసగిన దానము ప్రథమమున నతని కొమారుడగు దుర్గరాజుచే నుద్ధరింపబడి తర్వాత ప్రోలరాజుచే పునరుద్ధారణము చేయబడినట్లు గ్రాహ్య మగుచున్నది. చలమర్తిగండప్రోలావనీశు నకును తత్పూర్వోద్దిష్టుడగు త్రిభువనమల్ల జనకునకును మాదిరెడ్డికుంటశాసనమున నేసంబంధమును తెల్పబడ కున్నను ప్రోలావనీశుడు త్రిభువనమల్లుని కొమారుడని రుద్రదేవుని యనుమకొండ శాసనప్రామాణ్యమువలన సులభముగ గ్రహింపవీలగుచున్నది. ఏతన్నిదర్శనములచే మనకు నూతనముగా తెలియు విషయ మేమన, రెండవ బేతరాజునకు త్రిభువనమల్లదుర్గరాజను కొమారు డుండెననియు, నీతడే రెండవ ప్రోలరాజు తండ్రియనియు తెలియనగుచున్నది. శ్రీరామేశ్వర దీక్షితులు వీరి ముగ్గుర రాజ్యకాలమునందును సజీవులై యుండి వీరలచే సన్మానింపబడి కులగురువుగ నెన్నుకొనబడినట్లు తెలియుచున్నది.

హనుమకొండ (ఖాజీపేట) శాసనమునందు వర్ణింపబడిన కాకతీయాన్వయక్రమముతో మాదిరెడ్డికుంట శాసనస్థవిషయముల నన్వయించుకొని రుద్రదేవునియనుమకొండశాసనోదాహృత వంశవృక్షముతో మిళితము జేసిన నీ క్రిందివిధముగ కాకతీయవంశము పరిణమించుచున్నది.

౧. మొదటి బేతరాజు

(c. శా. శ. ౯౫౦) చలమర్తిగండడు; (కాకతిపురాధీశ్వరుడు, చోళులను జయించి రాజ్యలక్ష్మిని పొందెను.)

|

కొమారుడు

౨. మొదటిప్రోలరాజు

(c. శా. శ. ౯౭౫.) (చక్రకూటవిషయము, కొంకణ మండలము, కొండపల్లి దుర్గము, గుణసాగర పురము, దేశము నగు గొ (హొ) న్నను, జయించెను. త్రైలోక్యమల్ల రాజువద్ద నుండి అన్మకొండ విషయము పొందెను.)

|

3. రెండవ బేతరాజు (విక్రమచక్రి)

(శా. శ. ౧౦౦౧, ౧౦౧౨) (చోళులను మాళవులను జయించెను.)

|

౪. దుర్గనృపతి లేక త్రిభువనమల్లుడు

(చా. వి. శ. ౨౩ = శా. శ. ౧౦౧౯–౨౦.) (చలమర్తిగండ, దారిద్ర్య విద్రావణ బిరుదాంకితుడు.)

|

౫. రెండవప్రోలరాజు (చలమర్తిగండ)

(శా. శ. ౧౦౩౯, ౧౦౪౩.)

(ఈ రాజు విజయములు రుద్రదేవుని యనుమకొండశాసనమున విపులముగా కీర్తింపబడియున్నవి.)

### ౩. రుద్రదేవుడు (శా. శ. ౧౦౮౪)

ఈ పైమూర్గురు రాజులలో ముఖ్యముగా పేర్కొనదగినవాడు మొదటి ప్రోలరాజు. ఇతడే కాకతీయసామ్రాజ్యమునకు పునాదులు వేసిన నిర్మాత. చాళుక్య త్రైలోక్యమల్లుని సామంతుడుగ నుండి యారాజుతో బాటు యుద్ధములందు పాల్గొని, తన యపారశౌర్యవిక్రమములను జూపి, తన యేలిక యొక్క మన్ననకు పాత్రుడై యనుమకొండ విషయమును బహుమానముగా గైకొనెను. ప్రోలరాజు విజయములు చక్రకోట్యము మొదలుకొని పశ్చిమమున కొంకణము వఱకును వ్యాపించెను. మైసూరుప్రాంతమున నుండిన ఆళుపప్రాంతరరాజులనుకూడ జయించినట్లు అనుమకొండ (ఖాజీపేట) శాసనమున సూచింపబడుచున్నట్లు తోచుచున్నది. గుణసాగరపుర మని వర్ణింపబడిన నొన్నాహ్వయపురము ఆళుపరాజగు గుణసాగరునిచే క్రీ. శ. ౭-వ శతాబ్దమునందు స్థాపింపబడిన హొన్నాహ్వయ (పొన్నవ్వళ్ళ లేక హొన్నవ్వళ్ళ) పుర మనుపేరి నియ్యది త్రైలోక్యమల్లుని కాలమున ఆళువవంశీయులగు సాంతరరాజులచే పాలింపబడుచుండెను.* ఈ నగరము ప్రస్తుతము పట్టిపొంబుళ్ళ యను పేరుతో మైసూరురాజ్యమున శివమొగ్గజిల్లాయందు నగరతాలూకాలో నున్నది. కొంకణమండలమును జయించు సందర్భమున, దాపుననే యుండు నీసాంతరరాజ్యమును గూడ ప్రోలరాజు జయించి యుండవచ్చును. మఱియును, త్రైలోక్యమల్లుడు కొంకణరాజులు, కదంబరాజులు మొదలగు పశ్చిమ సముద్రతీరవాసులను జయించెనని శాసననిదర్శనము లెన్నియేనియు గలవు. ఈ విజయములందు త్రైలోక్యమల్లుని సామంతుడుగ కాకతి ప్రోలరాజు పాల్గొని యుండవచ్చు నను నూహకు పై శాసనమున "గుణసాగరస్య పుర కూటాళం చ నొ (హొ) న్నాహ్వయం" అను పాదభాగము కొంత యవకాశము నిచ్చుచున్నది.

ప్రోలరాజు కొమారుడగు రెండవ బేతరాజు చాళుక్య త్రైలోక్యమల్లుని కొమరుడగు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని సామంతుడుగ నుండె ననుటకు నిదర్శనముగా తన యేలిక నామధేయమును తన కొమారుడగు దుర్గరాజునకు పెట్టుకొనియెను. మఱియు తానుకూడ విక్రమాదిత్యుని విక్రమచక్రి యను బిరుదమును వహించి తన శాసనములం దన్నిటియందును తన యేలికచే శాలివాహన చక్రవర్తిని పరిభవించు నుద్దేశముతో నూతనముగా ప్రారంభింపబడిన విక్రమార్క శకమునే యుపయోగించెను.

ఇతని కొమారుడగు త్రిభువనమల్ల దుర్గరాజును గుఱించి ప్రస్తుత అనుమకొండ (ఖాజీపేట) శాసనములో గాని తదితర కాకతీయశాసనములలో గాని యెక్కువ ప్రశంస లేదు. రాజ్యము నధిష్ఠించె ననుటకు స్ఫుటమైన నిదర్శనములు లేకపోయినను 'అవనీశ,' 'నృపతి' యను పదములచే వర్ణింపబడుటచే సింహాసనము నలంకరించె నని చెప్పవచ్చును. మఱియును, ఎనిమిదేండ్ల క్రితము తన తండ్రి చేసిన దానమును పునరుద్ధారణము చేసి నూతనముగా శాసనస్తంభమును స్థాపించుటవలన నీ తారీఖునకు పూర్వము రాజ్యము నధిష్ఠించి రాజ్యాధికారము నెరవేర్చు రీతిగా దానమును పునరుద్ధారణము చేసి నూతనముగా శాసనస్తంభమును తనకును తనతండ్రికిని శ్రేయస్సు కలుగుటకొఱకు స్థాపించెనని నుడువుటచేత తండ్రి యగు బేతరాజు సజీవుడై యుండె నని ధ్వనితమగుచున్నది. దానము నుద్ధరించుటకు కారణ మేమియో స్ఫురించుట లేదు.

చాళుక్యవిక్రమ ౨౩ సం॥ అనగా శా. శ. ౧౦౧౯ (క్రీ. శ. ౧౦౯౭-౮) వఱకును బేతరాజు పరిపాలించుచుండెనని గ్రహింతుమేని, త్రిభువనమల్ల దుర్గరాజపుత్రుడగు రెండవప్రోలరాజు చాళుక్య విక్రమ ౪౨-వ సం॥ అనగా శా. శ ౧౦౩౯ (క్రీ. శ. ౧౧౧౭) న అనుమకొండ పద్మాక్షిగుడి శాసనము†నందు నిరూ

* చూ. ఎపి. ఇండి. వాల్యూం 9 పుట ౧౭; సాలతొరె: ప్రాచీన కర్ణాటకదేశచరిత్రము వాల్యూం I.

† ఎపి. ఇండి. ix. p. ౨౬౨.

పింపబడినట్లు రాజ్యము నధిష్ఠించియుండుటంబట్టి ఈ రెండు తారీఖులమధ్య అనగా శా. శ. ౧౦౧౯ (క్రీ. శ. ౧౦౯౭-౮ నుండి) శా. శ. ౧౦౩౯ (క్రీ. శ. ౧౧౧౭) లోపుగా, త్రిభువనమల్లదుర్గరాజు సింహాసనము నెక్కి యుండవచ్చునని యొకవిధముగా స్థూలదృష్టితో తీర్మానింపవచ్చును.

త్రిభువనమల్లుని కొమారుడను రెండవ ప్రోలరాజు యొక్క పద్మాక్షీగుడిశాసనమునుంబట్టి శా. శ. ౧౦౩౯-వ సంవత్సరమున నితడు రాజ్యము చేయుచుండె నని తెలియుచున్నది.

ఇతని పుత్త్రుడగు రుద్రరాజు శాసనములు శా. శ. ౧౦౮౦ మొదలుకొని ప్రారంభించుటం బట్టి రెండవ ప్రోలరాజు రాజ్యకాలము శా.శ. ౧౦౩౯ మొదలు శా. శ. ౧౦౮౦ లోపుగా నుండియుండవచ్చునని యూరమరికగా చెప్పవచ్చును. కాకతిరాజులలో నీ రెండవ ప్రోలరాజే త్రిభువన మల్ల విక్రమాదిత్యుని మరణానంతరము అసంఖ్యాకము లగు విజయములను పొంది, తన రాజ్య పరిసరములం దుండు సామంత రాజుల నెల్లరను జయించి, చాళుక్యుల యధికారము నుండి స్వతంత్రీకరించి తన సామ్రాజ్యము నేకచ్ఛత్రముగా చేసెను. ఇతని కాలమునుండియే కాకతీయ రాజ్య మొక స్వతంత్రరాజ్యముగ నేర్పడి ప్రస్తుత నైజాము రాష్ట్రములోని తూర్పు సగము భాగమంత యును వ్యాపించి యుండెను. ఇతని తరువాత నితని కొమారుడగు రుద్రదేవుడు తన పైతృకంబగు రాజ్యమును నలుదెసలయందును విస్తరించి, తూర్పున సముద్రమువఱకును, దక్షిణమున శ్రీశైలమువఱకును పడమట (కల్యాణకటకము ?) ఉత్తరమున మాల్యవంతము వఱకును వ్యాపింపజేసెను.

కాకతీయులచే కులగురువుగ సన్మానింపబడిన రామేశ్వరదీక్షితుడు రెండవ బేతరాజు కాలమునుండి శైవమత ప్రచారము చేయుచుండెను. ఈతడు గొప్ప పండితుడుగను, లకులేశ్వరాగమ సిద్ధాంతవేత్తగను, ఆ కాలమునందు శైవమత ప్రచారకులలో నగ్రగణ్యుడుగను, కాళాముఖశైవపరంపరకు సంబంధించిన శ్రీశైలమల్లికార్జున మఠాచార్యుడుగ నుండెనని శాసన ప్రామాణ్యములవలన తెలియుచున్నది. జైనమత విసర్జన మునరించి శైవమతదీక్షను వహించిన కాకతీయ రాజులచే పెక్కు శైవాలయములను స్థాపింపజేసి యందు స్థానాచార్యపదమును స్వీకరించుచుండెను. త్రిభువన మల్ల విక్రమాదిత్యుని క్రీ. శ. ౧౧౨౪ నాటి ద్రాక్షారామశాసనమునందు భీమేశ్వరస్థానాధిపతిగ పేర్కొన బడిన రామేశ్వరరాసిపండితులు పై కాళాముఖ రామేశ్వరదీక్షితుడే యగునని తోచుచున్నది. ప్రాయికముగా 'రాసి' యను గౌరవప్రత్యయము కాళాముఖ మఠాచార్యులచే ప్రత్యేకముగ వాడబడుచుండుటచే పై యూహ బలపడుచున్నది. అటులైన, ద్రాక్షారామము వఱకును నీతని మతప్రచారము వ్యాపించి యుండెనని యును, కొంతకాలము భీమేశ్వరుని స్థానమున కధిపతిగ నుండి తద్దేవస్థానపు కార్యములను నిర్వహించుచుండె ననియును తెలుసుకొనగలము. రామేశ్వరుని కొమారుడగు నదితేంద్రవర్మయను రుద్రదేవుని యనుమకొండ శాసన శ్లోకములను రచించిన ట్లాశాసనపు మున్నుడి యందు తెల్పబడియున్నది.

ఈ రామేశ్వరదీక్షితుని కాలమునకు, అనగా పదునొకండవ శతాబ్దమునకు పూర్వమే శ్రీశైలము నందు కాళాముఖ మల్లికార్జున యోగిచే నొక మఠము స్థాపింపబడెనని తెలియవచ్చుచున్నది. ఈ మల్లికార్జున యోగి శివతత్త్వసారకర్త యగు మల్లికార్జున పండితారాధ్యులకు దాదాపు నూరేండ్లకాలమునకు పూర్వ ముండియుండుటచే వీరిద్దఱు భిన్న పురుషులని ప్రత్యేకముగ జెప్ప నవసరము లేదు.

ఈ సందర్భమున కుమారసంభవ కర్త యగు నన్నెచోడుని గురువగు జంగమ మల్లికార్జునయోగి జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఇతనికిని శ్రీశైల కాళాముఖమఠస్థాపకు డగు మల్లికార్జున యోగికిని నేదేని సంబంధ ముండునా యను సంశయము కలుగుచున్నది. ఈ సంశయమును బలపఱచున ట్లొక నిదర్శనము కుమారసంభవమందలి దశమాశ్వాసమున 'దారిద్ర్య విద్రావణా' అను మకుటముగల పద్యదశకములో నొకటి ఈ క్రిందివిధమున నున్నది.

శా॥ శ్రీరామేశకవీశ్వరాదు లెవ నీశ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోకసముదాయాధీశులై రన్న సం
సారుల్ దుఃఖనివారణార్థ మధిపున్ లోకత్రయా
ధారున్ నిన్ మది గొల్వకున్కి యుఱవే దారిద్ర్య
విద్రావణా (X ౮౫).

ఈ పద్యమును గుఱించి కుమారసంభవసంపాదకులగు శ్రీరామకృష్ణకవిగారు "రామేశకవి యనువాఁడు నన్నిచోడుని కాలమునకు ప్రఖ్యాతుఁడై యుండుననిధ్వనిత" మని లఘుటీకలో దెల్పిరి. శ్రీ వీరేశలింగం పంతులుగారును "ఈ రామేశ్వరకవీశ్వరుఁడు కవి కాలమువాటికి ప్రసిద్ధుడై యుండిన శివభక్తుడైన యాంధ్రకవియై యుండు" నని శ్రీకవిగారి యూహ నామోదించిరి. కాని శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారు పై పద్యమునందు రామేశ్వరకవినిగూర్చిన ప్రశంస లేమి లేదని కొన్ని తార్కాణములను నిరూపించి వాదించిరి. కాని రామేశ్వరకవి యనునొకఁడు యుండు తెలుపబడి యున్నాడన్న యూహకు బలముగ 'దారిద్ర్య విద్రావణా' యనుమకుటము పరిణమించు చున్నది. ఎట్లన నీబిరుదు రామేశ్వరదీక్షితుని యనంగుశిష్యుడగు త్రిభువనమల్లదుర్గరాజున కుండుటంబట్టి పై పద్యమందలి రామేశకవీశ ప్రశంసయు, దారిద్ర్య విద్రావణ మకుటమునకును పరస్పర చారిత్రకసంబంధ మేదియో యుండవలయునన్న యూహకు అవకాశము గలుగుచున్నది. కన్నడ వాఙ్మయ సంప్రదాయమున నిటువంటి మకుటములు దేవునిపరముగనైనను, కృతిపతిపరముగనైనను, కృతికర్తపరముగనైనను సంబోధనార్థముగ నుపయోగించుట సాధారణము. ఈ సంప్రదాయమే తెలుగు కావ్యములయందును వాడుకయం దుండెననుటకు బద్దెన చోడుని నీతిశాస్త్రముక్తావళి యొక తార్కాణము. కాబట్టి ఈ 'దారిద్ర్య విద్రావణ' స్తుతి దారిద్ర్య విద్రావణు డను బిరుదము వహించిన యొక కృతికర్త చేత వ్రాయబడియో లేక యీ బిరుదు కలిగిన యొక కృతిపతి కంకితముగనో యుండి యుండవచ్చు నని తోచుచున్నది. అటులైన యెడల రామేశ కవీశ్వరుని ప్రశంస కలిగియుండుటవలన నీ స్తుతి కాకతీయ రాజగు దారిద్ర్యవిద్రావణ బిరుదాంకితు డగు త్రిభువనమల్ల దుర్గరాజునకు కృతికర్తృత్వవిధముగనో, లేక కృతిపతిత్వవిధముగనో సంబంధించి యుండవలయు నని తోచుచున్నది. ఈ దారిద్ర్య విద్రావణస్తుతి జంగమ మల్లికార్జున కంకితముగా నివ్వబడిన నన్నిచోడుని కుమారసంభవ ముం దుండుటంబట్టి రామేశ్వరకవి గురు వగు శ్రీశైల కాళాముఖ మల్లికార్జునుడే ఈ జంగమ మల్లికార్జును డగునేమో యను నూహ కలుగుచున్నది. కాని పైవిషయము లన్నియు నొకటితో నొకటి సంబంధించుటకు తగు బలమైన నిదర్శనములు లేకున్నవి.



# ప్రణయ సందేశము

శ్రీ కె. అన్నమరాజశర్మ



కలలలోఁ గానవచ్చెడికులుకులాడి!
బెళుకుఁజూపుల నన్నిట్లు వేఁచ నేల?
తీసికొనిపొమ్ము తావకదేహసార
భానిలమ్ములు వొలుచు నుద్యానలతికి.

ఇంద్రజాలికు సమ్మోహనాస్త్ర మనఁగఁ
బ్రణయనిశితావలోకనాపాతమునను
ఎడఁద కురిత్రాళ్లుదగిలించి యీడ్చెదేల
కన్నియా! యేను జేసిన కలుషమెద్ది?

విరహదవవహ్నికీలల వేఁగునపుడు
దారి గానక వాంఛలు దరలుచుండ,
కర్మపారుష్యముంగూర్చి గాసివడుచు
వేఁడికన్నీళ్లఁ బాటపాట విడుచుచుందు.

ప్రణయచింతాభరంబున రాత్రులందు
తావకీనతనూకాంతిఁ దలఁచి తలఁచి
భావభవుకోల్తలకు వజ్రపంజరంబుఁ
బోని నాయెద వ్రక్కలై పొగులుచుందు.

ప్రేమకుంబ్రేమనాసించు హృదయభృంగ
మేలకో నీదుమూర్తిని వ్రాలుచుండె;
ప్రణయవేగప్రభావంబు పలుకలేక
ఆత్మనిందకుఁ బలుమాఱు యత్నపడుదు.

ఊహ కందనిప్రణయోపగూహనముల
స్వర్గరాజ్యంబుగాఁగ నీ సకలసృష్టి
పూవుఁదావియు నేకమౌపోల్కి మనము
అందెదముగాత మాత్మలం దైక్యసిద్ధి.

---



# జీవితం

[ కథానిక ]




చేతిలో లెదర్ సూటుకేసు పట్టుకొని, ప్లాటుఫారం మీద యిటూ అటూ తిరుగుతున్నాడు వెంకట్రావు. అతనికి వెనకనుంచి ఎవరో పిలిచినట్లయింది. తిరిగి చూశాడు — కుటుంబయ్యగారు!

"ఏమండోయ్ కుటుంబయ్యగారూ, యిలా..." వాక్యం పూర్తిచేయకుండా ఆపేశాడు, కుటుంబయ్య ప్రక్కన మెరుస్తో నించొనివున్న పద్ధెనిమిదేళ్ల అమ్మాయిని చూసి. "తిరిగి కుటుంబయ్య పెళ్లిచేసుకోలేదు కదా!"

రావుఆశ్చర్యం గమనించి కుటుంబయ్య యిలా అన్నాడు: "దీన్ని మరచిపోయావుటోయ్! అవునులే, మనం ఆరేళ్లయింది కల్సుకుని. చిన్నతనంలో యిద్దరూ ఆడుకునేవారు కూడాను" ఇంతకీ ఎవరో చెప్పలేదు రావుకి. ఆ అమ్మాయి నవ్వుతో "మీరు గుర్తించలేనంతగా మారిపోయానా రావుగారూ" అంది. ఏమనాలో తెలియక డెలికేట్‌గా ఫీలయాడు వెంకట్రావు.

"అమ్మాయి చదువుకుంటోంది. ఈ యేడాది బి. యే. జూనియర్ అయింది. సంగీతంలోనూ, పెయింటింగులోనూ అభిరుచి వుంది. అయితే, యింజనీరుపరీక్ష ప్యాసై, అప్పుడే ఉద్యోగంలోకూడా ప్రవేశించావుటకదూ? ఇలా ఎక్కడికి వెళుతున్నావు, కాకినాడేనా! సగంవరకూ మేమూ వస్తాంలే! చాలా ఆనందంగా వుంది నాయనా నిన్ను చూడటం. తెలివి తేటలైనవాడవు, యింతకీ... అన్నట్టు, అమ్మాయీ, వాళ్లమ్మ మనింట్లోనే ఉంటున్నారు. ఓహో, నీకు తెలియదుకాబోలు, అమ్మాయిఫాదరు పోయాడని. నాకూ జవసత్వాలు తగ్గినై. ప్రాక్టీసూ లేదూ, మరోహాబీ లేదు..." పొడిదగ్గు వచ్చి కుటుంబయ్యగారి వాక్ప్రవాహానికి అడ్డువేసింది. ప్రక్కనే, ఆ అమ్మాయి నవ్వుతో నించొంది.

ఇంతకీ ఆమె ఎవరో తెలియక తికమక పడుతున్నాడు రావు. తప్పనిసరిగా చిరునవ్వు తెప్పించుకొని "అలాగాండి" అన్నాడు. దూరంగా పొగలు చిమ్ముకుంటూ వస్తూన్న రైలుని చూస్తోన్న ఆమె విలాససంపదని చూసి విభ్రమం చెందాడు.

రైలు వేగంగా వెళ్లుతోంది. గాలికి ఎగిరే ముంగురుల్ని పైకి తోసుకుంటూ, ఆకర్షించే అందమైన నవ్వుతో, ఆమె రావుతో మాట్లాడుతోంది: "నాకు సంగీతమన్నా, పెయింటింగు అన్నా చాలా యిష్టమండీ. నేను చిత్రించిన సంధ్యాసుందరి చిత్రం 'సెల్...' పత్రికలో పడింది చూశారా! జీవితాన్ని ఏదో కొంత ఉపయోగకరం చేద్దామని నా కోరిక. సంగీతం అన్నారా, అబ్బ, వీణలో అనుకున్నంత ప్రవే

[illegible] సంపాదించలేదండీ. మంచిగాలివేస్తోంది, హాయిగా ఉంటోందండీ."

ఆమె ఉత్సాహమూ, అమాయకత్వమూ వెంకట్రావుని బాగా touch చేసినై. ఆమె నవ్వుతూన్నంత సేపూ తెలీకుండా తనూ నవ్వాడు. కుటుంబయ్య కునుకుపాట్లు పడుతో ఉలిక్కిపడి లేచి "అమ్మాయి, స్టేషను వచ్చిందా ?" అన్నాడు. "అప్పుడే ఏం స్టేషనూ!" అంది ఆమె. కుటుంబయ్య దగ్గు దగ్గి (ఉపన్యాసానికి సూచన) మొదలెట్టాడు :

"ఎప్పుడేనా వస్తోందనవోయ్ మావూరు. మా వంతెన రిపెయిర్ చేయిస్తామంటున్నారు. మావూరు మీ జ్యూరిస్‌డిక్షను క్రిందకే వస్తుందా ? వెనకవూరు, దోమ లెక్కువ ... అన్నట్టు మీవూళ్లో దోమలున్నాయా ... మున్సిపాలిటీ ఏం శ్రద్ధ తీసుకోదు కదా! నా కిప్పిస్తే చేస్తానుపని ... రావు! యీ నాటికీ నేను కోర్టుకి వెళ్లితే, ఒక్కలాయరూ ఎదురుగ నిల్చొని వాదించలేడనుకో. మేం యిప్పటి వాళ్లమా! మేం వోల్డు బిరేడ్లులం. అమ్మాయి చదువులా, ఫ్యాషనులా ? ... అమ్మాయి వీణ మహచక్కగా వాయిస్తుంది. భోజనం అవగానే అమ్మాయిపాట వింటేనే గాని నిద్రపట్టదుకదా! అసలు ఆరోగ్యం పోయిందిలే, డాక్టరుని మంచి టానిక్ యిమ్మనాలి ..."

ఒక విషయంలోంచి మరొకదాంట్లోకి దూకుతూన్న యీ ముసలిపెద్దరు ఉపన్యాసాన్ని "ఓహో, అలాగా" అంటూ కడదాకా విన్నాడు వెంకట్రావు. చివరికి స్టేషనువచ్చింది. కుటుంబయ్య, ఆమే లేచారు. "నేను వెళ్లివస్తానండీ,...మీ రింకా నన్ను గుర్తుపట్టలేదు." అంటూ ఫక్కున నవ్వింది. ఆశ్చర్యగా ఫీలయ్యాడు వెంకట్రావు. "గుడ్ యీవినింగ్, నేను నిర్మలని" అంటూ ఆమె కుటుంబయ్యతో, రైలు దిగి మాయమైపోయింది.

స్టన్ (Stun) అయిపోయాడు రావు. నిర్మల—కుటుంబయ్య మేనకోడలు నిర్మల! ఎంత మనిషి అయిందీ, ఎంత అందమైనదీ, ఆరేళ్లలో ఎంతగా ఎదిగిందీ, సుబురుగా పెరిగిన మొగలివనంలాగ. ఆ నవ్వు, కళ్లల్లో ఆ తెలివితేటలు... తను మరచిపోగలడా ? ఇలా ఆలోచించుకుంటూ తలెత్తాడు. ఎదురుగా ఒక గోమటీ, విధవా కూర్చున్నారు...

౨

"హలో, బ్రహ్మచారి" అని పలకరించాడు శంకరం, వెంకట్రావుని. 'బ్రహ్మచారి' అనేపదం గాలిలో మెలికలు తిరిగి ములుకుగా గుచ్చుకొంది రావుహృదయంలో. పార్కునుంచి వస్తోంటే పైపెచ్చు శంకరం ఇలా అన్నాడు: "ప్రేమ– ప్రేమ లేందీ బ్రతుకేమిటిరా! ఆఫీసునుంచి యింటికి వెళ్లగానే, నవ్వుతో ఎదురై, ఆదరించే ఆసక్తి లేకపోతే ఆజీవితం నరకం. ప్రేమలో ఎంత హాయి, ఆనందం, చైతన్యం ఉందిరా..."

"నిజమే! తను ఎవరినేనా ప్రేమించాడా? తనకి వివాహమాడే వయస్సు దాటిపోయిందేమో కూడా! ఆ ప్రేమానుభవం ఎలా వుంటుంది ? హాల్ కెయిన్, మొపాసా, సింక్లార్ మొదలైనవాళ్ల నవలలు చదివాడు. అంతే! ఒక స్త్రీకి పురుషుడికీ మధ్య యింత ఆకర్షణ, యింత రొమాన్సు దేవు డెందుకు పెట్టాడు. హాస్య, త్యాగం, ఆనందం... ఎవరికి జీవితం ప్రేమకోసమా! అంత ముఖ్యమా ప్రేమ...

"తన జీవితం చాలా చిత్రమైనది. కాలేజీలో చేరిన రెండేళ్లల్లో తల్లీ తండ్రీ చనిపోయారు, అప్పు మాత్రం మిగిల్చి. చదువు మానేసి వ్యవసాయంలో చేద్దామనుకుంటూంటే, మేనత్త— ఆ మేనత్తయింటికి తనెప్పుడూ వెళ్లలేదు. ఆవిడే ఒకటిరెండు సార్లు తన యింటికి వచ్చింది— చచ్చిపోతూ పాతిక ఎకరాలు తనకి రాసియిచ్చింది. అదృష్టం. అదృష్టం కాకపోతే, పరీక్ష ప్యాసవగానే వందరూపాయల ఉద్యోగం రావట మేమిటి, పై అధికారులచేత మెప్పు పొందట మేమిటి, అన్నిటికన్నా రైలులో ఆమెని— నిర్మలని కల్సుకోవట మేమిటి. చెల్లాల్ల యింటి ఆ అమ్మాయిని చూసి. అప్పట్నించీ మనస్సే అదోవిధంగా అయిపోయింది."

ఇలా ఆలోచించుకుంటూ, తన బంగాళాలోకి వెళ్లి కూర్చున్నాడు. నౌకరు వచ్చి, అతని బూట్సు విప్పి, రోజూ అనే మాట యీవాళా అన్నాడు: "బాబుగారు అలసిపోయారు." రాత్రి పడుకోబోయే ముందు కన్నయ్య నిలా అడిగాడు: "ఒరేయ్ ప్రేమంటే ఏమిటో తెల్సునురా." చాలాఅనుభవం ఉన్నవాడిలా, చిరునవ్వు నల్లని పెదవులమీదకు రప్పించి "ఆపదాని

మీాద మనసు అవటం" అన్నాడు వాడు. మరి శబ్దరత్నాకరంలో ఏం రాశారో!

ఉదయం లేచి, డ్రస్సు వేసుకొని కూర్చున్నాడు, వెంకట్రావు. కారు ఆగినచప్పుడయింది. వెంకట్రావు వీధిలోకి ఒక్క గంతేశాడు. కారులోంచి డిస్ట్రిక్టు యింజనీరు రాఘవరావు దిగాడు. వినయంగా ఆయన్ని ఆహ్వానించాడు రావు.

"నీ శ్రద్ధా, తెలివితేటలూ మెచ్చుకోదగినవోయ్. నేను నీ విషయంలో ప్రత్యేకంగా ఆదరం చూపిస్తాను." అని కాంప్లిమెంటు యిచ్చాడు రాఘవరావు, మీాసాల చాటున చిరునవ్వు దాచుకొని. "నర్సాపురం వంతెన రిపెయిర్ చేయించాలి. నీకే ఆ పని యిద్దామనుకొంటున్నాను. నువ్వు అనుభవం సంపాదించాలి. కంట్రాక్టర్లకి లొంగిపోగూడదు సుమీా. అన్నట్టు — మీా పేటలో శిశమ్మ మాంచి నెయ్యిపోయిస్తుందిటకదూ, రెండు వీసెలు మనకి పంపించు" అని పర్సుతీయబోయాడు. వెంకట్రావు ఆయన్ని వారించి, "ఎంతమాట, తర్వాత యిద్దురుగాని లెండి. సాయంత్రానికి పంపిస్తాను నెయ్యి" అన్నాడు.

ఆయన్ని సాగనంపి, మహానందంతో కుర్చీలో ఒక్క గంతేసి కూర్చున్నాడు. 'ఏక బంగళా బనే న్యారా' అనే పాటని వెయ్యిరకాల్లో పాడుతూ, గదిచుట్టూ తిరిగాడు. చాలా శాంతంగా, నెమ్మదిగా ఉండే యజమానికీ వెర్రి ఆవేశం ఎందుకో తెలియక "బాబుగారు చాలా అలసిపోయారు." అన్నాడు కన్నయ్య.

వారంరోజుల్లో ఆర్డరు వచ్చింది. హోల్డాల్, పెట్టె, కన్నయ్యా తోడురా నర్సాపురం బయల్దేరాడు రావు.

## 3

నర్సాపురం వచ్చి రెండురోజులైనా, కుటుంబయ్యగారి యింటికి వెళ్లేందుకు తీరిక లేకపోయింది రావుకి. అందుకని, కుటుంబయ్యగారే వచ్చి రావుని ఆహ్వానించి తీసుకువెళ్లాడు. కుటుంబయ్య చెల్లెలు చాలా ఆదరించింది రావుని. కన్నయ్య నిర్మలకేసీ, రావుకేసీ ఎగాదిగా చూసి "చిలకా గోరింకల్లా ఉన్నారు" అనుకొన్నాడు. నిర్మల తనవైపు తిరిగి మాట్లాడినప్పుడల్లా చొక్కా నలిగిపోయిందేమో ననీ, జుట్టు చెదరిపోయిందేమోననీ అనుమానంతో బాధపడి ఒంటరిగా అద్దంలో చూసుకొని సంతృప్తిపడేవాడు రావు.

భోజనాలయాక కుటుంబయ్య నిర్మలని పాడమన్నాడు. "ఇంజనీరుగారు వింటారు పాడవే" అంది లక్ష్మమ్మ. లక్ష్మమ్మ కుటుంబయ్య చెల్లెలు, అందమైనదీ, చదువుకొన్నదీ. భర్తపోయినప్పట్నించీ అన్నగారివద్దనే ఉంటోంది. "అచ్చంగా తల్లిపోలిక నిర్మల." అనుకున్నాడు రావు.

నిర్మల వీణను సున్నితంగా సుకుమారంగా మీటుతూ, కోకిలకంఠంతో పాడుతూంటే మరో ప్రపంచంలోకి వెళ్లిపోయాడు రావు. ఆమెకళ్ల కదలికా, పెదవుల వంపూ, నాజూకైన దేహమూ అతనికి ఒక సౌందర్యరేఖగా, ఆలేఖ్యంగా కనపడింది.

"అమ్మాయిని రేడియోకు రమ్మన్నారు. బహుశా ముందునెలలో ప్రోగ్రాం వుంటుంది." అంది లక్ష్మమ్మ.

"ఎలావుంది పాట" అంది, వీణ క్రిందపెట్టుతూ నిర్మల. అంతవరకూ ఆమెవైపే చూస్తోన్న కళ్లని మరల్చి, ఉలిక్కిపడినట్లుగా, "బావుంది, బావుంది" అన్నాడు. లక్ష్మమ్మ అతని రహస్యాన్ని గ్రహించింది.

ఎలా బయలుదేరిందో తెలియదుగాని, శరచ్చంద్రుని నవలలగురించి వాదనలోకి దిగారు రావూ, నిర్మలా. "ఆ ట్రాజెడీలు నాకు నచ్చవు.—ఉహుఁ! అంత నిర్దయగా చంపేస్తాడు." అంది నిర్మల. "లేకపోతే Purpose ఎలా నెరవేరుతుందీ! నిర్మలపైన ప్రేమ ఉన్నపుడు" అన్నాడు రావు. "ప్రేమ ఉంటేమాత్రం— దేవదాసులాంటి ఆవేశపరులూ, ఉన్మాదులూ దేశానికెందుకండీ. ఆశే జీవితంటండీ. కళ ఉంది, సంఘం ఉంది. ఏదో ఒకపనిలో నిమగ్నులవాలి, లేకపోతే తిని కూర్చోవాలి." అంది ఆవిడ. "మరి అది ప్రేమట. ప్రేమించి విఫలులైనవాళ్లు అలా అవుతారేమో మరి! నాకేం తెల్సును." అన్నాడు రావు ఆలోచిస్తూ. "మీా రెవర్నీ ప్రేమించలేదూ? అదేమిటండీ." అంటూ కిలకిల నవ్వుతూ, వీణతో, లోపలికి పారిపోయింది నిర్మల.

తను ప్రేమించాడా! పాతికేళ్లొచ్చినా అ ప్రేమ తన కొక స్వప్న భావమే కాని వాస్తవికంగా అనుభవిం

కాదా. అందరూ ప్రేమిస్తారు, ఒక్కడే యిలా అయిపోయాడు. ఈ సందేహాలు రావులో ఆలోచన రేపినై. కుటుంబయ్య యీజీచైరులోనే కునుకుపాట్లు పడుతున్నాడు. లక్ష్మమ్మ తనపూర్ణయాత్ర అనుభవాలు చెపుతూ యిలా అంది: "ఇంగ్లీషు రాకపోయినా, తెలుగుపత్రికలూ, పుస్తకాలూ నేనూ చదువుతోంటాను నాయనా. స్త్రీకి స్వతంత్రమూ, విద్యా వుండాలని నా ఉద్దేశ్యం. మానిర్మలని చూశావా. అన్నీ చదువుతుంది, వాదిస్తుంది, తెల్సుకొంటుంది. కాలేజీలోకూడా మాట్లాడిందిట...ఏదో దానిమీద ఆశ పెట్టుకొని ఉన్నాను. ఈ సెలవు లయాక మద్రాసు వెళ్లుతుంది. ఈ యేడాదిలో బి. యే. పూర్తి అవుతుంది. అంతవరకూ దాని పెళ్లిమాట తలపెట్ట దలుచుకోలేదు. కట్నాలూ, గిట్నాలూ ఏం యివ్వలేం సుమీ. దాన్ని చూసి చేసుకో వలసిందే...ఇంతకీ ఆ యోగ్యుడెవడున్నాడు."

ఆవిడదగ్గర్నుంచి సెలవు తీసుకొని, అర్థమవని భావాలు మనస్సులో కలవరపరుస్తూండగా, తిన్నగా లాడ్జికి వెళ్లాడు రావు. ఇంతలోకి కంట్రాక్టరు చౌదరి వచ్చి వంతెనదగ్గరకు తీసుకువెళ్లాడు, ఆలోచించేందుకు తీరిక యివ్వకుండా. చీకటిపడ్డాక తిరిగి వస్తోంటే, చౌదరి ఆ వూరినిగురించి విసుగెత్తేట్టు పొగిడాడు. ఒకపాడుకొంపను చూపించి, దానిచరిత్ర, పరమార్థమూ చెప్పి యిలా అన్నాడు: "రాత్రుళ్లు దెయ్యాలు కొరకంచులు చేతులతో పట్టుకొని యీ కొంపలో తిరుగుతోంటాయి. అమధ్య ఒకపిల్లాడు పొరుగూరినుంచి వస్తోంటే, దెయ్యాలు దారి తప్పించి చంపేశాయి. ఉదయానికి ఎముకలుమాత్రం మిగిల్చాయి."

వెంకట్రావుకి దెయ్యాలున్నవనే నమ్మకం లేకపోయినా, భయం ఎక్కువ. ఆ ప్రపంచాన్ని మరొకదాంట్లోకి మార్చేశాడు. విద్యాధికులకి అంతే-దెయ్యాలని నమ్మరుకాని, పిరికితనం!

బంగాళాకి వెళ్లగానే "బాబుగా రలసిపోయారు" అంటూ కన్నయ్య ఎదురయ్యాడు. రావు అతన్ని పరికించకుండా, గదిలోకి వెళ్లి మంచంమీద పడుకొన్నాడు. తల దిమ్ముగా వుంది. ఆనందమో ఏడుపో - ఏదో గుండెలో గుసగుసలాడుతోంది. తను అలవాటుపడి ఆనందించిన ఆగడి ఒంటరితనమూ, నిశ్శబ్దతా చాలా అసహ్యంగా చీకాకు కలిగిస్తున్నాయి. ఒక లేతపాదం యీచివరినుంచి ఆచివరికి నడిచి వెళ్లినట్లనిపించింది. తనలో తెలియరాని ఒక గొప్ప మార్పు వస్తోందనుకున్నాడు రావు. లేచి ఒక పుస్తకం తీసి పేజీలు తిరగవేస్తూ, అలాగే నిద్రపోయాడు.

ఉదయం లేచేటప్పటికి మంచి ఉత్సాహంగా ఫీలయ్యాడు. డ్రెస్సువేసుకొని తిన్నగా వంతెనదగ్గరకు వెళ్లి మధ్యాహ్నం వచ్చాడు. ఒక కునుకు తీసి లేవగానే, నిర్మల నవ్వు మొహం జ్ఞప్తికి వచ్చింది. తక్షణం టాయిలెట్ చేసుకొని, గుమ్మం దాటగానే కారులో కుటుంబయ్య, లక్ష్మమ్మ, నిర్మల!

"రావోయి, అలా తోటలోకి వెళ్లివద్దాం" అన్నాడు కుటుంబయ్య. రావు బెట్టుసరికి "కొద్దిగా పనుంది, కంట్రాక్టర్ని..." అంటూ నసిగాడు. "అఫీషర్లన్నా పనులు పనులంటా రేమిటండీ ఎప్పుడూ. ఆనందించ లేరుటండీ యిటువంటి యీవినింగ్సు? మీరు తప్పక రావాలి" అంది నిర్మల చిరుకోపంలో దరస్మితాలని మిళితంచేసి.

ఆపలుకులకోసమే వేచి ఉన్నాడు. ఒక్కమారుగా కారులోకి గంతేసి ఆమెని ముద్దెట్టుకొందా మనుకున్నాడు. లక్ష్మమ్మకూడా రమ్మంది. ఒక్కనిముషంలో వాళ్లందరూ తోటలో వున్నారు. "నారింజ బత్తాయి మామిడి...చక్కనితోట. ఎకరం పదిహేనువందలెట్టి మూడుఎకరాలు కొన్నాను." అన్నాడు కుటుంబయ్య సంతృప్తితో, గర్వంతో. తోటచుట్టూ తిరిగి లక్ష్మమ్మతో ఒకచోట కూలబడి, తన కోర్టుఅనుభవాలు చెపుతున్నాడు. రావూ, నిర్మలా ముందుకు సాగిపోయారు.

"నాకు తోటల్లో తిరగాలని సరదా" అంది నిర్మల.

"నాకున్నూ!"

"నా పెయింటింగులలో సహం యిక్కడ కూర్చొని వేసినవే" అంటూ ఆమె తన స్వవిషయాన్ని గురించి ధారాళంగా ముచ్చటించింది. రావు తన క్లబ్బు విషయాలు చెప్తూ యిలా అన్నాడు: "నాకు టెన్నిస్ అంటే ప్రాణం. ఒక కప్పుకూడా సంపాదించాను."

"నాకు టెన్నిసు ఆడేవాళ్లంటే యిష్టం.

సెన్స్ అంటే కోపం" అంది నిర్మల కొంటెగా. రావు ఉబ్బిపోయాడు ఆపలుకుల అర్థం ఎనలైజు చేసి!

దూరంగా త్రాచుపాము, హంతకుడి ఆలోచనలా, మెలికలుతిరుగుతూ వెళ్లింది. నిర్మల 'అమ్మో!' అంటో రావువొళ్లోకి ఒక్క గెంతేసింది. రావు భయంలేదని హెచ్చరించాడు. ఆమె అతని చేతుల్లోంచి తప్పించుకొని, ఏమీ ఎరగనట్టుగా "నాకు పాములంటే భయం" అంది. ఆమెస్పర్శ, వెంకట్రావులో జడంగాపడి ఉన్న శక్తుల్ని చైతన్యవంతంగా చేసింది. ఒక Thrill తన అణువణువులోనూ పొందాడు.

పచ్చనిచేలూ, పైరుగాలీ వారి తెచ్చికోలు మర్యాదలని ఒక మూలకిత్రోసి, ప్రకృతిస్వాతంత్ర్యంలోనికి లాక్కున్నాయి. తాను ఒక యింజనీరువనీ, ఆమె ఒకస్త్రీ అనీ మరచిపోయారు. నవ్వుకుంటూ శైశవ చేష్టలతో ఆడటం మొదలెట్టారు.

"ఆపండు ఎవరు ముందు అందుకుంటే వాళ్లది" అంటూ నిర్మల పరుగెత్తింది. రావు ఆమెని అనుసరించాడు. పండు రావుకే దొరికింది. "ఓడిపోయావు నిర్మలా!" అన్నాడు రావు. "మీవలె పరిగెత్తగలమా !" అంది వగరుస్తూ నిర్మల.

"మీరబలలు—అబలలు" అంటూ రావు ఆమెతో కలసి తిరిగివచ్చాడు. మధ్యలో సంభాషణని 'పెళ్లి - దాని చరిత్ర' లోకి మార్చాడు, ఆమె ఉద్దేశ్యం తెలుసుకొందామని. ఆమె యిలా అంది: "కొన్ని శక్తుల్ని అభివృద్ధిపరచుకొందామన్న వాళ్లకి పెళ్లి అనవసరం. కాని, ప్రతీసామాన్యుడూ పెళ్లి చేసుకోవల్సిందే!"

"నువ్వు ?"

"నేనా...నేనా...మీ రేంచేస్తారు." అంటూ నవ్వుతో సంభాషణ మార్చేసింది నిర్మల. పెళ్లి విషయం ఆడవాళ్ల నడగగూడదనీ, వాళ్లు సిగ్గుపడతారనీ తెల్సుకొన్నాడు రావు.

కారు ఎక్కినట్లూ, యింటికి వెళ్లినట్లూ జ్ఞప్తిలేదు రావుకి. గదిలో సామాను యిక్కడిది అక్కడా, అక్కడిది ఇక్కడా చేసి చిందరవందరచేశాడు. పావలా తీసి "ఏదేనా కొనుక్కొని తినరా" అని కన్నయ్య కిచ్చాడు. అతనితల వేడెక్కిపోయింది. అద్దంలో చూసుకొని నవ్వుకొన్నాడు. ఆమెముంగురుల్ని, ఎర్రని పెదవుల్ని, నవ్వేకళ్లనీ తల్చుకున్నాడు. కిటికీలోంచి ఆకాశంకేసి చూశాడు. మేఘాలు దట్టంగా క్రమ్మేసై. హోరున వర్షం వచ్చింది. సముద్రపుగాలి అతనిమొహానికి కొట్టుతోంది. ఆవర్షంలో తనూ, నిర్మలా తడిసి చలితో 'ఉహుహుః!' అంటూ ఇంటికి వస్తే ఎంత బావుంటుంది అనుకొన్నాడు.

ఎవరూ యిన్వెంటుచేయలేనివిషయం తను కనుక్కొన్నాడు. అది ప్రేమ — ప్రేమ! ఇన్నాళ్లకి ఆ తియ్యని అనుభవం పొందగలిగాడు. భావిజీవితం నిర్మలతో ఎలా గడపాలో ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.

## ౪

ఆ వారంరోజులూ కుటుంబయ్యగారికుటుంబంతో చాలా సరదాగా గడిపాడు. లక్ష్మమ్మ అతనికి రోజుకన్న రోజు ఎక్కువ ఆదరం చూపింది. ఇంక, చలాకీ నిర్మల! రోజూ పాటలు పాడేది, కథల్లు అనేకం చెప్పేది. విద్యావతి, ఉత్సాహవంతురాలు, తన కన్నివిధాలా సరిపోయిన యువతి—ఆమెని తప్పక వివాహం చేసుకోదలిచాడు. కాని, లక్ష్మమ్మ, బి. యే. అయితే కాని నిర్మలకి పెళ్లి చెయ్యదలుచుకోలేదు కాబట్టి అప్పటిదాకా ఎలాగో అలాగ ఓపికపట్టదలచుకున్నాడు. ఆ ప్రసంగం నిర్మలదగ్గర తీసుకువద్దామనుకొన్నాడు కాని, ఆమె ఏమి చెపుతుందో అన్న భయమూ, సిగ్గూ అతన్ని అడగనివ్వలేదు. అయినా ఒకసంవత్సరంగా, తను వేచి ఉండేది.

ఉదయం లేచి స్నానాది కృత్యాలు తీర్చుకొని, ఒక్కడూ యీజీచైరులో కూర్చొన్నాడు. ఆ సమయానికే నిర్మల చేతితో అట్టా, పెన్సిలూ పట్టుకొని వచ్చింది.

'నిర్మల!'—అలా వస్తుం దనుకోలేదు రావు.

"ఈవాళ మీరు వెళ్లిపోతున్నారుగా! ఈపది రోజులూ అలవాటు అవటంమూలాన్ని, మీరు వెళ్లుతున్నారంటే ఏదో కొత్తగా ఉంది. ఒక్కరూ గదిలో కూర్చొని ఏంచేస్తారు, రండీ, అలాతోటలోకి వెళ్లి Land-scape ని పెయింటుచేస్తాను, చూద్దురుగాని" రావు మాట్లాడకుండా ఆమెతో బయలుదేరాడు.

ఆర్టిస్టుకి కలిగే ఆవేశం కళ్లల్లో జ్వలిస్తూ ఉండగా, నిర్మల పెయింటింగు ఆరంభించింది. ప్రక్కనే నిల్చుని ఆనందిస్తున్నాడు రావు— ఆమె అంగుళులు దిద్దిన రేఖలకి కాదు, ఆమె భుజం వంపుకీ, వ్రేళ్లకదలికకీ, కళ్లల్లో వెలుగుకీ. మధ్యలో ఏమేమో చెప్పాడు, కాని ఆమె వినిపించుకోలేదు. పూర్తిచేసి, విజయచిహ్నం చూపుల్లో దాచి "ఎలా వుంది" అంది.

"చాలా బావుంది - నీ అంత బావుంది." అనాలనే అన్నాడు రావు.

చిరుకోపంతో చూసి ఊరుకొంది. రావు ఆమె చెక్కిళ్లపై సిగ్గు గులాబీలు పూయటం గమనించాడు.

సాయంత్రం కుటుంబయ్యా, నిర్మలా స్టేషనుకు వచ్చారు, వెంకట్రావుని సాగనంపటానికి. రైలు తప్పిపోయినా బావుండునే, రైలుపట్టాలు కదలిపోతే,— యిలా ఉన్నాయి రావు ఆలోచనలు.

"నేను యిరవై రోజుల్లో మద్రాసు వెళ్లిపోతున్నాను. మీరు ఉత్తరం రాస్తారా? మీ రెక్కడ, యింజనీరుగారు! మీకు మూర్ మార్కెట్టులోంచి చక్కని ప్రెజంటు కొని పంపిస్తాను. మీరు ఏం యిస్తారు?" అంది నిర్మల.

చెమ్మగిలే కళ్లతో, రావు రైలులోంచి చేరుమాలు ఊపాడు. నవ్వుతో నిర్మల, కుటుంబయ్యతో వెనక్కి తిరిగింది.

"సంవత్సరానికి అరవై రెండు నెలలు కాబోలు, వెధవ సంవత్సరాలూ, మాసాలూ" అని విసుక్కుంటున్నాడు రావు. కన్నయ్య తన తెలివి నంతా ఉపయోగించి, వేళ్లు లెక్కపెట్టి 'పన్నెండు' అన్నాడు.

రెండు నెల లయింది తను నర్సాపురంనుంచి వచ్చి. కాని, నిర్మలదగ్గర్నుంచి ఒక్క ఉత్తరమేనా రాలేదు. తనఫోటో పంపి, ఆమెఫోటోకూడా పంపమని ఉత్తరం రాశాడు. కాని జవాబు రాలేదు.

రోజూ ఉదయం లేవటం, ఆఫీసుపని చూసుకోవటం, సాయంత్రం క్లబ్బుకి వెళ్లటం, శంకరంతో కష్టసుఖాలు మాట్లాడుకోవటం — ఇదీ రొటీన్. డిస్ట్రిక్టుయింజనీరు రాఘవరావు గుండె ఆగి, హఠాత్తుగా చచ్చిపోయాడుట! శంకరానికి ఆడపిల్ల కలిగింది. క్లబ్బువర్ధంతిలో నాటకంవేస్తే 'అ' మూర్ఛపోయాడు. థియేటరులో మంచిపిక్చరే ఆడటం లేదు. రోడ్లు పాడైనవి రిపెయిర్ చేయించాలి, బాగున్నవి పాడు చెయ్యాలి. యుద్ధంలో అనేకమంది ప్రజలు చచ్చిపోతున్నారు. కన్నయ్యకి కాలిమీద కురుపులేచి, మానింది. బంగాళాదుంపలు సుబ్బయ్య కొట్టులో అయిపోయాయిట....ఇవీ విశేషాలు. వెధవ సంవత్సరాలు, వెధవ విశేషాలున్నూ! వెంకట్రావుకి యిరిటేషన్ ఎక్కువైంది.

ఒక రోజున సాయంత్రం శంకరానికి రహస్యం చెప్పేశాడు: "ఒరేయ్! నేను ప్రేమించానురా!"

"ఏడిశావ్."

"నిజం!"

"ఋజువు!"

"వినయితే కథ!" అని తన ప్రేమగాథని ఆవేశంతో చెప్పాడు.

"నువ్వు ఉత్తరం రాశావుకదా! ఫోటోకూడా పంపావుకదా! అయినా యీ రెండు నెలలకీ నీకు జవాబు రాలేదు. కాంక్లూజన్ ఏమిటి?—ఆమె నిన్ను ప్రేమించలేదన్నమాట." అన్నాడు శంకరం.

దిక్కుమొహంతో యింటికి వెళ్లిపోయాడు వెంకట్రావు. వీధిలో జట్కాబండి, దీపస్తంభం అన్నీ తన్ని చూసి పరిహాసిస్తున్నా యనుకొన్నాడు. తను నిర్మలతో గడిపిన రోజులు జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. "వెధవ శంకరం. వాడికి యీర్ష్య. లేకపోతే, నిర్మల నన్ను ప్రేమించకపోవట మేమిటి?" అనుకున్నాడు. "ఈవారంలో ఇంకొక ఉత్తరం రాస్తా. జవాబు రాకపోతే విషం మింగి పగ సాధించుకుంటా" అనుకున్నాడు. తర్వాతరోజున చిన్న వుత్తరం రాసి పంపాడు. "నీ ఉత్తరాలకి అయిదు వేస్టు పేపరు బేస్కెట్టు సరిపోలేదు. నీఫోటోలకి గోడలు సరిపోలేదు" అని రాశాడు. తన తెలివికి తనే సంతోషించాడు. లైబ్రరీలోంచి ప్రేమను గురించిన నవలలు తెచ్చుకొని చదవటం మొదలెట్టాడు.

వారం అయింది. జవాబు రాలేదు. 'రేపు' అంటే 'రేపు' అనుకొన్నాడు. పదిహేను రోజు లయింది; జవాబులేదు. "విషం మింగి ఎప్పుడూ చావను. ఛ!

ఇంతకంటె అందమైనదానినీ, విద్యావతినీ పెళ్లాడి, ఏడి పిస్తా" అనుకున్నాడు. ఒకవేళ ఆమె సిగ్గుపడిం దేమో. సిగ్గయితే, తనతో నర్సాపురంలో అలా అంత సరదాగా తిరుగుతుందా ? ఆడవాళ్లని నమ్మకూడదు.

ఆరోజున మధ్యాహ్నం యింటికి వెళ్లలేదు. స్నేహితుని యింట్లో భోంచేసి, సాయంత్రం క్లబ్బుకి వెళ్లాడు. అతనికి చీకాకూ, తలనొప్పీ ఎక్కువయినై. ఒకానొక వాదనలో "ఆడవాళ్లకి స్వతంత్రం యివ్వ కూడ దనీ, స్వార్థత్వమూ, మోసమూ వాళ్లలో హెచ్చు అనీ వాదించాడు. తర్వాత దీపస్తంభాలు లెక్క పెట్టుతూ యింటికి చేరాడు.

గుమ్మంముందు కన్నయ్య నుంచొనిఉన్నాడు. రోజూ అనేమాట ఇవాళ అనలేదు. "బాబుగారి కేదో పెద్ద పళ్లబుట్ట వచ్చింది. కమ్మనివాసన కొట్టుతోంది." అన్నాడు. ఒక వేళ ఏ కంట్రాక్టరేనా పంపా డేమో అనుకొని, తిన్నగా వెళ్లి వెంకట్రావు 'ఉస్సు' అంటూ కుర్చీలో కూలబడ్డాడు. కన్నయ్య ఒక పెద్దబుట్ట ఎదురుగా పెట్టి, చేతిలో ఒకకవరూ, పార్సెలూ పెట్టాడు. ఆతృతతో వెంకట్రావు కవరు తెరచాడు. నిర్మలదగ్గర్నుంచి. ఆనందంతో, స్పందించే హృదయంతో చదివాడు. అందులో ఉన్న సారం యిదీ— తను లాడ్జి మారటంవల్ల ఉత్తరాలు ఆలస్యంగా చేరినట్లూ, అదీ గాక, అతని ఆతృతని వృద్ధిపొందించటం తన కొక సరదా అనీ వ్రాసింది. "రాజకీయా లంటే ఈమధ్య నాకు సరదా కలిగింది. చాలా ఇంటరెస్టుతో చదువుతున్నాను... క్రితంనెల రేడియోలో నాపాట విన్నారా?... మీకు చాలా కోపం వచ్చి ఉంటుంది కదూ ఉత్తరం రాయలేదని... జీవితంలో నేను చేయవల్సిన పనులు చాలా ఉన్నా యనిపిస్తోంది. ఈ మధ్య ఆడవాళ్లం (విద్యార్థినులం) కలసి ఒక కల్చరల్ క్లబ్బు స్థాపించాము. కళలూ, విజ్ఞానమూ అభివృద్ధి పొందించ టానికి... యింజనీరుగారూ! ఎన్ని రోడ్లు రిపెయిర్ చేయించారు..." ఇలాగే ఏమేమో రాసింది. పార్సెలు విప్పాడు, ఒక చిన్న సెల్యులాయిడ్ బొమ్మ, బిడగలూన్న—ఫోటో! అచ్చంగా నిర్మల—ఆ నవ్వుతోన్న మొహమూ, ఆముంగురులూ, ఆమృదువైన చేతులూ...

ఆగలేని ఉద్రేకంతో ఆ ఫోటోని ముద్దెట్టుకొన్నాడు. గదితలుపులు వేసుకొని, ఉత్తరంలోని సుందరి అక్షరాల్లోని రహస్య హస్తవిన్యాసాన్ని తల్చుకొన్నాడు. ఈ శుభవార్త చెప్పినందుకు కన్నయ్యకి అయిదు రూపాయిలు బహుమానం యివ్వదలచుకొన్నాడు. ఆగదీ, టేబిలూ, గోడకి సాలీడూ, పుస్తకాల షెల్ఫూ— అన్నీ ఆనందంతో నవ్వుతున్నాయి.

తర్వాతరోజున ఆమెకి చాలా ఉత్సాహంతో పుత్తరం రాశాడు. ఆమె 'కల్చరల్ క్లబ్బు'ని పొగిడాడు. "నువ్వు నాకు దేవతవు" అన్నాడు ఒకచోట...

అప్పట్నుంచీ ప్రతీ పదిహేనురోజులకీ ఆమె దగ్గర్నుంచి ఉత్తరం వస్తోంది. ఎప్పుడూ సంగీతం గొడవా, కల్చరల్ క్లబ్బు విశేషాలూ. "స్త్రీ తల్చుకుంటే భారతదేశాన్నే కాదు, ప్రపంచాన్నే మార్చి వెయ్యగలదు. ప్రపంచకల్యాణం మా చేతుల్లో ఉంది." అని రాసింది ఒకచోట. ఆ ఉత్తరాలు, మంత్రాలు చదివిచదివి విసుగెత్తిన పురోహితుడికి మొహంలాగ ఉన్నా, వాటిల్లోనే కొత్త సొంపులూ, కొత్త అర్థాలూ కనిపెట్టుతున్నాడు వెంకట్రావు.

అయిదునెలలు యిలా గడిచినై. నిర్మలఫోటో చక్కని ఫ్రేములో అమర్చబడి బల్లమీద నవ్వుతోంది. హేమంతాలూ, శ్రావణాలూ అన్నీ ఒక వసంతంలా గున్నాయి రావుకి. రోజులు లెక్కిస్తున్నాడు. క్యాలెండర్లు తయారు చేసినవాళ్ల బుద్ధిహీనతని దూషిస్తున్నాడు. ఆ వూళ్లో ఒక చిన్న మేడని అద్దెకు మాట్లాడి ఉంచాడు, భావిజీవితం నిర్మలతో గడిపేందుకు. సంసారానికి కావల్సిన సామాను లేమేమిటో, రాత్రింబవళ్లు ఆలోచించి ఒక పట్టీ తయారు చేశాడు. ఆ పట్టీలో, ముందు పుట్టబోయే వంశోద్ధారకుడికి పాలపీకలూ, తోపుడుబండీ, నిర్మలకు పియానో, కుంచెలూ, కావ్యాలూ కూడా ఉన్నాయి. ప్రొవిన్షియల్ యింజనీర్ల సభలో ఉత్సాహంగా పాల్గొన్నాడు. కార్యనిర్వాహకవర్గంలో సభ్యుడైనట్టు ఆంధ్రపత్రికలో పడింది. పేపరుకటింగు ఒకటి నిర్మలకి పంపించాడు.

పెళ్లి అయి, సంసారం సాగిస్తూఉన్న మిత్రుల యింటికి తరుచు వెళ్లి, వాళ్ల సౌఖ్యమూ, వాళ్ల సొంపూ, సొగసూ చూసి నేర్చుకునేవాడు. "రహస్య మంటే

చక్కని దేశమే కాని, కేమిటీ — కుటుంబ సౌఖ్యం ఉండదోయ్" అనేవాడు సోషలిస్టు కామ్రేడున్నతో. తను వర్ణాపురం వెళుతూన్నట్టు నిర్మల దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. కాని ఆమె తేదీ సరిగా వ్రాయక, 'మూడు నాలుగు రోజుల్లో' అని వ్రాసింది. రెండు రోజులు కాళ్లు పడిపోయేట్టు స్టేషనుచుట్టూ తిరిగి ఆశాభంగం పొందాడు. "రాత్రిబండికి వెళ్లిందేమో" అని సమాధానపరచుకొన్నాడు.

వర్ణాపురం వెళ్లి లక్ష్మమ్మని కల్సుకుని, పెళ్లి విషయం మాట్లాడుదామని నిశ్చయించాడు. కాని యింతలోకే అతనికి ప్రభుత్వం పని తగిలించింది. వారం రోజు లోపికపట్టి, ఆశతో, ఆనందంతో, ఉత్సాహంతో, కన్నయ్యని యింటిదగ్గర వుంచేసి, 'సిరికిం చెప్పడు' అన్నంత వేగంతో బయలుదేరాడు. మానవుడికి రెక్కలు ఉండటం చాలా అవసరమని యింజనీర్సు సభలో తీర్మానించటానికి నిశ్చయించుకొన్నాడు.

౬

ఏడాదిక్రిందటినిర్మలకన్న యీ నిర్మలలో సౌందర్యం యినుమడించింది. ఆమెకళ్లల్లో వసంతాలు నవ్వుతున్నై. ఆమె శరీరపు కదలికలో, పెదవి వంపుల్లో జవ్వనపు బిగిబిగి గోచరిస్తుంది. గులాబీరంగు రిబ్బను కొసను కట్టిన వాల్జడ సౌభాగ్యానికి సోపాన పరంపరలా ఉంది.

కుటుంబయ్యకి దగ్గు ఎక్కువయింది. లక్ష్మమ్మ చాలా సంతోషంతో ఆదరించింది. మొదటిరోజున నిర్మల అంతగా మాట్లాడలేదు రావుతో. ఏదో పుస్తకం తీసుకొని మేడమెట్లమీద కూర్చొని సాయంత్రం వరకూ చదువుతోంది. కొత్తగా నేర్చుకొన్న పాటలు పాడింది, తన యాక్టివిటీస్ ననుసరించి చెప్పింది. ఆమె చలాకీతనానికి గాంభీర్యము తోడై కొత్త అందాన్ని కూర్చింది.

మరుసటిరోజున లక్ష్మమ్మదగ్గర బిడియ పడుతూ వివాహప్రసంగం తెచ్చాడు. లక్ష్మమ్మ యిలా అంది: "నాయనా, నిన్నే అడుగుదామను కొంటున్నాను. కావల్సినవాడవూ, ఉద్యోగస్థుడవూ, యింతకన్న నాకు కావల్సిం దేమిటి? అమ్మాయి కూడా యిష్టపడుతుందనే నా ఉద్దేశ్యం. ఎప్పుడా ప్రసంగం తెచ్చినా, 'నీ కెందుకు, నీ గొడవ కావ దం టుంది. అయినా ఈవాళ అడిగి చూస్తాను. చదువు కొన్న వాడవు; దొరలల్లా మీరే ఆలోచించుకోండి."

లక్ష్మమ్మ అడిగి చెప్పేవరకూ రావు ఓర్పు పట్టలేకపోయాడు. మధ్యాహ్నం నాలుగు గంటలకి నిర్మలగదిలోకి వెళ్లాడు. నిర్మల వీణవాయిస్తోంది.

"నిర్మలా!"

"ఊఁ!"

"నీతో ఒక విషయం మాట్లాడాలి."

"చెప్పండి."

"ఇక్కడ కాదు - తోటలో!"

ఆమె విశాలమైన కళ్లెత్తి రావుకళ్లల్లోకి చూసింది. ఆమె బుగ్గ లెర్రబడ్డాయి. కాని ఏమీ తెలియనట్టు 'అలాగే' అంది.

తోటలో మామిడిచెట్టుక్రింద నిల్చుని ఆమె వడిగాడు, ఆమె చేతిని తన చేత్తో పట్టుకొని. ప్రకృతి పవిత్రమైన గంభీరత దాల్చింది. పచ్చని చేలు ఎండలో మెరుస్తున్నాయి. ఆవేశం రావుగొంతులో 'జలజలించింది.'

"నిర్మలా! నేను చెప్పబోయే విషయం నీకు తెలిసే ఉంటుంది. నేను తల్లిదండ్రులు లేనివాణ్ణి. స్వశక్తి చేత యీ స్థితిలోకి వచ్చాను. నాకు నూట పాతిక రూపాయిలజీతము, మేనత్త రాసియిచ్చిన పాతిక ఎకరాలు నా ఆస్తి...... నాకు జీవితంలో ('జీవితం' అని ఉచ్చరించినపుడు అతని గొంతు వణికింది. అతని బ్రతుకు తన ఎదురుగా నిల్చొని నవ్విన ట్లనిపించింది.) ఏ లోటూ లేదు - ఒకటి తప్ప. నా కష్టసుఖాల్ని పంచుకొందుకు, నా ప్రేమకు తిరిగీ ప్రేమ యివ్వటానికి, నా యింట్లో ఒక దేవత—ఒక చిరునవ్వు— ఒక స్త్రీ...(అతని గొంతు తిరిగీ ఒణికింది.) నిన్ను ప్రేమిస్తున్నాను నిర్మలా! నీ ప్రేమ అమూల్యం. నిన్ను పెళ్లి చేసుకోవాలని నా కోరిక. నీ తల్లి యిష్టపడింది. నువ్వు, నువ్వు...ఒప్పుకోవాలి అంతే."

నిర్మల ఒకమారు రావుకేసి చూసి రెప్పలు క్రిందకి వాల్చింది. రావు ఆమెచేతిని నొక్కుతూ,

"చెప్పు నిర్మలా!" అన్నాడు. ఆమె తిరిగి అతనికేసి చూసి రెప్పలు వాల్చింది. అవమానం చిరుమంటలా రావుగుండెలో సెగల్ని జల్లుతోంది. తిరిగీ అడిగాడు రావు. స్ఫుటంగా, మృదువుగా నిర్మల యిలా అంది:

"మీరు వేరొకవిధంగా తలిస్తే నేను చెప్పలేను. నాకు మీమీద విముఖభావం లేదు. ఈ ఏడాదిలో నా ఉద్దేశ్యాలు మారిపోయినై. కళకీ, సంఘానికీ సేవచేయటానికి నేను కంకణం కట్టుకొన్నాను. నాకు పెళ్లి చేసుకొనే ఉద్దేశ్యం ఏమీ లేదు. మీకు కష్టం కలిగిస్తే క్షమించండి. కాని యిది నిశ్చయం."

రావు ఆమెచేతిని వదిలివేశాడు. కళ్లమ్మట పొంగివచ్చే నీళ్లు, పగిలిపోయే గుండె కనపడకుండా, వెనక్కు తిరిగి, ముఖం చేతుల్లో దాచుకు చరచరా వెళ్లిపోయాడు. 'రావు, రావు' అని పిలుస్తున్న నిర్మల కేక అతను వినిపించుకోలేదు. నిర్మల యింటికి వెళ్లింది; రావు కన్పడలేదు. "అర్జంటు పని అంటూ వెంకట్రావు మాబండికి వెళ్లిపోయారమ్మాయి!" అంది లక్ష్మమ్మ. నిర్మల జాలితో నిట్టూర్చింది.

౭

వెంకట్రావు కొన్నాళ్లు వీధిలోకి వెళ్లలేదు. నిర్మలఫోటో శంకరానికిచ్చేశాడు. ఒక్కడూ ఆకాశం కేసి చూస్తోండేవాడు—మబ్బులు, నక్షత్రాలు, చీకటి, పవలు, సంధ్య, అన్నీ ఆ తెరమీద నాటకమాడుతూండేవి ఈ ఏకాంతప్రేక్షకుడికోసం.

రోజులూ, వారాలూ, నెలలూ గడిచినై. వెంకట్రావు వీధిలోకి వెళ్లటం మొదలెట్టాడు. ఆ వూరి కంట్రాక్టరుతో రోజూ ఒకగంట బాతాఖానీ, రెండు గంటలు పేక ఆడేవాడు. సాయంత్రం క్లబ్బుకి వెళ్లి నలుగురితోనూ కలిసి కూర్చునేవాడు. కాని "చాలా మితభాషి అయ్యాడురా రావు" అనేవారు స్నేహితులు. యుద్ధాన్ని గురించీ, ఆరోగ్యశాఖని గురించీ, టెన్నిస్ను గురించీ అందరూ చెప్పుకొనే కబుర్లు విని, ఆలస్యంగా ఒక్కడూ చీకట్లో యింటికి వెళ్లేవాడు. "బాబుగారు అలసిపోయారు" అంటూ కన్నయ్య ఎదురుగా వచ్చేవాడు.

ఏడాది గడచింది. అతనిలో ఒకవిధమైన అసంతృప్తీ, అశ్రద్ధా పాదుకొనిపోయినై. ఆ రోజున చిన్న భోజనపదార్థాలు ఏవీ కూడా చెప్పలేదు. శంకరంతో యిలా అనేవాడు: "ఆరోజులు వేరోయ్! కాని ఆమె నా జీవితాన్ని ధ్వంసంచేసింది." ఎవరేనా తన వివాహప్రస్తావన తెస్తే, చిరునవ్వుతో యిలా అనేవాడు: "ఇరవై ఆరేళ్లొచ్చాయండి — అదే, ఇరవై యేడు వచ్చింది. అంటే సగం జీవితం అయింది. ఆ సగమూ సుఖంగా యిలా పోనివ్వండి!" అతను ఉద్యోగంవిషయంలో యిదివరకటికన్నా పట్టుదల ఎక్కువ చూపాడు. జీతంలో యింక్రిమెంటువచ్చింది.

సాయంత్రం పొలాలగట్లనుంచి వస్తూ వివిధ వృక్షాల్ని పరికించేవాడు. కన్నయ్య ఆ ఏడాది వర్షాల్ని గురించీ, రైతుల కష్టాల్ని గురించీ చెప్పేవాడు. రోడ్డుమీదకు రాగానే "ఓహో! యింజనీరుగారా! నమస్కారం" అని పలకరిస్తారు ఒకరు.

"కనపడటం మానేశారేం" అంటాడు రావు.

"మా చిన్నవెధవకి ఒంట్లో బాగా లేదు. అదీగాక మాఅమ్మాయి పురుడుకొచ్చింది."

"అలాగా?"

"మా రోడ్డువిషయం మీరు కొద్దిగా దయ ఉంచాలి."

"ఏంరోడ్లండీ! గవర్నమెంటు కాబాయం తగ్గిపోతోంది. ఈడిస్ట్రిక్టుబోర్డు వచ్చాక మరీ అధ్వాన్నం అయిపోయింది." అంటూ చిన్నగా దగ్గుతాడు రావు.

"మరేనండీ! ఈమున్సిపాలిటీలు-'అమ్మిరాజు' ఛైర్మను అయాక దరిద్రమే పట్టుకొంది. 'ఓ' అంటే 'న' రాదు,డబ్బుపోసి పదవిసంపాదించాడు."

"కలికాలం!"

"చూడండి ఈమురికికాల్వలూ...అబ్బ, వెధవ దోమలూ, వెధవ యిదీన్ని" అంటాడు ఆ పెద్దమనిషి.

అక్కణ్ణుంచి తిన్నగా యింటికి వెళ్తాడు రావు. కొత్తమిత్రుడు గోపాలం యం. యస్ సి. వస్తాడు. తెలివైనవాడూ, మంచివాడూ కాని, అహంభావపు పాలు ఎక్కువ. నోబుల్ ప్రయిజ్ తనకి ఎప్పుడో వస్తుందనే నమ్మకం—తను ముందు చేయబోయే రిసెర్చికి. తర్వాత భోజనం, అఫీసుకాగితాలు చూసుకోవటమూ, కిటికీలోంచి విశాలమైన బయలు చూడటమూ. కన్నయ్య "పెళ్లాంమీద బెంగ పుట్టింది, సెలవిప్పించండి"

అంటాడు. ఆ నక్షత్రాలు ఒక్కొక్కటే రాలిపోతే, యింజనీర్లు ఆకాశానికి రోడ్డువేస్తే, దెయ్యాలు తన్ని love చేస్తే — ఇలా ఆలోచించుకుంటూ భయంతో నిద్రపోతాడు. ఉదయం తన పక్కమీదనుంచి లేవకుండానే దాసీది రావటం, అంట్లు చప్పుడు చెయ్యటం, కన్నయ్య దానితో సరసా లాడటం వింటాడు. లేచి స్నానంచేసి డ్రెస్సువేసుకొంటాడు. తిరిగీ ఆఫీసుపని. సాల్యూటుచేసేవాళ్లకి సాల్యూటుచేస్తూ, కేబిన్లో చిరునవ్వు మిళితంచేస్తూ మాట్లాడాలి. అందరూ 'యింజనీరుగారు' అంటూ గౌరవిస్తారు; అంతేకాని, ఒక పద్దెన్మిదేళ్లపిల్ల చేతిలో వోడిపోయాడనీ, ఆమె వెనకాల ఉన్మాదుడులా తిరిగాడనీ ఎవరికి తెలుసు? సాయంత్రం క్లబ్బుకి! తిరిగీ యుద్ధాన్ని గురించీ, రేడియోని గురించీ కబుర్లు. వసంతరావు తన రసికత్వాన్ని గురించి సగర్వంగా విశదపరుస్తాడు. ప్లీడరు రామచంద్రరావు పార్కులో మొక్కల్ని గురించీ, శ్రీనివాసరావు రేడియో రిపెయిర్లనిగురించీ లెక్చర్లిస్తారు. అమ్మిరాజు తను సన్నంగా ఉండేటందుకు మార్గాలు చెప్పమంటాడు. చివరికి అందరూ పేకాడుతారు. తనకి ఎప్పుడూ నష్టం వస్తుంది. రాత్రి ఒక్కడూ యింటికి వెళ్తాడు. కన్నయ్య "బాబుగారు అలసిపోయారు" అంటూ, చీకటి నవ్వుతో ఎదురౌతాడు.

పీడకలలు వచ్చిన పెద్దనిద్రలాగ, మూడేళ్లూ గడిచిపోయాయి. వెంకట్రావుకి జీతం రెండువందల దాకా పెరిగింది. అతనికి ప్రపంచంలో ఆనందించవల్సిన వస్తువూ, విచారించవలసిన విషయమూ ఏమీ లేవు. నిజానికి అతనిదృష్టిలో అన్నీ ఒకటే! ఏడుపూ, నవ్వూ లేనివాడు తనొక్కడే అనుకొన్నాడు.

ఆరోజున ఒక్కడూ సిగరెట్ కాలుస్తూ యీజీచైరులో పడుకొని ఆలోచిస్తున్నాడు, దేవుడు కూడా లేడా అని. తను చాలా పెద్దవాడైపోయినట్టూ, వృద్ధాప్యాన్ని సమీపిస్తున్నట్టూ తల్చుకొని ఉలిక్కిపడ్డాడు. కన్నయ్య ఒక్కగంతేసి "అమ్మాయిగారు వచ్చేరండి." అన్నాడు.

"ఎవరురా?"

"అమ్మాయిగారు — నర్సాపురం అమ్మాయిగారు."

దీనంగా, ధైర్యంగా చూస్తూ, నిర్మల గుమ్మం ముందు నుంచొంది. రావు ఆమెఅకస్మాత్ ఆగమనానికి తెల్లబోయాడు. ఏమనాలో తెలియక కంగారుపడ్డాడు.

"నేను రావటం మీకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది." అంది నిర్మల, పేలవంగా నవ్వుతో. వెంకట్రావు తేరుకొని లేచి ఆమెని ఆహ్వానించాడు. అతను చాలా నెమ్మదిగా మాట్లాడాడు:

"కుటుంబయ్యగారు క్షేమమా?"

"పోయారు – ఏడాది అయింది."

'పాపం!' అన్నాడు రావు. నిర్మలలో పూర్వపు చలాకీతనమూ, అయస్కాంతంలా ఆకర్షించే పెర్సనాలిటీ అంతలేదు. ఆమెలో వెలిగే సహజమైన నవ్వు లేదు. ఆనవ్వుయొక్క మాసిపోయిన ఛాయలుమాత్రం కన్పడుతున్నాయి.

"మీ అమ్మగారేం చేస్తున్నారు?"

"కాశీ వెళ్లిపోయింది కోపంవచ్చి."

"ఏం — నిర్మలా?"

"నేను పెళ్లి చేసుకోనన్నానని."

తర్వాత మౌనం. గతసంగతులు జ్ఞప్తికి వచ్చి, ఇద్దర్నీ కలచివేశాయి. వెంకట్రావు కిటికీలోంచి ఆకాశంకేసి చూస్తున్నాడు; పిల్లమబ్బులు గంతులేస్తున్నాయి, లేగదూడలలాగ. ఇంతకీ ఆమె ఎందుకొచ్చింది?

"ఈగది అంతా యింత చిందరవందరగా ఉందేం? ఆడదిక్కులేందే మగవాళ్లు యిలాగే ఉంటారు" అంది నిర్మల. ఆపలుకుల్లో ఆశా, ఆత్రుతా, పరితాపమూ సుడిగుండాల్లా ధ్వనించాయి. తొమ్మిది గంటలకి రావు ఆఫీసుకు వెళ్లిపోయాడు. నిర్మల రావు యింట్లోనే ఆగిపోయింది. సిగరెట్టుపీకలూ, పుస్తకాలూ, కాళీఅగ్గిపెట్టెలూ, పాతబట్టలూ — గది అంతా అసహ్యంగా వుంది. తిరిగీ రావు సాయంత్రం యింటికి వచ్చాడు. గుమ్మానికెదురుగా నిర్మల నవ్వుతో నుంచొంది. ఇదివరకటికన్నా ఆమె పెద్దదయింది. ఆ సమయంలో తిరిగీ నిర్మలలో పూర్వపునవ్వూ, కళ్లల్లో వెలుగూ కలిగినై. రావు యిల్లంతా చూశాడు. అన్నీ చక్కగా అమర్చబడి ఉన్నాయి.

"నిర్మలా—మన్వేనా?" అన్నాడు రావు.

"ఏం, బావూ లేదూ" అంది నిర్మల. వెంకట్రావు మాట్లాడలేదు. నిర్మలకి కష్టమనిపించింది.

"కోపమా మీకు, స్వతంత్రం తీసుకున్నాననీ?"

"కాదు నిర్మలా! చాలా సంతోషం. కాని నామనస్సుకి పూర్వపుగది శాంతీ, సంతోషమూ యిస్తుంది."

నిర్మల వులిక్కిపడింది. అతనిలో ఎంతభేదం కలిగిందో, మానసికంగా! రావుదగ్గరగా కుర్చీలో కూర్చుని తన్నుగురించి యిలా చెప్పింది: "నేను యితర యాక్టివిటీస్ మానేశాను, నాకు విసుగెత్తింది. అవన్నీ భ్రమలు ... అందరూ విమర్శించేవారే! నాకున్న ఉత్సాహం యితరులికి లేదు. నాకోసమా అనిపించింది. అవన్నీ భ్రమలు ... రావు. లేకపోతే స్త్రీలకు పబ్లిక్ జీవితం ఏమిటి?"

'నిజం' అన్నాడు రావు.

"నిజం — ఈనాలుగేళ్ల జీవితమూ — ఎంత వృథా చేశానో!"

రావు ఆమెకేసి చూశాడు. ఆమెలో పశ్చాత్తాపమో, బాధో వ్యక్తమవుతోంది.

ఇద్దరూ కలిసి షికారు వెళ్లారు పొలాలగట్లకి. రావు తనఆఫీసుపనుల్ని గురించి ముక్తసరిగా చెప్పాడు. ఒకరి హృదయంలో తరుకొస్తే ఆశా, నిరాశా, మరొకరి హృదయంలో మోడుపోయిన నైరాశ్యమూ నీడలలా, దెయ్యాలులా కదులుతున్నాయి. ఎక్కువసేపు యిద్దరూ మౌనంగానే ఉన్నారు.

ఇద్దరూ క్యారేజీభోజనంచేశారు. మధ్యగదిలో రావూ, ప్రక్కగదిలో నిర్మలా పడుకొన్నారు. వరండాలో కన్నయ్య గుర్రుపెట్టుతున్నాడు.

పన్నెండుగంట లయింది. రావు పడుకొన్నదీ లేందీ చూద్దామని నిర్మల రావుగదిలోకి వచ్చింది. రావు రెండుచేతులతో తలని పట్టుకొని కుర్చీలో కూర్చొన్నాడు. "మీరు నిద్రపోలేదా?" అంది నిర్మల.

"......"

"జబ్బుచేస్తుంది."

"నాకు అలవాటే!"

"తల అల్లా పట్టుకున్నారేం?" నిర్మల అతన్ని సమీపించి అతనికణతల్ని తాకింది. అవి కొట్టుకుంటున్నాయి.

"తలనొప్పి ఎక్కువగా ఉందా?"

"అంత ఎక్కువ లేదు."

నిర్మల తనగదిలోకి వెళ్లి అమృతాంజనంతో తిరిగి వచ్చింది. "చేతులు తియ్యండి, రాస్తాను. నాకు చెప్పలేదేం? ఎందుకు ఊరికే అలా బాధపడతారు?" అని అతనికణతల్ని తాకబోయింది. వెంకట్రావు ఆమెని వారించి, ఆమెచేతిలోని డబ్బాతీసి బల్లమీద పెట్టాడు. ఆమె అక్కడ కొంతసేపు నుంచొంది. అవమానం ఆమెకి దుర్భరమైంది. తడబడుతూ ప్రక్కగదిలోకి వెళ్లి కూలబడింది. ఒకనిముషానికి వెంకట్రావుకు వెక్కి వెక్కి యేడుపు వినపడింది. ఆమెగదిలోకి వెళ్లి "ఛ! నిర్మలా, ఏడుస్తున్నావా?" అన్నాడు.

"నేను రావటం మీకింత కష్టంగా ఉందని నాకు తెలియదు. నేను మీకు అవసరసమయంలో సేవ చేయకూడదూ? మనపూర్వస్నేహం మరచిపోయారా!" ఆమె యింకా తలగడలో మొహం కప్పుకొని ఏడుస్తో ఉంది.

"లేదు నిర్మలా..."అతనిగొంతుక బరువెక్కింది. "నేనేం చేస్తున్నదీ నాకొక్కొకసారి తెలియదు. నీరాక నాకు కష్టం కలిగించలేదు. నీకు కష్టం కలిగిస్తే క్షమించు. నాయింటికి వచ్చిన స్నేహితురాలివి, అతిథివి. నీసౌఖ్యం చూడవలసిన విధి నాకుంది" నిర్మల తల పైకెత్తింది.

"మీకు నేను అంతేనా? అతిథినేనా? మీ జీవితానికి యింక ఎందుకూ ఉపయోగపడలేనూ?" ఆమె గొంతు గద్గదికమయింది.

"నాకు జీవితమనేది వుంటే అది జరిగిపోయింది. నాకు కోరికలు లేవు. అందుమూలాన్ని ఒకరిసాహాయ్యం అవసరమని అనుకోను. నాకు రొటీనా అలవాటయింది. జీత మిస్తారు పనిచేస్తాను — అన్నింట్లోనూ అంతే"

"ఇంక ఎందుకూ ఉపయోగపడలేనా మీజీవితానికి? చెప్పండి, చెప్పండి" ఆమె విహ్వలతతో అడిగింది.

"నిర్మలా, ఒకరికొకరు పనికివస్తా రనుకోవటం పిచ్చిపూహ. పడుకో నిర్మలా! తలితండ్రులు లేరు

నీకు. ఈగృహంలో ఎవరికేనా నీడనిస్తాను, నాకు సంపాదనాశక్తి ఉన్నంతవరకు. అలా యిచ్చేందుకు భగవంతుణ్ణి శక్తి యిమ్మని ప్రార్థిస్తాను."

"ఎంత మారిపోయారు మీరు!" అంది నిర్మల, కళ్లు ఒత్తుకుంటూ. ఆమె తల ఎత్తేటప్పటికి రావు అక్కడ లేడు. చలిగాలి తలుపుసందుల్లోంచి కీచుమంటూ వీచింది.

ఉదయం రావు లేవగానే కన్నయ్య వచ్చి "అమ్మాయిగారు వెళ్లిపోయారు బాబూ! మీతో చెప్పమన్నారు" అన్నాడు.

"ఎంతసేపయింది?"

"ఇప్పుడే-వీథిలో ఉంటారు."

వెంకట్రావు గుమ్మంలోకి వెళ్లాడు. ఫర్లాంగు దూరంలో కారుదుమ్ముల్లో నిర్మల నడిచి వెళ్లిపోతోంది—స్టేషనుకి!

౭

ఎనిమిదినెలలు గడిచాయి. ప్రభుత్వం వెంకట్రావుని ఫారెస్టురేంజికి బదిలీచేశారు. ఒకరోజున కన్నయ్యతో, సామానుతో బయల్దేరాడు రావు.

ఆవూళ్లో మూడువందలగడపకన్న ఎక్కువ జనాభా లేదు. రెండుమైళ్లదూరంలో అరణ్యం కన్పడుతుంది. ఆవూళ్లో ఒక పెంకుటిల్లు అద్దెకు తీసుకొని ఉంటున్నాడు రావు. కాని అక్కడ అతనికి భోజన సదుపాయం లేదు. ఒక నెల జరిగాక శంకరానికి ఉత్తరం రాశాడు వంటలక్కనిగాని, బ్రాహ్మడినిగాని పంపమని. పదిహేనురోజుల్లో కేశాలున్న విధవ సుందరమ్మ వచ్చి పొయ్యి రాజేసింది.

ఆ వూళ్లోవాళ్లకి, ప్రక్కగ్రామాలవాళ్లకీ యింజనీరుగారు ప్రత్యక్షదైవం. పులితోళ్లూ, దుప్పిచర్మం, కొమ్ములూ, అల్లోనేరేడిపళ్లూ, యింకా వివిధములైన ఫలసముదాయాలూ ప్రతీవారం వెంకట్రావుకి భక్తిశ్రద్ధలతో అర్పించేవారు. వాళ్ల ఆచారవ్యవహారాలు చిత్రంగా ఉన్నై. వాళ్లు మాట్లాడే తెలుగు ఒక్కొక్కసారి అర్థమయ్యేదికాదు. పట్టణాల్లో ఉండే కృత్రిమత్వం, అతితెలివీ అక్కడ లేవు. కష్టపడి పనిచేసుకుంటారు, అనుభవిస్తారు. పార్టీప్రభుత్వాలూ, యుద్ధాలూ, ప్రజావాదమూ, సామ్యవాదమూ, ఆత్మహత్యలూ, కోర్టు దుమ్మూ, సినీమాలూ, ప్రేమలూ, విరహాలూవారిని బాధించవు. కడుపునిండా తింటారు, కిలకిలా నవ్వుతారు! సలహాలకి వెంకట్రావుదగ్గరకే వస్తారు.

నాలుగునెలల్లో అతనిలో మార్పుకలిగింది. అతని కళ్లల్లో జాలి గోచరించేది. అతనిజీవితం కరగి కళ్లల్లోకి వచ్చిందా అనిపిస్తుంది. తిరిగీ, ఇదివరకటి రోటీను—జడత్వమూ!

ఆ వూరినీరు పడక అతనికి పెద్ద జబ్బు చేసింది. దగ్గర్లో డాక్టరు ఎవరూ లేడు. ఊళ్లోఉన్న భిషగ్వరుడు చెంచయ్య మందిచ్చేవాడు. రెండురోజులు స్మృతి లేకుండా పడిపోయాడు. రాత్రింబవళ్లు సుందరమ్మ, ఏమరక, అతనికి ఉపచారంచేసింది. ఆమెఓర్పుకి ఆశ్చర్యపడ్డాడు. ఆమెతో "మీ ఋణం ఎలాతీర్చుకోను" అన్నాడు. నెల్లాళ్లకి జబ్బుతగ్గింది. చెంచయ్యకి యాభైరూపాయలిచ్చాడు. అంతడబ్బు అతడెప్పుడూ కళ్లతో చూడలేదు. జీవితాంతంవరకూ, తన వైద్యశక్తినిగురించీ వెంకట్రావు దాతృత్వాన్నిగురించీ చెప్పుకొనేవాడు. రెండునెలలలో పూర్వపు జవసత్వాలు సంపాదించాడు వెంకట్రావు.

శంకరానికి వుత్తరం రాశాడు, కొన్నిచీరలూ, సామానులూ పంపమని. సుందరమ్మ ఆ విలువగల చీరలన్నీ చూసి "నా కెందుకండీ యివన్నీ" అంది. "కట్టుకోండి తప్పేముంది." అన్నాడు రావు. సుందరమ్మ అవి ధరించటానికి భయపడేది.

ఆరోజున వెంకట్రావు అర్ధరాత్రి ఉలిక్కిపడి లేచాడు. వెన్నెల విరగకాస్తోంది. 'శవంమీదకప్పిన తెల్లబట్ట'లా ఉందనుకొన్నాడు. ఇంతలో ప్రక్కగదిలోంచి సన్నగా ఏడుపు వినపడింది. నిర్మల జ్ఞప్తికి వచ్చింది. ఆ గదిలోకి వెళ్లాడు. కిటికీలో కూర్చొని బయలు చూస్తోంది సుందరమ్మ. ఆమె నల్లనిపొడుగాటిజుట్టు ఆమె ఒడల్నికప్పింది. వెన్నెలవెలుగులో ఆమెవదనంమీద నీటిబొట్లుచూశాడు రావు.

"ఏడుస్తున్నారా?" అన్నాడు.

'లేదు' అంటూ, ఆమె సిగ్గుతో, తడబాటుతో లేచింది.

"ఎందు కేడవటం? — గతాన్ని మరచిపోండి." అన్నాడు దయతో.

"నాకు గత మనేది లేదు, నాకు జీవితమే లేదు. నన్ను ఆదరించేవారు లేరు. 'నా' అన్నవారు లేరు. నేను బాల్యంలోనే విధవ నయాను." ఆమె ఏడుస్తోంది చిన్నపిల్లలా.

'ఏం' అన్నాడు వెంకట్రావు. చీకట్లో నడిచే వాడికి దీపంకన్న మరొకపాంథుడు ఎక్కువ సహాయంగా ఉంటాడు. అందుకే వెంకట్రావుకి క్యూరియాసిటీ ఎక్కువయింది.

"నేను ఒకవిధవకి జన్మించాను. నాతల్లి నన్ను అమ్మేసింది, హోటలు పెట్టుకొన్న వెంకమ్మకి. కాని దానిప్రియుడు ఒప్పుకోలేదు. ఆవెంకమ్మ నన్ను పిల్లలు లేని తండ్రికి అమ్మింది. ఆయన ఎన్మిదేళ్లదాకా విద్యాబుద్ధులు చెప్పించి, ఒకడికి పెళ్లిచేశాడు. ఆతర్వాత చచ్చిపోయారు పెంపుడుతండ్రీ, మొగుడూనూ — ఒకే ఏడాదిలో. ఆ తర్వాత ఒకరింట్లో పిల్లల నెత్తుకొనే దాన్ని. అక్కడ నాలుగేళ్లు పనిచేసి మానేశాను. తిండి లేక ఒకరోజున ఒకడికి మానాన్ని అమ్మాను. అప్పట్నుంచీ, ఆవూరువిడిచి నేటిదాకా వంటచేస్తున్నాను. నూరుసార్లు అమ్ముడుపోయాను!"

వెంకట్రావుహృదయం కరిగింది. జాలితో ఆమెబుజంమీద చెయ్యి వేశాడు. ఆమె ఆశతో, కాంక్షతో చూసింది. వెంకట్రావు, తెలియనికాంక్షచేత ప్రోత్సహింపబడి ఆమెని కవుగలించుకొన్నాడు.

నాటినుండీ, సుందరమ్మ అతనికి వంటలక్క, భార్య, ఆదరించే తల్లీనూ. ఆమెను 'మీరు' అనే పిలిచేవాడు.

ఒకఏడాది గడిచాక, వెంకట్రావు, ఆమెకోరిక మీద ఆమెని కాశీ పంపించాడు. రెండు నెలల్లో ఆమె తిరిగి వచ్చి కాశీవిశేషాలు చెపుతూ యిలా అంది: "పాపం, వర్ణాపురంనుంచి లక్ష్మమ్మ అనే ఆవిడ నాలుగేళ్ల నుంచి అక్కడ ఉంటోందిట! పోయింది, వారం క్రితం."

'అరెరె!' అన్నాడు వెంకట్రావు.

మూడేళ్లు గడిచాయి. ఒకనాడు రావుకి ప్రభుత్వపు ఆర్డరు వచ్చింది. విప్పిచూశాడు; తనకు డిస్ట్రిక్టు యింజనీరుపదవి యిచ్చింది ప్రభుత్వం. ఆనందంతో, సుందరమ్మతో యిలా చెప్పాడు: "రెండు నెలల్లో మనం మనజిల్లా వెళ్లిపోవచ్చు. అక్కడ సుఖంగా ఉంటుంది."

సుందరమ్మ కడుపుతో ఉంది. ఆమె గర్భవిచ్ఛిత్తి చేసుకొంటానంది. కాని రావు ఒప్పుకోలేదు. "నా ప్రతిరూపాన్ని చంపుకోలేను. నాకు మూడువందల రూపాయల జీతం వస్తోంది. నాజీవితం, నా పేరు నాతో అంత మవకుండా ఒకకొడుకు కావాలి నాకు" అన్నాడు. ఈమూడేళ్లనుంచీ, వారి మధ్య జీవితం చాలాగౌరవంగా నడిచింది. ఒకరితో ఒకరు అట్టేమాట్లాడుకోరు. సుందరమ్మను 'మీరు' అనే పిలిచేవాడు. కాని ఆరోజున సుందరమ్మ కొత్తమార్గం తొక్కింది. "నన్ను మీరు మన్నిస్తే నేనిక్కడ ఉండలేను. మీలో ఒకభాగంగా మెలసుదామనుకొంటూన్న నాకు, మీరే సర్వంఐన నాకు—" ఆమెకళ్లమ్మట నీటిబిందువులు పొర్లినై. వెంకట్రావు తెల్లపోయాడు. ఆమెమీద అతనికి జాలీ, దయా ఉన్నై. 'ప్రేమ' అనేదిఅతనుమరచిపోయాడు, పాతిపెట్టేశాడు. ఒక్కొక్కసారి 'ప్రేమ'కల్లఅనీ, అది భక్తులకి పూనే ఆవేశంలా యువకులకి పూనుతుందనీ అనుకొనేవాడు. కుటుంబసౌఖ్యానికి స్త్రీపురుషుల మధ్య పరస్పరావగాహనా, అనురాగమూ కావాలనీ, ప్రేమ కవులకీ, రచయితలకీ వదలివెయ్యాలనీ అతని ఉద్దేశ్యం. అయినా, అతను ఏ విషయంలోనూ ఎక్కువ ఉత్సాహం తీసుకోలేదు. అతనిలోని శక్తులు మ్రోడు చెందాయి. తనకి స్త్రీన్నీ, కొడుకూ అవసరం. అదిగాక సుందరమ్మ అంటే అతనికి 'సింపతీ' ఉంది. అయినా, నవ్వుతో సుందరమ్మతో యిలా అన్నాడు. "నిన్ను మన్నించటంలేదు సుందరమ్మా! అలవాటుచొప్పున అనుకొంటున్నాను. నీసౌఖ్యం నా సౌఖ్యం" ఆరోజునుంచీ 'నువ్వు' అనేవాడు. సుందరమ్మ ఆనందంతో పొంగిపోయింది. "ఆయన యింటికి వచ్చేటప్పటికి అబ్బాయి ఎదురుగా వెళ్లి 'నాన్నా' అని పిలుస్తాడు. ఆయన అబ్బాయిని ముద్దెట్టుకుంటా"రని ఆలోచిస్తోందేది.

విధినల్లని పెదవులు వారి జీవితాన్ని ముద్దెట్టుకొన్నాయి. నెల్లాళ్లకి, పురిటిగండంవచ్చి తల్లీ పిల్లా చనిపోయారు. ఆరోజున భోరున ఏడ్చాడు వెంకట్రావు. కాని తర్వాతరోజున మామూలుమనిషి అయాడు. నాటినుంచీ నవ్వుఅంటే అతనికి రోతపుట్టింది. కొన్నాళ్లకు,కన్నయ్యతో,గోదావరిజిల్లాకు ప్రయాణంకట్టాడు.

౬

తిరిగీ మూడేళ్లవరకూ వెంకట్రావుజీవితం సాఫీగా సాగిపోయింది. వొంటరితనమూ, నిరాశా అతనిలో పాతుకుపోయినై. చూపు సరీగ్గా ఆనటంలేదు. ఆరోగ్యం క్షీణించటం మొదలెట్టింది. జ్ఞాపకశక్తి తగ్గిపోయింది. ఆఫీసులో డవాల్ బంట్రోతుమీదా, యింట్లో కన్నయ్యమీదా విసుక్కోవటం, గొణుక్కోవటం ప్రారంభించాడు. ఆఫీసునుంచి వస్తే, ఏదో చూసి ఆలాగే నిలబడిపోయేవాడు.

ఒక కంట్రాక్టులో ప్రభుత్వానికి యాభైవేలు నష్టం వచ్చింది. కంట్రాక్టర్లు రావుకళ్లల్లో దుమ్ము పోసి, సొమ్ము అంతా నుంజుకొని, తిరిగీ రావుమీదే కేసు పెట్టారు. రావు ప్లీడరునైనా పెట్టుకోలేదు. ప్రభుత్వం రావుని డిస్మిస్ చేసింది. పదివేలరూపాయలు రావు కాజేశాడని, అందుకుగాను అతనికున్న యిరవై ఎకరాల భూమిలో పదిఎకరాలు ప్రభుత్వం స్వాధీనపరచుకొంది. వెంకట్రావు ఏమీ బాధపడలేదు. కన్నయ్యమాత్రం మానేశాడు, జీతం తగ్గించారనే నెపంమీద.

వెంకట్రావు పదిఎకరాలూ అమ్మేశాడు, ఎనిమిది వేల రూపాయలికి. రెండువేలుపెట్టి ఒక పెంకుటిల్లు కొన్నాడు ఒకగ్రామంలో. ఒకకొత్తనౌకరుని పెట్టుకొన్నాడు. 'ఇంత యిల్లెందుకు' అనుకునేవాడు. నౌకరుతో 'నా యిల్లుకదరా!' అనేవాడు. ఒకబక్కపిల్లిని చేరదీసి దాన్ని పెంచమని నౌకరుకు ఆర్డరిచ్చాడు. కాగితాలు చిరిగిపోయిన భాగవతపుస్తకం తీసి ఆనందభైరవిరాగంలో చదివేవాడు.

వెంకట్రావుకి గుండెజబ్బుచేసింది. డాక్టర్లు మద్రాసు వెళ్లమన్నారు. పదిహేనువందల రూపాయలు ఖర్చుపెట్టి మద్రాసులో ఒకఏడాది ఉండి జబ్బు నయం చేసుకొన్నాడు. మద్రాసునుంచి వస్తూంటే ఒకదిక్కులేని పన్నెండేళ్లపిల్లను తనతో తీసుకువచ్చాడు. ఆమెకి 'సుందరమ్మ' అని నామకరణం చేశాడు. ఒకగురువుని నియోగించి సంగీతం చెప్పించేవాడు. ఆమె 'తాతయ్యా' అని పిలుస్తోండేది రావుని.

రోజూ సాయంత్రం మాలగూడెం వెళ్లేవాడు. ఆపూటకు తిండిలేనివాళ్లకి పావలా అర్ధా యిచ్చేవాడు. పొరుగింటి లచ్చన్నగారితో తన యింజనీరు గొడవలు చెప్తూండేవాడు. ఇలా రెండేళ్లు గడిచాయి అతనికి బ్యాంకులో రెండువేలుమాత్రం మిగిలినై.

ఒక పట్టభద్రుణ్ణి వెదకి తీసుకువచ్చి, సుందరమ్మకి పెళ్లి చేశాడు. వెయ్యిరూపాయలుకట్నం, అయిదువందలు ఖర్చులు చేశాడు. కన్నీళ్లతో సుందరమ్మని అత్తవారింటికి పంపించాడు. "మాతో వచ్చి వెయ్యి తాతయ్యా" అని ఏడ్చింది. "ఇప్పుడు కాదు, ముందు వస్తానమ్మా" అన్నాడు. జీవితంలో ఒక అనాథ బాలిక నుద్ధరించానుగదా అని సంతృప్తిపడ్డాడు.

క్రమంగా అతని నిల్వసొమ్ము ఖర్చు అయిపోయింది. "చేతుల్లో శక్తివున్నంతవరకూ సుందరమ్మ యింటికి వెళ్లి వాళ్లను బాధించను" అనుకొన్నాడు. ఒకబియ్యపుకొట్టులో గుమస్తాగా కుదిరాడు, యిరవై రూపాయల జీతానికి.

వెంకట్రావు శక్తిహీనుడైపోయాడు. గడ్డం బాగా పెరిగింది. దగ్గు తిరిగీ వస్తోంది, మనిషి వంగిపోయాడు. మాలపల్లెలో పిల్లలు హాస్యంచేసేవారు. కాని నవ్వలేకపోయేవాడు రావు.

మిట్టమధ్యాహ్నం. అందులో వేసవికాలం. యజమాని ఆజ్ఞప్రకారం, వెంకట్రావు ఆ సామానుతో, మూడుమైళ్లదూరంలో ఉన్న పొరుగూరు వెళ్తున్నాడు. అతనిపాదాలూ, తలా మాడిపోతున్నై. తన పూర్వజీవితాన్ని తల్చుకొన్నాడు. ఎండిపోయిన గుండెలో ఏమూల ఒక నీటిచుక్క ఉందో, అది కళ్లలోంచి పెకుల్చుకు వచ్చింది.

తిన్నగా పొరుగుగ్రామానికి వెళ్లి, ఒకకాలువలో నీళ్లు తాగి, ఒకయింటిఅరుగుమీద కూర్చొన్నాడు విశ్రాంతికోసం. నాలుగయిదేళ్లపిల్లాడు 'బూచాడు' అంటూ యింట్లోకి వెళ్లి ఏడవటం మొదలెట్టాడు. ఒక ముప్ఫైఆరేళ్లస్త్రీ గుమ్మంనుంచి తొంగి చూసి "ఎవరు తాతా, ఏవూరుమీది" అంది. వెంకట్రావు కునుకుపాట్లు పడుతో 'పక్కవూరే' అన్నాడు.

"ఏమైనా పిల్లలూ,మనుమలూ నా తాతగారూ" అంది ఆవిడ, గుమ్మందగ్గర అరచాటుగా నించొని. ఇంతలోకి, ఆ అయిదేళ్లపిల్లాడువచ్చి 'తాతయ్యా' అంటూ వొళ్లో కూర్చున్నాడు.

"నీ పేరేమిటి" అన్నాడు వెంకట్రావు.

"వెంకట్రావు" అన్నాడు ఆ పిల్లాడు.

"నా పేరూ వెంకట్రావే" అన్నాడు రావు.

"అందుకే తాతయ్యవ్" అన్నాడు ఆపిల్లాడు.

ఆపిల్లాడు పేర్లు చెప్తున్నాడు: "ఆడి పేరు రామం, ఆడి పేరు లచ్మీనారాయణ."

"వీన్నీ పిల్లల పేర్లా?" అన్నాడు వెంకట్రావు.

"ఊఁ! అమ్మ పేరు నిర్మల, అమ్మమ్మ పేరు లచిమమ్మ..." అన్నాడు పిల్లవాడు.

వెంకట్రావుగుండెలో శతఘ్ని పేలినట్లయింది. తల పైకెత్తి చూశాడు గుమ్మందగ్గరఉన్న స్త్రీని. చిక్కిపోయిన చెక్కిళ్లూ, ఊడిపోయినజుట్టూ, మాసిన బట్టలూ — యీమె నిర్మల, నిర్మలేనా? ఆమె ఏదో చెప్తోంది. "ఆయన పోయారు తాతగారూ, మా అమ్మ రాసిచ్చిన పదిఎకరాలమీద బ్రతుకుతున్నామండి. కష్టాలు వచ్చాక మన మేంచేస్తాం తాతగారూ!"

వెంకట్రావు వినిపించుకోలేదు. ఆతృతతో "కుటుంబయ్యగారు ఏమవుతారమ్మా" అని అడిగాడు.

"మామయ్య అవుతారు, మీకెలా ఎరుగుదురు? అయితే యింజనీరు వెంకట్రావుని ఎరుగుదురా తాతగారూ!" అంది ఆవిడ. ఒకనాటి ప్రియురాలు తన్ని 'తాతగారు' అని పిల్చింది. భూమి గిర్రున తిరిగినట్టయింది. జారిపోయేగుండెను ఒకచేత్తో పట్టుకొని, ఒకచేత్తో మొహం కప్పుకొని అక్కడనుంచి తిన్నగా యింటివైపు వెళ్లిపోయాడు. ఈహఠాత్ ప్రవర్తనకి ఆశ్చర్యపడింది నిర్మల. 'పిచ్చాడు తాతయ్య' అన్నాడు ఆపిల్లవాడు.

వెంకట్రావు యింట్లో మంచంమీద కూలబడ్డాడు. ఇల్లుఅంతా నిశ్శబ్దంగా ఉంది. పిల్లి 'మ్యావు' అంటోంది. సూర్యుడూ, చంద్రుడూ, చుక్కలూ భూమిమీద ఒక్కసారిగా రాలినై. నల్లని సముద్రపుచీకటికెరటాలు జీవితపు గట్టుల్ని ఒరసికొన్నాయి.

అతనిలో ఉత్సాహమూ, ఆనందమూ నాశనమయిపోయాయి. అతనికళ్లు, ఏదో పోగొట్టుకొన్నట్టు బీదగా చూస్తోంటాయి. వర్షాకాలంలో బోదురుకప్పల బెకబెకలూ, వసంతంలో కోకిలకూజితాలూ అతనికి ఒకటే! రాత్రిళ్లు నక్షత్రాలు కనపడితే, ఉదయం దీపాలు అక్కర్లేకుండా వెల్తురు వస్తుంది. ఆకలికి అన్నం తింటారు, తినటంమూలాన్ని పెరుగుతారు, యవ్వనంలో కామిస్తారు, వృద్ధాప్యంలో-చచ్చిపోయే రోజులు సమీపించినకొలదీ, చాలాకాలం బ్రతుకుతామనే ఆశతో జీవిస్తారు. శ్రావ్యంగా పాడేవాడికీ, పాటరానివాడికీ ఒకటే హృదయం ఉంది. "నీకంటె నేను గొప్పవాణ్ని" అంటానికి ఎవరికీ హక్కు లేదు. ఒకరికి కవిత్వం రాయటంలో, ప్రకృతిని ఆనందించటంలో శక్తి ఉంటుంది, మరొకరికి హృదయాన్ని కరడుకట్టించుకొని, చీకట్లని చెదజల్లేశక్తి ఉంటుంది. తోచక దెబ్బలాడుతారు. తెలివితేటలెక్కువై, ప్రభుత్వాలూ, యుద్ధాలూ, విప్లవాలూ, కోర్టులూ కల్పించుకుంటారు. జీవితంలో నగ్నసత్యం తెలుసుకొని, నవలలూ, సినీమాలూ, రోమాన్సులూ చూసి ఆనందిస్తారు. ఎవరికి ప్రతీజీవితం ప్రత్యేకజీవితం. ఒకరికీ ఒకరికీ సంబంధం లేదు. ఆశకు అంతులేదు. అంతానికి ఆశ కారణం. ఇది ప్రపంచం, ఇది జీవితం.



# 1941, జూలై

1. సర్ చిర్రావూరి యజ్ఞేశ్వర (సి. వై.) చింతామణి గారి నిర్యాణము.
,, వేలూరు జెయిలునుండి ౫౨౦ మంది సామాన్య ఖైదీల విడుదల.
2. ఫెడరల్ కోర్టుజడ్జిగా సర్ మహమ్మద్ జఫరుల్లా ఖానుగారి నియామకము.
5. విశాఖపట్టణములో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నాచురల్ సైన్సు కళాశాల భవనములకు శంకుస్థాపన.
7. భారత శాసనసభలగడువు పొడిగింపు ఉత్తరువు.
11. డా. బుర్రా శేషగిరిరావుపంతులుగారి నిర్యాణము.
,, సిరియాలో యుద్ధపు ఆపుదలకు ఉత్తరువు.
13. సిరియా యుద్ధవిరామపుటొడంబడిక పత్రములో ప్రతినిధుల సంతకములు.
17. బందరులో పురాణం సూరిశాస్త్రిగారి మృతి.
18, 19, 20, 21. ఏలూరులో ఆంధ్రసారస్వత పరిషత్సభలు.
19. భారత కొనుగోలు సంఘాధ్యక్షులైన సర్ షణ్ముఖం చెట్టిగారి అమెరికాపయనము.
21. బర్మా — ఇండియా వలస ఒడంబడిక
,, వైస్రాయి కార్యనిర్వాహకసంఘవిస్తరణము
,, జుడిషియల్ కమిటీ సభ్యత్వమునకు రైటానరబుల్ యం. ఆర్. జయకర్‌గారి రాజీనామా.
23. మల్లాది రామకృష్ణచయనులుగారిమరణము.
24. జపాను — ఇండోచైనా ఒడంబడిక
27. సిరియాయుద్ధ పరిసమాప్తి.
29. మద్రాసుకు రాజప్రతినిధి రాక.

---

# కలగూరగంప

## ❀ పురాణకాలమునాటి విమానములు ❀

విమానముల ప్రస్తావములు రామాయణమునను, భారత భాగవతములందును, పురాణాదులందును పలుమారు తగులుచుండును. ఆకాశములో పక్షు లెగురుట జూచియు, నేలమీద బండ్లు, నీటిలో నోడలు నడచుట జూచియు ఆకాశమున సంచరింపగల విమానములను పూర్వు లూహించి వానిని పుస్తకములలో నెక్కించిరా, లేక ప్రత్యక్షముగ వారికి విమానము లుండినవా? ఆ గ్రంథములందును మనుష్యసామాన్యులకు విమానము లుండిన ట్లగపడదు. ఎక్కడనో ఏ గంధర్వులకో ఏ సిద్ధ విద్యాధరులకో యుండినట్లే యున్నది. దిక్పాలురకును ఉండినవి. కుబేరుని పుష్పకవిమానమును రావణాసురుడు బలాత్కారముగ దీసికొనినట్లు రామాయణమున జూడగలము. అవన్నియు పౌరాణికములని త్రోసివేయుదగదు. కలికాలమున దాదాపు రెండువేలయేండ్ల క్రింద బుట్టిన పంచతంత్రములో మిత్రభేదతంత్రమున నున్న కథయందుకూడ విమాన ప్రశంస గలదు. (కళాప్రపూర్ణ మహోపాధ్యాయ వెంకటరాయ శాస్త్రులవారి ప్రతిది విచిత్రమగు కథ).

ఊరక విమానముల జెప్పుటయేగాక అవి కామగమనము గలవనియు దెలుపబడుచుండును. కామగమనములనగ వాని ఇష్టమువచ్చిన చొప్పున అవిపోవుచుండునను భావము గాదు. కర్ణధారుని (Pilot) యిష్టము ప్రకారము పోవునవిగ నుండవలయును. అట్లు గాక ఆ విమానములు తమ యిష్టముచొప్పున పోవుచుండిన వానిపై నెక్కివచ్చు నాయకునికి ఇష్టసిద్ధి కాజాలక పోవును. కాబట్టి కామగమనము లనగ ఇపుడు ఇంగ్లీషున డిరిజిబిల్సు (Dirigibles) అను మాటకు పర్యాయముగ నుండును. అనగా విమానమును నడుపువాడు తనకు కావలసిన దిక్కునకు దానిని నడుపగలడు.

ఇప్పుడు యూరోపులో జరుగుచుండు యుద్ధములో విమానములనుండి బాంబులు, విషవాయువులు మొదలగు ప్రాణహారకములగు వస్తువులు ప్రయోగింపబడుచున్నట్లు వార్తాపత్రికలలో చూచుచున్నారము. ఇట్టి ప్రాణహానికరములగు పనులు పూర్వీకుల విమానములను చేయగలిగియుండినవి. ఉదాహరణము కావలయునన్న సాళ్వరాజు సౌభక మను విమానముమీద కృష్ణుని రాజధానియగు ద్వారకమీదికి దాడివెడలివచ్చి "విమానయుతంబుగ వ్రత్రపీథికిన్, గొదకొని యుప్పుమై నెగసి కొంకక శక్తి శిలా మహీరుహ, ప్రదరములోలిమై గురిసి బంధురభూమిపరాగ శర్కరల్, వదలక చల్లుచున్ వలయవాయువుచే దిశ లావరించి"నటుల భాగవతమున దశమస్కంధోత్తర భాగమున రాకేంద్ర పద్యములో నున్నది.

ఇంకొక విశేషమును గలదు. ఇప్పటి ఐరోపీయ బాంబులలో విషపూరితమగు వాయువు శత్రుసైన్యములపై విడువబడుచున్నట్లు వార్తాపత్రికలవలన తెలియుచున్నది. సాళ్వుని సౌభకము 'వలయవాయువు'ను విడుచునట. వలయవాయువనగా సుడిగాలి. అతి తీవ్రమగు సుడిగాలి మనుష్యులనుగూడ అట్లట్లె సుడిలో అంబరవీథి కెగరగొట్టుకొని పోగలదు. ఐరోపీయులకు సుడిగాలిని సృష్టించు విద్య తెలిసినట్లు లేదు. ఇప్పటి బాంబులలో అగ్నిద్రావకములు, ఇనుపముండ్లు మొదలగువాని నుపయోగింతురట — ఆ ప్రాతకాలపువారి కగ్నిద్రావకములు, పెట్రోలు లేవు కాబోలు. వారి బాంబులు రాళ్లు, గుండ్లు వర్షించుచుండిన ట్లీపద్యము వలన తెలియుచున్నది. బహుశః వారు విమానములను ఏదైనా బిస, లేక కీలు (Spring action) మీద నడుపుచుండిరి కాబోలును.

ఇప్పటి ఐరోపీయుల విమానములు కొన్ని ఆకాశమునను, అక్కరపడినపు డవియె నీటియందును సంచరింపగలిగియుండునటుల పత్రికలలో చదువుచుందుము. సాల్వుని సౌభకముయొక్క విచిత్రగతులను ఐరోపీయు లిప్పటి కింకను కనుగొనినట్లు లేదు.

"ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు
నొకమాటు ధరణిపై నొయ్య నిలుచు
నొకమాటు శైలమస్తకమున వర్తించు
నొకపరి చరియించు నుదధినడుమ
నొక్కతోయంబున నొక్కటిరై యుండు
నొక్కెడ గనుగొన నెక్కు లగును
నొకమాటు సాశ్వసంయుక్తమై పొడసూపు
నొకతోయ మన్నియు నడిగితోఁచు
నొక్కచేప కొలవియుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు ... "

నీటిమీద సంచరించు నేర్పు ఐరోపీయులును కనుగొనిరి గాని విమానమును శైలమస్తకమున వర్తించునట్లు జేయుట వారు కనుగొనినట్లు మరియు లేదు. ఒకతేప ఒక్కటిగ అగపడుటయు, మరుక్షణమున ననేకములుగ అగపడుటయు ప్రాచీనుల విమాననిర్మాణనైపుణ్యమును తెలుపగలదు (భాగవతము దశమోత్తరభాగము, ౭౮౮ పద్యము).

పైన చెప్పిన సౌభవిశేషము లన్నియు పోతనామాత్యుని యూహా లేమో యని సందేహము కలుగవచ్చును గాని సంస్కృతభాగవతమునను ఈ విచిత్ర విచేష్టితముల కాకరము లున్నవి.

(౧) దశమస్కంధోత్తరార్ధము అ. ౭౬, శ్లో. ౧౦-౧౧
"సగోపురాణి ద్వారాణి ప్రాసాదాట్టాలతోళికాః,
విహారాన్ సవిమానాగ్ర్యాన్ని పేతుః శస్త్రవృష్టయః.
శిలాద్రుమా శ్చాశనయః సర్పా ఆసారశర్కరాః,
ప్రచండ శ్చక్రవాతోఽభూత్ రజసాచ్ఛాదితా దిశః.
ఇత్యర్ద్యమానా సౌభేన కృష్ణస్య నగరీ భృశం"

(౨) "బహురూపైకరూపం తద్దృశ్యతే నచ దృశ్యతే,
మాయామయం మయకృతం దుర్విభావ్యం పరైరభూత్.
క్వచి ద్భూమౌ క్వచి ద్వ్యోమ్ని గిరిమూర్ధ్ని జలే క్వచిత్.
అలాతచక్రవ ద్భ్రామ్య త్సౌభం తద్దురవస్థితం"

ఇట్టి యద్భుతవిద్య లెట్లుత్పన్నమైనవియో? రాజపోషణ లేక కాబోలు? విమాననిర్మాణాదుల దెలుపు గ్రంథములయిన నిలిచియున్నవా? (నానావిధములగు ఓడలు మనదేశమున ఈస్టుయిండియా కంఫినీ వారి పాలన ప్రారంభ మయిన తరువాత చాలకాలము వర్ధిల్లుచుండినట్లు తెలుపు గ్రంథములు ప్రాతకాలపు రిపోర్టులు గలవు. ఇటీవల విశాఖపట్టణమున నౌకా నిర్మాణస్థానము నేర్పరుచుకొనుటకై ఆర్యులు కొందరు జరిపిన సభలో బాబూ రాజేంద్రప్రసాదుగారు మన దేశములో ఓడల జేయుచుండుటను గూర్చియు, ఆ వృత్తియు వ్యాపారమును ఎట్లు నశింపుచేయబడినదియు విపులముగను, సప్రమాణముగను చెప్పియున్నారు. స్వాతంత్ర్యము హరించినట్లెల్ల కారుశిల్పములును నశించుచున్నవి. ఇట్టి స్థితిని జూచియే కాబోలు, "ధిగస్తు పరవశ్యతా" యని సీతాదేవి ఘోషించినది.

—వంగోలు వెంకటరంగయ్య.



# విమర్శనము

## అనుత్తీర్ణ అస్పృశ్యత
(Unpassed untouchability)

రచయిత : శ్రీ వి. వెంకయ్యగారు. ప్రాప్తిస్థానము: వి. పరశురామయ్యగారు, ౨౫, మన్నారు రెడ్డివీధి, త్యాగరాయనగరు, మద్రాసు. వెల అ. ౮.

ఇందలిభాష ఆంగ్లము. ప్రస్తుతకాలం ఈదేశమందు అమలులో వున్న విద్యావిధానము సర్వవిధాలా దేశహితకరమైనది కాదనే సంగతి బహిరంగ రహస్యమే. దీనిని రద్దుచేసి, ఇతర స్వతంత్ర దేశాలలోని పద్ధతులను అనుసరించి ఈ దేశమునకు అనుకూలంగా వక విద్యాప్రణాళికను ఏర్పరచవలె నని ౨౦ సంవత్సరములనుండి ఆందోళన సలుపుతూ వున్నప్పటికీ నేటికీ గతీమోక్షమూ లేకుండా వున్నది కాబట్టి ఇకనైనా త్వరపడవలె నని ఈ గ్రంథము ఉద్బోధిస్తావుంది. విద్యార్థులకూ, వారిపోషకులకూ, తత్ఫలితంగా సమస్తదేశానికీ అనర్థదాయకంగా వుంది ప్రస్తుత పద్ధతి. గనుక ఈ క్రమమును తొలగించి విద్యార్థియొక్క సుక్కలు హాజరుచుబట్టీ, విద్యాభ్యసనమును, అతని యోగ్యవర్తనను బట్టీ పైతరగతికి ఎక్కిస్తూ వుండాలి గాని ప్రస్తుత పరీక్షావిధానాన్ని అనుసరించకూడ దని ఇందు గట్టిగా వాదింపబడినది. సందర్భానుసారంగా ఇందనేక విషయాలు సోదాహరణంగా చర్చింపబడియున్నవి.

---

## ఎల్లోరా—అజంతా తీర్థయాత్ర

రచయిత : శ్రీ అడివి బాపిరాజుగారు. హైదరాబాదు ఆణాగ్రంథమాలవారి ప్రచురణము.

ద్వివిధరచనలలోనూ సమర్థులైనందున బాపిరాజుగారు తాము చూచినవానిని సవిమర్శకంగా, సంగ్రహంగా వర్ణించారు. ఎల్లోరా, అజంతాగుహలను చూడ గోరువారికీ చిన్న పుస్తకము మార్గదర్శిగా ఉపయోగపడుతుంది. అంతే కాదు, దీనిని బాగా చదివి గ్రహించుకొన్నయెడల దర్శకులు గుహలలోని చిత్రముల విశేషములనూ, భావభంగిమములనూ పైతము అవగాహనము చేసుకోగలుగుదురు.

---

## మైత్రా కథలు

అనువాదకుడు : శ్రీ చక్రపాణిగారు, యువకార్యాలయం, తెనాలివారిచే ప్రకటితం. వెల అ. ౬.

ఇది వక చిన్న చిన్న కథలపుస్తకం. పరాజయం, మెల్ల, ప్రత్యర్పణం, పరాయి అబ్బాయి అను నాలుగు కథ లున్నాయి ఇందులో. అసలు రచయిత యగు మైత్రా గారి కథానికా రచనా సామర్థ్యంలోగల సుగుణాలను లెక్కించడాని కిక్కడ అవకాశముచాలదు. కానీ ఆయనరచనలయందు ప్రధానపాత్రల భావచిత్రణా శిల్పము మహా చమత్కారంగా ఉందనిమాత్రము చెబితే చాలు. వెల్లడిస్తేనే తప్ప చక్రపాణిగారి అనువాదాలు అనువాదా లనిపించవు. వీరి యనువాదాలు అసలు రచనలకు వన్నెతెచ్చేలాంటివి.

---

## దీపావళి

గ్రంథకర్త: శ్రీ చలసాని రామారాయ్‌గారు, ప్రకాశకులు: విజ్ఞానసాహిత్యవనమండలి, బెజవాడ వెల ౦-౬-౦.

కథా, పేటాడ్డు, కరువులో అధికమాసం, డైరెక్టరు అనే నాలుగు కథానికల సంపుటి. ఈ కథలన్నీ ఇదివరలో ఇతరత్రా ప్రకటితమైనవే. 'కథ'లో గోపాలరావను యువకుడు తన సర్వనాశనానికి కారణభూతుడైన వెంకటరత్నం అను ఒక నీచ స్వభావుని స్వయంగా వధించి కసి దీర్చుకొన్నాను గదా అనే ఆనందంతో సర్కారువా రిచ్చిన మరణదండనను శాంతంగా స్వీకరిస్తాడు. అదివరకే అతనిని వరించియుండిన సరళ అను కన్యక అతడు హంతకుడని తెలిసికూడా అతనిని శిక్షనుండి తప్పించి అతనినే చేపట్టవలెనని ప్రయత్నిస్తుంది. అందుల కతడు సమ్మతింపడు. తన వక్కడి ప్రాణాలనే గాక తనవంటి నిర్భాగ్యుల ఎందరి ప్రాణాలనో రక్షించే ప్రయత్నం చెయ్యమని ఆమెకు బోధించి అతడు ప్రాణాలను వదులుతాడు. 'కరువులో అధికమాసం' అనేకథలో పుస్తకాలమ్మేవాళ్లు గ్రంథకర్తల నెట్లు మోసగించేదీ విశదమవుతుంది. వాగ్దానంలో సినిమాతారల వలపులో చిక్కి నాశనము గానున్న ఒక యువకునిని భార్య రక్షించడమే వస్తువు. కథారచయిత ఆశించినలాగు మన సంఘంలో గల కళ్మలాన్ని దూరంచేయడానికి ఈ నాలుగూ చాలవు. ఇంకా ఎన్నో కావాలి.

---

## మాలతీగుచ్ఛము

కర్త: శ్రీ మాడపాటి హనుమంతరావుగారు. హైదరాబాదు ఆణా గ్రంథమాలవారి ప్రచురణము.

'ఎవరికి', 'విధి ప్రేరేపణము' అను రెండు చిన్న కథానికల సంపుటి. మొదటిది రాజకీయం, రెండోది సాంఘికం. మొదటిదానిలో ఒక జమీందారు తన యిలాకా రయితులవద్దనుండి అక్రమపద్ధతుల మీద శిస్తులనూ, బాకీలనూ రాబట్టుకోవజాలక తంటాలు పడుతూ ఒక స్వార్థరహితుడైన యువకుని మూలంగా తనకు రావలసిన ధనమునంతనూ రాబట్టుకోవగలుగుతాడు. కాని ఈజమీందారు రైతులను రాజీ పరచడంలో యువక మోహనరావు జీవితము బలి అవుతుంది. అంతిమదశలో మాత్రము జమీందారు మోహనరావు యొక్క నిష్కల్మషమైన నడవడిని గుర్తెరిగి పశ్చాత్తాపపడుతాడు. కాని లాభం?

రెండోకథలో ప్రతాపుడూ, పద్మనాభుడూ అనే ఇద్దరు అన్నదమ్ములు- విక్రమపుర సంస్థానాధిపతులు. కార్యాంతరమున ప్రతాపుడు అన్యప్రాంతమునకు పోయియున్న కాలమున పద్మనాభుడే లోకప్రియుడై జనరంజకముగా పాలనము గావించుచుండును. ప్రతాపుడు తిరిగి వచ్చినపిదప భోజనసమయమందు గలిగిన భారతి యొక్క ఒక పొరబాటువలన అతడు ఆమెనూ, తమ్మునీ సందేహించి ఆమె పాతివ్రత్యమును ఋజువుపరచుకొను నిమిత్తము తమ్మునికి విషము నియ్యమని ఆజ్ఞాపిస్తాడు. కాని అందుల కామె సమ్మతింపదు. ఈ సంగతి పద్మనాభునికి తెలిసి విషమును తానే మ్రింగి తానే తన నిర్దోషిత్వమును వెల్లడిపరుచుకొంటాడు.

---

## మణిమేఖల

రచయిత్రి: శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు. ఇదియు ఆణా గ్రంథమాలవారి ప్రచురణమే.

ఇందలిది చాణుక్యుడు చంద్రగుప్తుని మగధ రాజ్యమున కధిపతి గావించిన కథ. శైలి గ్రాంథికమైనప్పటికీ సరళమైనది. ముద్రారాక్షసాదులలోని పాత కథను మరల నేకరువు పెట్టకయే వానిని బొత్తిగా వదలకయే సందర్భోచితంగా ఇందు ప్రవేశపెట్టి ఒక చిన్న నవలలాగు చక్కని కథ కల్పించిన దీమె. మగధరాజ్య నూతన నిర్మాణకర్తలయిన చంద్రగుప్తాదులు నలందా విశ్వవిద్యాలయమున సైనికశిక్ష నంది గడిదేరిన యువకులు. మగధరాజ్య మహామంత్రి రాక్షసుడు. ఇతనికి పద్మగుప్తు డను కొడుకు, మణిమేఖల యను కూతురును గలరు. ఈమె వలచిన ప్రియుడు అరుణేశ్వరు డను పేరు గల నలందా విద్యార్థి. ఇతడును చంద్రగుప్తుని సహాధ్యాయియే. మగధపాలకు లైన మహానందుని కొడుకులు దుర్మార్గులై ప్రజలను బాధింప వారు తిరుగుబాటు చేయుదురు. చంద్రగుప్తుడు విద్రోహుల నాయ

క్షుడై, చాణుక్యుని ఉపద్రష్ట గావించుకొని అతని యాజ్ఞల పరిపాలించుచు క్రమముగా మహానందాదులను నిర్మూలనము గావించును. రాక్షసు డీ విద్రోహముల నణగింప వివిధోపాయముల పన్నును, గాని యతనికి జయము చేకూరదు. చంద్రగుప్తుని సహాధ్యాయి అయిన్యా అరుణేశ్వరుడు మణిమేఖలను పెండ్లాడి రాజపక్షమువారి కధిపతి యగును. కాని మహామాత్యుని కొడుకు పద్మగుప్తుడు చంద్రగుప్త సేనలకు ఆధిపత్యము వహించును. తుదకు చాణక్య నీతిముందు రాక్షస నీతి పరాజయ మొంది నందాదుల వంశనిర్మూలనముగా చంద్రగుప్తుడు మగధసార్వభౌముడును, అరుణేశ్వరుడు మహామాత్యుడూ, పద్మగుప్తుడు సర్వసేనాధిపతియూ నై నంతన మౌర్యశకమునకు బునాదివైచిరి.

ఈ మూడు పుస్తకములు లభించు చోటు :— శేశవ పల్లి కేపన్స్ అండు బుక్ స్టాల్స్ లిమిటెడ్, జాంబాగు, హైద్రాబాదు, దక్కను.

---

## ఖురానెషరీఫ్

తెనుగుతర్జుమా. వ్యాఖ్యాన సహితము. మొదటి సంపుటము. ౧,౨,3 కాండములు. రచయిత: మహమ్మద్ అబ్దుల్ గఫూర్, ఉర్దూమున్షీ, బోర్డు హైస్కూల్, చిత్తూరు.

వీరియత్న మెంతయో మెచ్చదగినది. లోగడ కొన్ని అనువాదము లున్నను ఈ అనువాదమునకు అవసర మున్నది. తెలుగులిపిలో మూలము, తెలుగు వ్యాఖ్యానము కలవు. ఈమౌల్వీ మున్షీ ఫాజిల్ గారు తమ పూనికను కొనవరకును సాగించి నెరవేర్తురని ఆశ.

---

## శ్రీ ఆహ్నికమంజరీ

సంగ్రహకర్త: శ్రీ కి. శేషగిరిరాయ శర్మగారు, ప్రాప్తిస్థానం: యస్. రామాచారిగారు, ౨౬, వాగోజీ రావు స్ట్రీటు – ట్రిప్లికేను, మద్రాసు. వెల ౦-౧౦-౦లు.

సదాచారదీపిక అనే కన్నడభాషా వ్యాఖ్యానంతో కూడివున్నది. ఇందు ఋగ్వేద, యజుర్వేదీయులకు పనికివచ్చు నిత్యకర్మానుష్ఠానమంత్రాలే గాక అనేక స్తోత్రములునూ గలవు. నిత్యధార్మిక కార్యానుష్ఠానపరులైన ఆస్తికులకు — ముఖ్యంగా మాధ్వుల కందరికీ దగ్గిర వుంచుకోవలసిన గ్రంథము.

## ౧. మొగలాయికథలు

కథకుడు: సురవరము ప్రతాపరెడ్డిగారు.

## ౨. సోమలింజం

కర్త: గొబ్బూరు రామచంద్రరావుగారు.

## 3. యం. యన్. రాయ్.

రచయిత: గుండవరము హనుమంతరావుగారు.

## ౪. నా కొడుకు

గ్రంథకర్త: ధనికొండ హనుమంతరావుగారు.

ఈ ౪ పుస్తకములును హైదరాబాదు దక్కన్‌లోని అణాగ్రంథమాల వారిచే ప్రచురించబడినవి.

౧. ౧వ భాగమువలెనే ఇదియు మనోజ్ఞమైయున్నది.

౨. సోమలింజమున కిది ప్రవేశిక యనదగును. సార్వజనీనమైన భాషాశైలిలో ఇట్టిగ్రంథము స్వల్పమూల్యమునకు లభ్యమగుట కిదియే మొదలు.

3. ఈతని కథ యిందు విశ్వృతము.

౪. ఇది ఒక కథానిక అనబడే కథ. పుం, స్త్రీ ప్రసక్తి కథావస్తువు.

---

## శ్రీ బ్రహ్మర్షి వేంకటరత్నద్యుతులు

స్వీయ జీవితప్రవచనము. ౫౦ పుటలు. శ్రీ వేంకటరత్నముగారు ఆంగ్లమున రచించినదాని కిది జనమంచి కామేశ్వర రావుగారి తెలుగు. బ్రహ్మర్షిగారి మనస్సుపోకడ, భావాల సౌరు ఇందు దివ్యాత్రముగ వ్యక్తములు.

---

## ౧. గ్రంథాలయోద్యమము

కర్త: సురవరము ప్రతాపరెడ్డి గారు. వెల ౨. ౬.

## ౨. నా భారతదేశయాత్ర

మూలము. హెచ్. ఎన్. బ్రెయిల్స్ఫర్డ్ - అనువాదకుడు: కాళోజి నారాయణరావుగారు. ౧౬౪ పుటలు. వెల ౨. ౮.

ఈ రెండు గ్రంథములును సికింద్రాబాదులో నున్న దేశోద్ధారక గ్రంథమాలలో ౧౧, ౧౨ ప్రమరణములుగ ప్రకటించబడినవి.

౧. ఈ గ్రంథము ప్రతిగ్రంథాలయమునకును ఆవశ్యకమైనది.

౨. మూలగ్రంథము వెలువడిన పదిరేండ్లకు నేటికైనను వెల్వడిన తెలుగురూప మిది. దేశము 'గాడవ' నెరుగగోరు ఎల్లరును కొని, చదివి, చదివించి, వినిపించవలసిన గ్రంథ మిది.

## గ్రంథస్వీకారము

### కొండమ్మ పేరంటాలు

గ్రంథకర్త: ప్రతాప రామకోటయ్యగారు. ప్రచురణకర్త: గడ్డిపాటి వెంకటకృష్ణయ్యగారు, అమృతలూరుపోష్టు.

### మనస్తత్త్వం

రచయిత: బుర్రా వెంకటనారాయణాచార్యయ్యగారు, ఎం. ఏ. విద్యోదయ, తిరుమలపిళ్లైరోడ్డు, మాంబళము, మద్రాసు. వెల రు ౦-౮-౦.

### పండ్లు (మూడవభాగము)

కర్త: గోటేటి జోగిరాజుగారు. స్వయంపోషక కృషి ఆశ్రమము, పోష్టు కొండెవరం, వయా పిఠాపురం, తూర్పు గోదావరిజిల్లా. వెల రు. ౧-౮-౦.

### పండ్లదినుసులను నిల్వచేయుట

రచయిత్రి: శ్రీమతి ద్వారకాబాయి దేవు. అనువాదకుడు: గోటేటి జోగిరాజుగారు, శ్రీ గ్రామసేవా ప్రెస్, కొండెవరం, వయా పిఠాపురం, తూర్పు గోదావరిజిల్లా. వెల రు ౦-౬-౦.

### వాణిజ్యగణితశాస్త్రము (రెండవభాగం)

గ్రంథకర్త: బి. వెంకట రంగారావుగారు, రాజంపేట, కడపజిల్లా. వెల రు. ౧-౮-౦

### యామినీపూర్ణతిలకావిలాసము

గ్రంథకర్త: చెళ్లపిళ్ల వరకవిగారు. ప్రకాశకులు: కే. జి. మూర్తిగారు, శృంగార కావ్యగ్రంథమండలి, మచిలీపట్టణము. వెల ౧ రూ.

### చిత్రాసావిత్రీయము

రచయిత: ఐనాల వెంకటస్వామినాయుడుగారు, కాదంబరివారివీథి, విశాఖపట్టణము. వెల ౪. ౮.

---

## ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1941 సం. ఆగస్టు నెల) తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నవి. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1941 సం. సెప్టెంబరు 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగ్రహించి [?] గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

G 2, H 34, 36, 37, 38, J 7, P 16, 17, 18, R 14, 15, 33,
S 42, 45, 46, 47, 99, T 1, V 31, Y 3.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.